# తెలుగు జాతి వివేకం

## (నీతి ధర్మ లోకోక్తులు)

సంకలనం :
**డా॥ ఉండేల మాల కొండారెడ్డి**

పరిష్కర్త :
**వాచస్పతి, డా॥ కె. కుసుమారెడ్డి**



**రాజీవ్ గాంధీ వైజ్ఞానిక సాంకేతిక విశ్వవిద్యాలయం**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్

**రాజీవ్ గాంధీ వైజ్ఞానిక సాంకేతిక విశ్వవిద్యాలయం**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు - 500 028



Year of Publication 2009

Second Edition 2010

సంకలనం :

**డా॥ ఉండేల మాల కొండారెడ్డి**

పరిష్కర్త :

**వాచస్పతి, డా॥ కె. కుసుమారెడ్డి**

**Co-ordinator, RGUKT**

రివ్యూ కమిటీ సభ్యులు :

ప్రొఫెసర్, **టి. కిషన్‌రావు,** ఉస్మానియా యూనివర్సిటి

ప్రొఫెసర్, **టి. జయ మనోహర్,** పి.ఎస్. తెలుగు యూనివర్సిటి

*Translated by :*

**Seshavalli Sundararamaiah,**

Lecturer, Dept. of English, Retd. Principal,
Queen Mary's Junior College, Hyderabad.

సహకారం :

**పి. శ్రీలక్ష్మీ ప్రసన్న (విభా)**

సి.ఇ.టి.ఎల్.ఎస్., ట్రిపుల్ ఐటి, హైదరాబాదు

సాంకేతిక సహాయకులు :

**జె. బిక్షం, పి. అనిల్ కుమార్, యం. విశ్వనాథ్**

**వెల : రూ. 50/-**

ప్రతులకు :

**రిజిస్ట్రార్, రాజీవ్ గాంధీ వైజ్ఞానిక సాంకేతిక విశ్వవిద్యాలయం**

స్టేట్ కౌన్సిల్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్, మాసబ్‌ట్యాంక్,

మహావీర్ హాస్పిటల్ ఎదురుగా, హైదరాబాదు - 500 028

ముద్రణ :

**చంద్ర గ్రాఫిక్స్**

ఎస్.ఆర్.టి - 12, విద్యానగర్, హైదరాబాద్. ఫోన్ : 9866661485

**Dr. Raj Reddy**
Professor, Mozah Bint University &
Carnegie Mellon University
Pittsburg PA, USA

Chancellor,
Rajiv Gandhi University of
Knowledge Technologies
Chairman, IIIT, Hyderabad



# PREFACE

During my annual visits to India over the years, I had occasion to meet students, professsionals and managers of IT companies. Invariably, I was chagrined to find that almost none of them was familiar or comfortable with the culture and wisdom of Telugu - speaking people. They were not aware of many of the classic works in Telugu, the famous poets, or the history of our land.

I discovered that the primary culprit is our educational system. Any aspiring engineering or medical student is immediately channeled in to a specialized curriculum which essentially banishes humanities and social science subjects from the syllabus. Thus, some of our brightest students are never exposed to our culture, literature, geography and history, which is unfortunate. I was reminded of the starting paragraphs of Niiti Chandrika which states that an uneducated person might as well be viewed as a blind person because they have been denied the obvious lessons of life that are contained in our literature.

Recently, I was fortunate to be given an opportunity to help define the curriculum of a new university established by the AP Government, named Rajiv Gandhi University of Knowledge Technologies for educating gifted rural youth. This university offers a six year integrated progarm after the tenth class leading to a dual degree in IT and Engineering related subjects. This provided a unique opportunity to redefine the curriculum away from the early specialization that is usually the norm in the 11th and 12th class pre-university subjects and to provide all the students with a strong exposure to the Telugu Culture.

I was priveleged to have known Professor Malakonda Reddy, founder of Chaitanya Bharathi Institute of Technology, since our college days. Besides being an outstanding engineer, he is also a distinguished author and poet of Telugu literature. I requested him to create a first-year syllabus consisting of "pearls of Wisdom" from the literature of Telugu people. He graciously agreed and this book is the result of his deep understanding and knowledge of our culture. The book is organized so that each page contains one poem or a statement from historical works of Telugu literature. On each page, Professor Malakonda Reddy provides the meaning and a commentary of how the statement continues to be valid in our lives.

Every student at Rajiv Gandhi University must complete a course of study in Telugu literature involving these "Pearls of Wisdom". Not only do they have to participate in the discussion of the meaning and implications of each of these statements during class but they are also expected to be able to recite some of these at the end of each week and month as part of their course evaluation. If they fail to recall at least 90% of the works during the examination, they must re-take the exam the following week and continue until such time they can demonstrate 90% mastery.

It is my fervent hope that these "Pearls of Wisdom" will provide our future generations guidance to navigate through the trials and tribulations of life, or as they say in our culture, "Samsara Sagaram".

RAJ REDDY
September 18, 2008
(www.rr.cs.cmu.edu)

**డా॥ రాజ్‌రెడ్డి**
ఆచార్యులు, కంప్యూటర్ సైన్స్ & రోబోటిక్స్
కార్నీగీ మెల్లన్ యూనివర్సిటీ
పిట్సుబర్గు, అమెరికా

# పరిచయం

ఎంతోకాలంగా, నేను ప్రతి సంవత్సరం భారతదేశాన్ని దర్శిస్తున్నాను. అప్పుడు ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ నిపుణుల్ని, కంపెనీ యజమాన్యుల్ని, విద్యార్థుల్ని కలిసేవాణ్ణి. వారిలో ఎవ్వరికి కూడ తెలుగు వారి సంస్కృతితో గాని, వివేకంతో గాని తగినంత పరిచయం లేదని తెలుసుకొని బాధపడ్డాను. అంతేకాదు, తెలుగువారి ప్రాచీన గ్రంథాలు, ప్రసిద్ధ కవులు, చరిత్రను గూర్చి కూడా వారికి అవగాహన లేదని తెలిసింది.

ఈ పరిస్థితికి మూల కారణం మన విద్యావిధానమేనని నేను గ్రహించాను. ఇంజనీరింగు, వైద్య విద్య అభ్యసించదలచిన విద్యార్థులకు ప్రత్యేకమైన పాఠ్యాంశాలు నిర్ణయింపబడతాయి. అందులో మానవ సామాజిక సంబంధ శాస్త్రాలకు తావుండదు. ఈ విధంగా మేధావులైన ఎందరో విద్యార్థులకు మన సంస్కృతిని, సాహిత్యాన్ని, భూగోళ పరిస్థితిని, చరిత్రను, చదివే అవకాశం లేకుండా పోతున్నది. ఇది దురదృష్టకరం. ఈ సందర్భంగా నీతిచంద్రిక ప్రారంభంలో వున్న కొన్ని వచనాలు నాకు జ్ఞప్తికి వస్తున్నాయి. అందులో విద్యావిహీనుణ్ణి, గ్రుడ్డివానిగా చిత్రించారు. ఎందువల్లనంటే, అతనికి మన సాహిత్యంలోని జీవిత పాఠాలను చదివే అవకాశం లేదు.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు కుశాగ్రబుద్ధులైన గ్రామీణ యువకుల కోసం రాజీవ్‌గాంధీ నాలెడ్జి టక్నాలజీ విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. అందులో పాఠ్యాంశాలను నిర్ణయించే అదృష్టం నాకు దక్కింది. ఈ విశ్వవిద్యాలయంలో పదవ తరగతి తర్వాత ఆరేండ్లు చదివే కోర్సును ప్రవేశపెట్టారు. ఈ కోర్సు చదివిన వారికి ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, డిగ్రీతో పాటు ఇంజనీరింగుకు సంబంధించిన మరొక డిగ్రీ కూడా లభిస్తుంది. ఈ కోర్సులో పదకొండు, పన్నెండు తరగతులలో – అంటే ప్రస్తుతం ఇంటర్ మీడియట్ కోర్సులలో క్రొత్త పాఠ్యాంశాలను చేర్చే అవకాశం వుంది. అందులో విద్యార్థుల కందరికి మన తెలుగు సంస్కృతికి సంబంధించిన పాఠ్యాంశాలను బోధించవచ్చు.

ఆచార్య డా॥ ఉండేల మాలకొండారెడ్డి గారిని సహపాఠిగా, నా ఇంజనీరింగ్ విద్యార్థి దశ నుండి యెరుగుదును. ఆయన హైదరాబాదులోని చైతన్యభారతి ఇంజనీరింగ్ కళాశాలకు సంస్థాపక కార్యదర్శి, ప్రధానాచార్యులు. ఆయన పేరుపొందిన ఇంజనీరే కాదు, తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధ కవి కూడా. తెలుగు సాహిత్యంలోని ఆణిముత్యాల వంటి నీతుల్ని సేకరించి పై కోర్సులో మొదటి తరగతికి ఒక పాఠ్యాంశాన్ని తయారుచేయమని ఆయనను నేను కోరాను. ఆయన దానికి అంగీకరించినారు. దాని ఫలితమే ఈ గ్రంథం. ఈ గ్రంథంలో మన సంస్కృతిని గూర్చి ఆయనకున్న అవగాహన, విజ్ఞానం ద్యోతకమౌతుంది.

ఈ గ్రంథంలోని ప్రతి పుటలో తెలుగు పద్యం లేదా నీతి సూక్తి వుంటుంది. ప్రతి పద్యం లేదా నీతి సూక్తి యొక్క భావం, అది ఏ విధంగా నేటి మన జీవితానికి అన్వయిస్తుందో తెలియచేసే వ్యాఖ్యానం యిందు వెంట పొందుపరచబడ్డాయి.

రాజీవ్‌గాంధీ విశ్వవిద్యాలయంలోని ప్రతి విద్యార్థి, యీ నీతిసూక్తులతో కూడిన తెలుగు సాహిత్యాన్ని అధ్యయనం చేయవలసి వుంది. విద్యార్థులు పై సాహిత్యానికి సంబంధించిన చర్చలలో పాల్గొని, నీతి సూక్తుల్ని వారాంతంలో గాని, మాసాంతంలో గాని కంఠపాఠం చేయాలి. పరీక్షలలో కనీసం తొంభై శాతం ఉత్తీర్ణత సాధించాలి. అంతశాతం ఉత్తీర్ణత సాధించకపోతే, అది సాధించేవరకు అధ్యయనం చేయాలి.

ఈ నీతి సూక్తులు, భావిభారత పౌరులైన విద్యార్థులకు సంస్కార దిక్సూచిగా నిలిచి వారికి, తమ జీవితంలో సమస్యల్ని ఎదుర్కొనే శక్తిని ప్రసాదిస్తాయని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను.

ఇట్లు
**రాజ్‌రెడ్డి**
సెప్టెంబర్ 18, 2008

**Dr. V. Malakonda Reddy**
Ph.D. (Strucl.Engg.) Edinburg
'Bala Saraswati', ' Kavi Kiriti', 'Vidya Bhushan'

*Secretary/President*
A.P. Private Engineering Colleges
Managements Association
AV College Campus, Gaganmahal
Hyderabad - 500 029. A.P.

*President*
Federation of Associations of Managements of Unaided
Professional Educational Institutions in India

*Phones :*
Res : 040-23399188
Off : 040-23214674
Telefax : 040-27633300/23243127

*Founder Principal / Secretary*
Former Chairman / Advisor
Chaitanya Bharati Institute of
Technology (CBIT)
Gandipet, Hyderabad - 500 075

*Chairman*
Management Committee
Mediciti Institute of Medical Sciences
Ghanpur, Medchal Mandal, R.R. Dist.,
A.P.



# విన్నపం

తెలుగు జాతి చరిత్ర రెండువేల సంవత్సరాలపై మాటే. తెలుగులో తొలి పద్యకావ్యం రచింపబడింది వెయ్యి సంవత్సరాలకు ముందే. సంస్కృతంలో వున్న శ్రీమద్రామాయణం, శ్రీమదాంధ్ర భారతం, శ్రీమదాంధ్ర భాగవతం లాంటి పౌరాణిక గ్రంథాల అనువాదంతో పాటు, ప్రబంధ కావ్యాలు, నీతి శతకాలు, ఖండ కావ్యాలు, వచన రచనలు ఎన్నో స్వతంత్రంగా రచింపబడి, తెలుగు సాహిత్యానికి వన్నె దెచ్చాయి. ఈ గ్రంథాలలో ప్రధానంగా నీతి శతకాలలో తెలుగుజాతి వివేకం ప్రస్ఫుటమౌతుంది.

ఎన్నో శతకాలలోని పద్యాలు, వేమన పద్యాలు, భర్తృహరి సుభాషితాలు ఎంతో మందికి కంఠస్థం. ఇది క్రమంగా తగ్గిపోతున్నది. కారణం నేటి విద్యావిధానంలో పై గ్రంథాలు పాఠ్యాంశాలుగా లేకపోవడమే. అందువల్ల మేధావులైన ఎందరో విద్యార్థులకు, మన సాహిత్యంపై సంస్కృతిపై అవగాహన లేకుండా పోతున్నది. ఇది దురదృష్టకరం. ఈ పరిస్థితిని చక్కదిద్దాలని, ఎందరో మాతృభాషాభిమానులు ప్రయత్నిస్తున్నారు. ఈ మా చిన్ని ప్రయత్నం అందులో భాగమే. ఇటీవల అమెరికాలో పిట్సుబర్గులో కార్నీగీ మెల్లన్ యూనివర్సిటీలో ఆచార్యులుగా వున్న డా. రాజ్‌రెడ్డి గారు రాజీవ్‌గాంధీ నాలెడ్జి టెక్నాలజీ విశ్వవిద్యాలయానికి ఛాన్సలర్‌గా నియమింపబడ్డారు. ఆయనకు తెలుగు సాహిత్యంపై, తెలుగు సంస్కృతిపై అపరిమితమైన అభిమానం. పై విశ్వవిద్యాలయంలో ప్రవేశపెట్టబడ్డ ఆరేండ్ల ఇంజనీరింగు కోర్సులో ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరంలో తెలుగు సాహిత్యంలోని నీతిధర్మలోకోక్తుల్ని పాఠ్యాంశంగా చేయాలని వారు నిర్ణయించడం జరిగింది. ఈ సందర్భంగా ప్రస్తుత శతాబ్దికి అనుగుణంగా వుండే తెలుగు సాహిత్యంలోని నీతిధర్మ లోకోక్తుల్ని, 'తెలుగు జాతి వివేకం' పేరుతో సంకలనం

చేయవలసిందిగా డా॥ రాజ్‌రెడ్డి గారు నన్ను కోరారు. వారు చేసిన సూచనలను అనుసరించి తెలుగు సాహిత్యంలోని శతకాల నుండి, యితర గ్రంథాల నుండి, నా రచనల నుండి, నీతి చంద్రిక నుండి కొన్ని పద్యాలను, వచనాలను ఏరి, ఈ గ్రంథంలో చేర్చాను. సంక్షిప్తంగా అందలి భావాలను, నీతిని యిందులో పొందుపరిచాను.

పై పద్యాలలో, వచనాలలో వ్యక్తపరిచిన భావాలు ఆయా కవులు, రచయితలవి మాత్రమే. సమాజంలోని, ఏ మతాన్ని గాని, వర్గాన్ని గాని దృష్టిలో పెట్టుకొని ఈ సంకలనాన్ని కూర్చడం జరగలేదు. ఇందలి నీతులు, ధర్మాలు సర్వదేశాలకు, సర్వకాలాలకు సమ్మతంగా వుండాలని, వుంటాయని నేను భావిస్తున్నాను. ఈ గ్రంథంలోని నీతి ధర్మలోకోక్తులు, భావిభారత పౌరులైన మన విద్యార్థులకు మన తెలుగు సంస్కృతిపై అవగాహన కల్గించి, వారిని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దగలవని విశ్వసిస్తున్నాను.

కేంద్ర ప్రభుత్వం వారు తెలుగుభాషకు ప్రాచీన ప్రతిపత్తిని ఇటీవల కల్పించారు. ఇది తెలుగు జాతి గర్వించదగిన విషయం. కేవలం ప్రాచీన ప్రతిపత్తితో మనం సంతృప్తి పడకూడదు. తెలుగుభాషకు ఆధునిక ప్రతిపత్తిని కల్పించవలసి వుంది. అందుకు ఈ గ్రంథాన్ని ప్రథమ ప్రయత్నంగా భావించడం అతిశయోక్తి కాదు. ఎందుకంటే సాంకేతిక విద్యార్థులు ప్రపంచమంతా విస్తరిస్తున్న ఈ సమయంలో ఈ పుస్తకం వారికి పాఠ్యగ్రంథంగా చేయటంలో ఔచిత్యముంది.

సాంకేతిక విద్యార్థులు తాము జీర్ణించుకొన్న తెలుగుజాతి వివేకాన్ని ప్రపంచానికంతా పంచగలరని ఆశిస్తాం.

**– ఉండేల మాలకొండా రెడ్డి**

# ఎవరనుకొన్నారీ తెలుగువాడు

**రచన : డా॥ ఉండేల మాలకొండారెడ్డి**

ఎవరను కొన్నారీ తెలుగువాడు
ఎదురులేక దినదినం ఎదుగువాడు
ఆవేశం అతని గుర్తు అభ్యుదయం అతని సొత్తు
అఖిల దేశ మేధానిధులందరితో అతని పొత్తు

తెలుగు వాడు జగమంతా నేడు వెలుగుచున్నవాడు
ఇంటా బయటా పదారు కోట్ల బలగమున్నవాడు
తెలుగులెల్ల ఒక్క త్రాటిపై నడిచిన వాడు
భారతాన్ని ఏకంగా పాలించేవాడు
అనుకొన్నది సాధింపక, వెనుదిరగని వాడు
అనుక్షణం నవోదయం ఆశించేవాడు

తెలుగు నేలలో కలిమి వుంది, తెలుగు యువతలో బలిమి వుంది
తెలుగు పలుకులో తేనె వుంది, తెలుగు మెదడులో తెలివి వుంది
తెలుగు కళలలో తళుకు వుంది, తెలుగు నడకలో సొగసు వుంది
తెలివికి బలిమి తోడైతే, పలుకులు చేతలు ఒకటైతే
తెలుగులకు లేనిదేముంది! అన్నింట జయమేముంది!

**– సత్యం శివం సుందరం**

# విషయ సూచిక

# 1. ధర్మ పద్ధతి

**1.** **ఉర్వివారికెల్ల నొక్క కంచముబెట్టి**
**పొత్తు గుడిపి, కులము పొలయజేసి**
**తలను చేయిపెట్టి తగనమ్మజెప్పరో**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మానవులంతా ఒక్కటే. దానికి మరొక పేరు వసుధైక కుటుంబం. కాని పరస్పరం మానవులు జాతి మత భాషా ప్రాంత కుల భేదాలతో విడిపోయి పరస్పరం కలహించుకొంటున్నారు. ఇది మానవాళికి శ్రేయస్కరం కాదు. అందువల్ల ప్రపంచంలోని ప్రజలందరిని ఒకచోట చేర్చి, సహపంక్తి భోజనం ఏర్పాటు చేసి, పై భేదాలు మరచి ఐకమత్యంగా జీవించండి అని చాటింపు వేయాలి.

**నీతి :** మానవులంతా ఒక్కటే అని నిరూపించాలి.

**అర్థాలు :** ఉర్వి = భూమి; పొత్తు = స్నేహం; కంచం = పళ్లెం, తట్ట; పొలయజేసి = తొలగించి

**వ్యాఖ్యానం :** ఈనాడు ప్రపంచమొక చిన్న గ్రామంగా మారిపోయింది. దేశాల సరిహద్దులు చెరిగిపోతున్నాయి. వసుధైక కుటుంబమన్న సూక్తి నిజమౌతున్నది. జాతిమత కులాలను నిర్మూలించి, ప్రపంచ ప్రజలకంతా ఒక కంచం పెట్టి, సహపంక్తి భోజనం ఏర్పాటు చేసి, పొత్తు కలపమని వేమనకవి విశ్వమానవ సౌహార్ద్రాన్ని ఉద్బోధిస్తున్నాడు.

**Meaning:** All humanity is one. It has been known as ‘vasudhaika kutumbam’, which means that all human beings on earth belong to one great family. Men often divide themselves on grounds of race, religion, language or caste and quarrel among themselves. This bodes no good to the human race. Hence the poet suggests that entire mankind should gather at one place, eat and make merry together. They have to spread the message that all should remain united and live together happily.

Bodes = foretell

**Moral:** All mankind should live in brotherhood. All men should live together as one.



**2.** **కోపముసను ఘనత కొంచెమైపోవును**
**కోపముసను మనసు కుందుజెందు**
**కోపమడచెనేని కోరికలీడేరు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** కోపం వల్ల, ఒక వ్యక్తి యొక్క ఘనత తగ్గిపోతుంది. అతని మనస్సు శాంతిని కోల్పోతుంది. కోపం అణచుకొన్న వాడే తన కోర్కెలను సఫలీకృతం చేసుకోగలడు. అందువల్ల కోపాన్ని మీ హద్దులో పెట్టుకోండి.

**నీతి :** కోపం నిప్పు లాంటిది. అది నిలువునా దహించివేస్తుంది. కోపాన్ని జయిస్తే కోర్కెలు నెరవేరుతాయి.

**అర్థాలు :** ఘనత = గొప్పతనం; కుందు = దిగులు

**వ్యాఖ్యానం :** కోపం అంటువ్యాధిలాంటిది. అది నీవు ప్రదర్శిస్తే యెదుటివారికి అంటుకొంటుంది. ఇద్దరి మధ్య ఘర్షణ ఏర్పడుతుంది. కోపం వల్ల మనిషి ఘనత తగ్గిపోతుంది. మనస్సు శాంతిని కోల్పోతుంది. కోపాన్ని అణచుకొన్నప్పుడే కోరికలు నెరవేరుతాయి. ఇది గ్రహించి, ప్రతివారు కోపాన్ని అదుపులో పెట్టుకోవాలి.

**Meaning:** Anger makes man less worthy. Anger causes a person to lose his peace of mind. When one learns to keep his temper under control, he can certainly succeed in his aspirations. Hence temper should always be kept under firm control.
Aspiration = Desire, goal

**Moral:** Anger is like a flame, which can cause total destruction. If one can win over anger he is on the road to sure success.



**3.** **చంపదగినయట్టి శత్రువు తన చేత**
**జిక్కెనేని కీడు సేయరాదు**
**పొసగ మేలు చేసి పొమ్మనుటే చావు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** చంపదగిన బద్ధశత్రువైనా, నీ చేతికి చిక్కితే, అతనికి కీడు చేయకూడదు. పైగా, అతనికి మేలు చేసి పంపించడం మంచిది. అందువల్ల అతనిలోని శత్రువు చచ్చిపోతాడు. అతడు నీకు స్నేహితుడౌతాడు. అందువల్ల నీకు మనశ్శాంతి లభిస్తుంది. మనిషిని కాదు, మనిషిలోని శత్రువును చంపు.

**నీతి :** శత్రుత్వాన్ని మంచితనంతోనే జయించాలి.

**అర్థాలు :** పొసగ = తగినట్లు

**వ్యాఖ్యానం :** ప్రపంచంలో సుఖశాంతులు లేకుండా పోవడానికి కారణం ప్రజల మధ్య విరోధాలు. ఆ విరోధాలు కొట్లాటలకు, హత్యలకు దారితీస్తాయి. హత్యలతో పగ పెరుగుతుంది. పగకు ప్రతీకారం మొదలవుతుంది. దీనికి అంతు వుండదు. కాబట్టి పగను జయించాలంటే విరోధిని క్షమించి, అతనికి మేలు చేయాలి. అప్పుడు అతనిలో పగ చల్లారి పశ్చాత్తాపం ఏర్పడుతుంది. దీనివల్ల సమాజంలో శాంతి ఏర్పడుతుంది.

**Meaning:** If a bitter enemy is captured, do not harm or take revenge on him. It is sensible to help him and set him free. It will result in the enmity within him to fade away.

He can become a grateful well wisher and friend. That is bound to fill the heart with peace. Do not kill a man, kill the enmity in his heart.

**Moral:** Enmity has to be won over with charity and generosity. Forgiveness and generosity are certain to win an enemy over.



**4.** **చాకి, కోక లుతికి చీకాకు పడజేసి**
**మైల తీసి లెస్స మడిచినట్లు**
**బుద్ధి చెప్పువాడు గ్రుద్దితేనేమయా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** చాకలి గుడ్డను బండకేసి బాది, మురికి వదలగొట్టి, శుభ్రంగా మడతలు పెట్టి మనకందిస్తాడు. ఆ విధంగానే విద్యాబుద్ధులు నేర్పే విషయంలో గురువు, శిష్యుణ్ణి శిక్షించినా తప్పులేదు. శిక్షించడం విద్యార్థిని బాగుచేయడానికే కాబట్టి, శిష్యుడు దానిని అర్థం చేసుకోవాలి.

**నీతి :** శిక్షణలో శిక్ష కూడా ఒక పద్ధతి.

**అర్థాలు :** చాకి = చాకలి; కోకలు = గుడ్డలు; మైల = మురికి

**వ్యాఖ్యానం :** ఇక్కడ విద్యార్థుల శిక్షణను గూర్చి చెప్పబడింది. గురుశిష్యుల సంబంధం భక్తి వాత్సల్యాలతో కూడినది. వాత్సల్యంలో గురువు బోధించే విషయాలను శిష్యుడు భక్తితో విని, నేర్చుకొని పరీక్షలో ఉత్తీర్ణుడు కావాలి. శిష్యుడు అశ్రద్ధగా ప్రవర్తిస్తే, అతణ్ణి గురువు శిక్షించవలసి వుంటుంది. ఆ శిక్ష శిష్యుని మేలు కొరకే కాబట్టి అందులో తప్పులేదు. ఉదాహరణకు చాకలి మురికిని వదిలించే యత్నంలో బట్టలను బండకేసి బాదుతాడు. అది తప్పుకాదు కదా!

**Meaning:** The washer-man washes clothes on the washing stone, beats them hard, cleans them and neatly folds them before handing them over to us. Similarly a true student should realize, that when his teacher is sometimes forced to be harsh to him, he is guiding him on the right path. A teacher's punishment is meant only as a measure to discipline and steer him to a better life.

Steer = guide

**Moral:** Firm discipline is a part of education.



**5.	చేతులకు దొడవు దానము**
**భూతలనాథులకు దొడవు బొంకమి ధరలో**
**నీతియె తొడవెవ్వారికి**
**నాతికి మానంబు తొడవు నయముగ సుమతీ.**

**భావం :** చేతులకు అందం స్వర్ణ కంకణాలు ధరిస్తే రాదు, దానం చేస్తే వస్తుంది. రాజులకు సత్యవాక్పరిపాలన భూషణమౌతుంది. ప్రతివారికి నీతిగా బ్రతకడమే భూషణం. స్త్రీకి తన మానాన్ని కాపాడుకొనడం భూషణం. ఇట్టి సద్గుణాలనే భూషణాలు ధరించిన వారికి స్వర్ణ భూషణాలు అవసరం లేదు.

**నీతి :** అంతరంగ సౌందర్యమే అసలైన సౌందర్యం.

**అర్థాలు :** తొడవు = సొమ్ము, నగ; బొంకమి = అబద్ధమాడకుండుట; భూతలనాథుడు = రాజు; నాతి = స్త్రీ.

**వ్యాఖ్యానం :** శరీర సౌందర్యం కంటే మనస్సు యొక్క సౌందర్యం గొప్పది. దానం చేయటం చేతులకు సౌందర్యం. సత్యం పలకటం రాజులకు సౌందర్యం. నీతిగా బ్రతకడం ప్రతి మానవునికి సౌందర్యం. మాన సంరక్షణ స్త్రీలకు సౌందర్యం. ఈ సద్గుణాలు కలవారికి స్వర్ణ భూషణాలు అవసరం లేదు.

**Meaning:** Rich, golden bracelets do not add beauty to hands. Charity does. Truth and justice add glory to a king. An ethical and a moral life enhance one's life and make it better. Chastity and honour are precious to a woman. Virtues are far more beautiful ornaments than ornaments of gold.

Enhance = increase

Chastity = Purity

**Moral:** Inner beauty is true beauty.



**6.	తన కోపమె తన శత్రువు**
**తన శాంతమె తనకు రక్ష, దయ చుట్టంబౌ**
**తన సంతోషమె స్వర్గము**
**తన దుఃఖము నరకమండ్రు, తథ్యము సుమతీ.**

**భావం :** కోపం లేని వానికి శత్రువులుండరు. అతని శాంతమే అతణ్ణి రక్షిస్తుంది. అతడు ఇతరులపై చూపించే దయ ఆప్త బంధువుగా తోడుంటుంది. అతడు సంతోషంగా వుంటే, అదే స్వర్గం. అతడు దుఃఖంలో మునిగితే అదే నరకం.

**నీతి :** స్వర్గనరకాలు, నీ మనస్సులోనే వున్నాయి.

**వ్యాఖ్యానం :** ఇక్కడ అరిషడ్వర్గాన్ని గూర్చి చెప్పబడింది. మనస్సులో కామం, క్రోధం, మోహం, లోభం, మదం, మాత్సర్యం అనే ఆరుగురు శత్రువులు వున్నారు. ఆ శత్రువులను జయించినవారికి బయట శత్రువుల

వల్ల భయం వుండదు. కోపం లేని వానికి శత్రుభయం లేదు. శాంత స్వభావునికి వేరే రక్షణతో పని లేదు. హృదయంలో దయ గలవానికి వేరే బంధువులు అవసరం లేదు. స్వర్గ నరకాలన్నవి మానవుని మనస్సులోనే వుంటాయి. మానవుడు సంతోషంగా వుండడమే స్వర్గం. దుఃఖంలో మునిగిపోవడమే నరకం.

**Meaning:** Anger has always proved to be one's own enemy. A man of pleasant temperament has no enemies. His calm demeanour protects him. His tolerance and kindness to others remain as his best well-wishers. When he is happy, it is his heaven and his hell when he is sad.

Demeanour = manner of conducting one self

**Moral:** Joy of heaven, or pain of hell, is all a matter of the state of mind.



**7.** **నడువకుమీ తెరు వొక్కట**
**గుడువకుమీ శత్రునింట గూరిమి తోడన్**
**ముడువకుమీ పరధనముల**
**నుడువకుమీ యొరులమనసు నొవ్వగ సుమతీ.**

**భావం :** ఒంటరిగా ప్రయాణం చేయడం, విరోధి యింట్లో మెచ్చుకొంటూ భోజనం చేయడం, పరుల ధనాన్ని అపహరించడం, ఒరుల మనస్సును నొప్పించేటట్లు మాట్లాడడం మంచి పద్ధతులు కావు.

**నీతి :** ఒరుల మనస్సును నొప్పించకుండా ఉండడమే నిజమైన సంస్కారం.

**అర్థాలు :** తెరువు = దారి; కూరిమి = ప్రీతి; ముడవకు = దొంగిలించకు

**వ్యాఖ్యానం :** ఇక్కడ మానవుని ప్రవర్తన నియమావళిని గూర్చి చెప్పబడింది. సహచరులు లేకుండ ఒంటరిగా ప్రయాణం చేయడం క్షేమకరం కాదు. శత్రువైన వాని యింట్లో భోజనం చేయడం మంచిది కాదు. పరుల సొమ్మును ఆశించకూడదు. ఇతరుల మనస్సును నొప్పించే మాటలు మాట్లాడకూడదు. ఈ నియమాలను పాటించిన మనిషి యొక్క జీవితం హాయిగా నడుస్తుంది.

**Meaning:** Never travel alone. Do not accept food in an enemy's house, showering praise and compliments. Do not covet another's wealth. Never hurt the feelings of others with harsh words.

Covet = long to possess

**Moral :** A truly cultured man never hurts the feelings of others.



**8.** **సారపు ధర్మమున్ విమలసత్యము బాపము చేత బొంకుచే**
**బారము బొందలేక చెడబారినదైన యవస్థ, దక్షులె**
**వ్వార లుపేక్షసేసిరది వారలచేటగు గాని ధర్మని**
**స్తారకమయ్యు సత్య శుభదాయకమయ్యును దైవ ముండెడున్.**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** పాపాలు చేయడం వల్ల ధర్మానికి, అబద్ధాలాడటం వల్ల సత్యానికి హాని కల్గుతుంటే, అది చూస్తూ ఉపేక్ష చేసే సమర్థులు తమకు తామే చేటు తెచ్చుకుంటారు. దైవం ధర్మాన్ని, సత్యాన్ని కాపాడి శుభాలను కల్గిస్తుంది.

**నీతి :** ధర్మాన్ని, సత్యాన్ని రక్షిస్తే అవి మనల్ని రక్షిస్తాయి.

**అర్థాలు :** సారపు ధర్మము = శ్రేష్ఠమైన ధర్మం; విమలసత్యము = నిర్మలమైన సత్యం; ధర్మ నిస్తారకమయ్యు = ధర్మాన్ని ఉద్ధరించేదిగాను; సత్యశుభదాయకమయ్యు = సత్యానికి మేలు కలిగించేది గాను.

**Meaning :** When wrongs are done, all that is right and good is harmed. Truth is always harmed by all that is false. If there is no protest made when wrongs are committed, they certainly destroy all the people who have remained silent. God protects all that is right and true, to give prosperity and happiness to all.

**Moral:** If truth and justice are protected, they will in turn protect all.



**9.** **ఒరు లేయవి యొనరించిన**
**నరవర! యప్రియము దనమనంబునకగు దా**
**నొరులకు నవి సేయకునికి**
**పరాయణము పరమధర్మపథముల కెల్లన్.**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** ఇతరులు ఏం చేస్తే తమకు బాధ కలుగుతుందో, అది యితరులకు చేయకుండా వుండడమే పరమోత్తమమైన ధర్మం. అన్ని ధర్మ శాస్త్రాల సారాంశమిదే.

**నీతి :** అన్ని జీవులు నీ వంటివే, అనుకొని ప్రవర్తించు.

**అర్థాలు :** ఒరులు = ఇతరులు; పరాయణము = శ్రేష్ఠం

**వ్యాఖ్యానం :** ధర్మమంటే యేమిటో ఇక్కడ చెప్పబడింది. ఇతరులు ఏమి చేస్తే తన కిష్టం వుండదో, అది యితరులకు తాను చేయకుండా వుండడమే పరమధర్మం. ఇది అన్ని మతాలు ఏకకంఠంతో ధర్మానికి చెప్పిన నిర్వచనం. దీనిని పాటించినట్లయితే లోకంలో స్థిరశాంతి యేర్పడుతుంది.

**Meaning:** If an action causes pain and suffering to one, he should take care that he does not cause the same pain and suffering to others. This remains the essence of all that is taught, by all holy faiths, all over the world.

**Moral:** Pain and suffering are the same to all. Before one hurts another, this should be remebered by everyone.



**10.** **జీవిత లక్ష్యాన్ని గూర్చి చెట్టేమని అంటుంది**
**ప్రతిఫలమును ఆశింపక ఫలము లీయమంటుంది**
**నడవలేదు గాని మంచి నడవడి చూపిస్తుంది**
**వాగ్దానాల్ చేయకుండ వరాలు కురిపిస్తుంది**
**ఎండలోన తానుండి నీడ నీకు ఇస్తుంది**
**వానలోన తాను తడిసి గొడుగు నీకు పడ్తుంది**
**అధికారికి తలవంచదు అనాథలను పొమ్మనదు**
**అందరిని ఒకే రీతి ఆదరించి చూస్తుంది**
**కోతి కొమ్మలూపినా తుంటరి రాల్ విసిరినా**
**పండీ పండని కాయలు బహుమతిగా ఇస్తుంది**
**సిద్ధార్థుని తన యొడిలో బుద్ధిగ కూర్చుండమని**
**బుద్ధునిగా ఉండేలా! బుద్ధిగరపి పంపింది.**

**– జీవనగీతాలు**

**భావం :** జీవిత లక్ష్యాన్ని చెట్టును జూచి మనం నేర్చుకోవాలి. చెట్టు ప్రతిఫలాన్ని ఆశించకుండా ఫలాలను ఇస్తుంది. నడవలేదు గాని మంచి నడవడి చూపిస్తుంది. వాగ్దానాలు చేయకుండ వరాలిస్తుంది. ఎండలో, వానలో తానుండి, అందరికి ఆశ్రయం కల్పిస్తుంది. అధికారులని, అనాథలని తారతమ్యం చూపదు. కోతులు, కొంటె కుర్రవాళ్లు, కొమ్మలూపినా, రాళ్లు విసిరినా వాళ్లకు తన కాయల్ని బహుమతిగా ఇస్తుంది. బుద్ధునికి చెట్టు క్రిందనే జ్ఞానోదయమయింది.

**నీతి :** చెట్టును అన్నిటికీ ఆదర్శంగా గ్రహించు. అట్టి చెట్టును పోషించి, పూజించాలి.

**అర్థాలు :** లక్ష్యము = గురి

**Meaning:** A tree shows the way as to how people should shape their attitudes. It seeks no reward from anyone in return. It cannot walk, yet it shows the path of right conduct. It showers benefits without holding out promises. It braves the rain and sun while giving shade to others. It never bows low before the rich and powerful. It does

not shun the meek and the poor. Monkeys may shake its branches and naughty boys may throw stones at it; but the tree in return gives them its fruit. Lord Buddha received his enlightenment under a tree.

Shun = reject

**Moral:** Man can learn a great deal from the example a tree sets.



**11.** **ధర్మ వర్తన లేని విద్యార్జనమ్ము**
**మానవత్వము లేని విజ్ఞాన గరిమ**
**శ్రమము లేకుండ వచ్చెడు సంపదయును**
**నీతి పాటింపనట్టి వాణిజ్య వృత్తి**
**స్వార్థ పూరితమైనట్టి సంఘసేవ**
**అంతరాత్మ మెచ్చని వినోదానుభవము**
**న్యాయ రహితమయిన రాజకీయ పదవి**
**భూతలమ్మున సాంఘిక పాతకములు.**

**– మహాత్మాగాంధీ సూక్తి**

**భావం :** ధర్మ వర్తన లేకుండా విద్యనభ్యసించడం, మానవత్వం లేకుండ శాస్త్ర విజ్ఞానాన్ని ఉపయోగించడం, శ్రమపడకుండా ఉపాయంతో ధనాన్ని ఆర్జించడం, నీతి పాటించకుండ వ్యాపారం చేయడం, స్వార్థంతో సంఘసేవ చేయడం, అంతరాత్మ వద్దంటున్నా యితరులను హింసించి ఆనందం పొందడం, న్యాయం లేకుండ రాజకీయాలు నడపడం – అనే ఈ యేడు సాంఘిక పాతకాలు. ఈ పాతకాలను ఎవ్వరూ చేయకూడదు.

**నీతి :** మన లోపాలు సమాజానికి శాపాలు కాకూడదు కనుక ప్రతివారు తమ లోపాలను తొలగించుకోవాలి.

1. విద్యార్థి విద్యతో పాటు సత్ప్రవర్తన అలవర్చుకోవాలి. సంఘంలో మంచి పౌరుడుగా ఎదగాలి. సత్ప్రవర్తన లేని విద్యాభ్యాసం సాంఘిక పాతకం.

2. విజ్ఞానాన్ని లోక కళ్యాణానికి ఉపయోగించాలి. విధ్వంసానికి కాదు. అణు రహస్యాలను మానవుడు తెలుసుకొన్నాడు. దానితో ఆటంబాంబులు తయారుచేసి విధ్వంసాన్ని సృష్టిస్తున్నాడు. ఇది సాంఘిక పాతకం.

3. ప్రతి వ్యక్తి శ్రమపడి, ధర్మబద్ధంగా ధనాన్ని అర్జించాలి. తాను శ్రమపడకుండా ఇతరుల శ్రమను దోచుకొని వారిని నష్టాల పాలు చేసి అన్యాయంగా డబ్బు సంపాదించడం సాంఘిక పాతకం.

4. వాణిజ్యం దేశం యొక్క ఆర్థిక సంపదను పెంపొందించడానికి అవసరం. అందులో నీతిని పాటించాలి. ధరలలో తూకాలలో మోసం చేసి వ్యాపారం సాగించడం సాంఘిక పాతకం.

5. సంఘంలోని నిరుపేదలకు, అనాథలకు సేవ చేయాలి. అది నిస్వార్థంగా వుండాలి. సేవ ముసుగులో సొంత లాభాలను పొందడం సాంఘిక పాతకం.

6. వినోదం మానవ జీవితానికి అవసరం. కాని అది యితరులకు బాధ కలిగించకూడదు. అంతఃకరణం దానిని అంగీకరించాలి. అలా కాకుండా ఇతరులను బాధించి వినోదాన్ని అనుభవించడం సాంఘిక పాతకం.

7. ధర్మం, న్యాయంతో కూడిన పాలన ప్రజలకు అందించడం ప్రభుత్వం బాధ్యత. అట్టి పాలనను అందించే రాజకీయ నాయకులు సచ్ఛీలురై వుండాలి. సచ్ఛీలంలేని రాజకీయ పదవి సాంఘిక పాతకం. ఏ పౌరుడు గాని యిట్టి పాతకాలకు ఒడిగట్టకూడదు.

**Meaning:** Acquiring education without right conduct, pursuing science without human values, earning easy money without working hard for it, earning from business without ethics, engaging in social work for selfish reasons, seeking pleasure against the dictates of conscience, participating in public life and politics without morality and justice, all remain as the seven unpardonable sins against society.

**Moral :** All efforts should be made to wipe out the faults within one self, before undertaking work to serve society.



**12.** **అలిగిన నలుగక యెగ్గులు**
**పలికిన మరి విననియట్ల ప్రతివచనంబుల్**
**వలుకక బన్నమువడి యెద**
**దలపక యున్న తడ చూవె ధర్మజ్ఞుడిలన్.**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** ఒకరు తన మీద అలిగినా, తాను అలుగకుండా వుండాలి. తనను నిందించినప్పుడు ఆ నిందావాక్యాలను వినీవిననట్లుండాలి. తాను అవమానింపబడ్డా, కలత చెందకూడదు. అట్టి వానినే ధర్మజ్ఞుడని పెద్దలంటారు.

**నీతి :** ధర్మం తెలిసినవాడు సహనం కలిగి వుండాలి.

**అర్థాలు :** అలుక = కోపం; ఎగ్గులు = దూషణలు, తిట్లు; బన్నము = అవమానం; తలకక = భయపడక

**వ్యాఖ్యానం :** ఇక్కడ ధర్మజ్ఞుణ్ణి గూర్చి చెప్పబడింది. ఒకరు కోపగిస్తే తిరిగి కోపగించనివాడు, ఒకరు దూషిస్తే, ఆ దూషణవాక్కులు వినీవిననట్లుండి తిరిగి దూషించనివాడు. తాను భంగపాటు చెందినా, ఏ మాత్రం బాధపడనివాడు ధర్మజ్ఞుడని పెద్దలంటారు. మనం అట్టి ధర్మజ్ఞులు కావడానికి ప్రయత్నించాలి.

**Meaning:** One should remain calm when someone goes against him. He should turn a deaf ear to the abuses hurled at him. He should not react if he is insulted. Such a man is a true, just and wise.

Hurl = throw

**Moral:** A true and a just man should have a great deal of patience.



**13.** **ముసలి తల్లిదండ్రి మొగమైన చూడక,**
**మసలుచున్న వగలమారి కొడుక!**
**ముసలి తనము నీకు ముందున్న దెరుగుము**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**- సత్యం శివం సుందరం**

**భావం :** తల్లిదండ్రులు వృద్ధులై వుంటే, వారిని ప్రేమతో చూడకుండా, వగలుపడే కుమారుడు ఒక విషయం తెలుసుకోవాలి. అతడు కూడా ఒకనాడు ముసలివాడవుతాడు. అతని పిల్లలు కూడ అతణ్ణి ప్రేమతో చూడరు.

**నీతి :** ముసలి తల్లిదండ్రులను ప్రేమించు.

**వ్యాఖ్యానం :** తల్లిదండ్రులను ప్రేమించడం కుమారుని ధర్మం. ముసలితనంలో వారికి సేవచేయడం అతని బాధ్యత. ఆ బాధ్యతను మరచిన కుమారుడొక విషయం గుర్తుంచుకోవాలి. అతడు కూడ ఒకనాడు వృద్ధుడౌతాడు. అప్పుడతని కుమారుడు అతనికి సేవ చేయకపోతే, కలిగే బాధయెట్టిదో అతనికి తెలుస్తుంది.

**Meaning:** Parents should be taken care of in their old age by their sons. They should never be left alone and unloved, or feel abandoned. The son should realize that one day he too will be old and infirm and his children may abandon him too.

Abandon = desert, fosake responsibility

Infirm = weak

**Moral:** It is the duty of children to take care of old parents and give them love.



**14. నరుని గీత మీద నడచును పొగబండి,**
**జాతి నడచు, ఋషుల గీత మీద,**
**గీత దాటిరేని కీడు రెండింటికి**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** నరుడు వేసిన పట్టాల గీత మీద, పొగబండి నడుస్తుంది. మన ప్రాచీన ఋషులు వేసిన ధర్మాల గీత మీద, జాతి నడుస్తుంది. ఇందులో ఎవరు గీత దాటినా ప్రమాదం సంభవిస్తుంది. కాబట్టి మనం ధర్మ మార్గంలో నడవాలి. అప్పుడే మన జీవితం సుఖశాంతులతో నడుస్తుంది.

**నీతి :** ధర్మ మార్గంలోనే వుంది జాతి భవిష్యత్తు.

**వ్యాఖ్యానం :** ప్రతి జాతికి లేదా మతానికి వారి ప్రవక్త ప్రవచించిన ధర్మ శాస్త్రం వుంటుంది. ఆ ధర్మ శాస్త్రంలో చెప్పబడిన నీతి నియమాలను ఆ జాతి లేదా మతం వారు అనుసరిస్తారు. అనుసరించకపోతే ఆ జాతి లేదా మతం భ్రష్టమౌతుంది. ఉదాహరణకు మనం రైలు బండి మీద ప్రయాణించడానికి ఇనుప పట్టాలు నేల మీద బిగిస్తాము. రైలు బండి ఆ పట్టాల మీద నడిచినంత కాలం క్షేమంగా గమ్యం చేరుకుంటుంది. పట్టాలు తప్పితే అది క్రింద పడిపోయి ముక్కలౌతుంది. కాబట్టి ధర్మాన్ని తప్పి చరించేవారు పతనమౌతారు.

**Meaning:** A train runs on the rails laid by man. Society moves on the guidelines laid down by the wise sages of the past. If these guidelines are not observed, great harm and destruction can be caused. Hence all men have to choose the righteous path in life to bring joy and happiness to all.

Righteous = upright, honest, virtuous.

**Moral:** The future of all mankind depends on the path of truth and justice.



# ౨. నీతి పద్ధతి

**15.** **నవ్వకుమీ సభ లోపల**
**నవ్వకుమీ తల్లిదండ్రి నాథులతోడన్**
**నవ్వకుమీ పరసతితో**
**నవ్వకుమీ విప్రవరుల, నయమిది సుమతీ.**

**భావం :** పదుగురున్న సభలో నవ్వకూడదు. తల్లిదండ్రుల ముందు, పై అధికారుల ముందు నవ్వకూడదు. పరస్త్రీని చూచి నవ్వకూడదు. విద్యాధికులైన పెద్దల ముందు నవ్వకూడదు. నవ్వు నాలుగందాల చేటు అన్నారు పెద్దలు. సమయం సందర్భాలు లేకుండా నవ్వడం ఇతరులను అవమానించినట్లవుతుంది. అది మంచి సంప్రదాయం కాదు.

**నీతి :** అసందర్భంగా నవ్వకు, ఆపదలు కొనితెచ్చుకోకు.

**అర్థాలు :** నాథుడు = ప్రభువు, అధికారి; పర సతి = పరస్త్రీ; విప్రవరులు = బ్రాహ్మణులు

**వ్యాఖ్యానం :** నవ్వు మానవునికి దైవమిచ్చిన వరం. జంతువులు నవ్వలేవు. నవ్వు ఎన్నో విధాలు. చిరునవ్వు, ఆనందపు నవ్వు, విషపు నవ్వు, భయంకరమైన నవ్వు, వెకిలి నవ్వు లాంటివి. స్నేహితులను, ఆత్మీయులను చూచినప్పుడు నవ్వేది చిరునవ్వు. దాని వెనుక ప్రేమానురాగాలుంటాయి. హాస్యోక్తులు విన్నప్పుడు నవ్వేది ఆనందపు నవ్వు. బద్ధ శత్రువుల్ని చూచినప్పుడు నవ్వేది విషపు నవ్వు. దాని వెనుక కోపం, ద్వేషం వుంటాయి. విరోధులపై దాడి చేసినపుడు నవ్వేది భయంకరమైన నవ్వు. దానినే వికటాట్టహాసం అంటారు. దాని వెనుక ప్రతీకారభావం, అహంకారం వుంటాయి. పిచ్చిపట్టినప్పుడు నవ్వేది వెకిలి నవ్వు. నవ్వులకు సమయసందర్భాలున్నాయి. పదుగురున్న సభలో అకారణంగా నవ్వకూడదు. ఆ నవ్వు అక్కడున్న వారిని అవమానించినట్లు అవుతుంది. తల్లి, తండ్రి, ప్రభువు ముందు నవ్వకూడదు. అది వారిని అగౌరవ పరిచినట్లు అవుతుంది. పరకాంత ముందు నవ్వితే అది అపార్థానికి దారితీస్తుంది. కాబట్టి నవ్వే ముందు నీవెక్కడ వున్నావో, సందర్భమేమిటో తెలిసికొని నవ్వాలి.

**Meaning:** One should never be seen laughing in the presence of a formal gathering, parents or higher authorities. Neither should one be seen laughing in the company of a woman. One should be careful not to make fun of scholars. Laughing at the wrong time or at a wrong place, can be misunderstood as an insult to those present. Such behavior is not acceptable in a cultured society.

**Moral:** Do not invite trouble by laughing at wrong moments. They give rise to misunderstandings.



**16.** **పరనారీ సోదరుడై**
**పరధనములకాసపడక, పరులకు హితుడై**
**పరులు దను బొగడ నెగడక**
**పరులలిగిన, నలుగనతడు పరముడు సుమతీ.**

**భావం :** పరకాంతను సోదరిగా చూసేవాడు, పరుల సొమ్ముకు ఆశపడని వాడు, పరులకు హితమైన కార్యాలు చేసేవాడు, పరులు పొగడితే పొంగిపోని వాడు, పరులు కోపగిస్తే కోపగించనివాడు పరమోత్తముడని పెద్దలంటారు.

**నీతి :** పరోపకారియే పరమోత్తముడు. 'పరోపకారాయ పుణ్యం, పరాపకారాయ పాపం' అన్నది గొప్ప సూక్తి. అంటే పరులకు మేలు చేయడం వల్ల పుణ్యం లభిస్తుంది. కీడు చేయడం వల్ల పాపం వస్తుందని అర్థం.

**అర్థాలు :** అలిగిన = కోపించిన; నెగడక = ఉబ్బిపోక; పరముడు = శ్రేష్ఠుడు

**Meaning:** A truly virtuous man is one who treats all women other than his wife, as sisters. He never covets others' possessions. He helps everyone, never elates to flattery and does not react to others' anger towards him.

elate = పొంగిపోవు; flattery = పొగడ్త

**Moral:** A truly virtuous man is one who lives and works for others' welfare. "Helping others is a virtue. Harming others is a sin" This is a very true statement.



**17.** **మాటకు బ్రాణము సత్యము**
**కోటకు బ్రాణంబు సుభటకోటి ధరిత్రిన్**
**బోటికి ప్రాణము మానము**
**చీటికి ప్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ.**

**భావం :** ఒకరికి మాటయిస్తే సత్యం తప్పకూడదు. సత్యమే మాటకు ప్రాణం. ఒక కోటను రక్షించేది మంచిభటులు. వారే కోటకు ప్రాణం, ఒక స్త్రీ తన మానాన్ని కాపాడుకొనడమే ఆమెకు ప్రాణం. ఒక చీటిని వ్రాస్తే అందులో వుండే చేవ్రాలే దానికి ప్రాణం. ఆ ప్రాణాలను కాపాడుకొనడమే నీతిమార్గం.

**నీతి :** మాటకు సత్యము, కోటకు మంచిభటులు, స్త్రీకి మానము, చీటికి చేవ్రాలు ప్రాణం లాంటివి.

**అర్థాలు :** సుభటులు = మంచి భటులు; బోటి = స్త్రీ

**వ్యాఖ్యానం :** ఇక్కడ మాటకు వుండే విలువను గూర్చి చెప్పబడింది. ఎవ్వరికి కూడ మాట యివ్వకూడదు. ఇస్తే దానికి కట్టుబడి వుండాలి. దీనినే సత్యం అంటారు. మాటకు సత్యం ప్రాణం. ఒక కోటను శత్రువుల నుండి కాపాడాలంటే సుశిక్షితులైన భటులు అవసరం. వారు లేకపోతే కోట పరుల పాలవుతుంది. కాబట్టి మంచి భటులు కోటకు ప్రాణం. స్త్రీ తనను తాను అత్యాచారాలు చేసే వారి నుండి రక్షించుకొనే శక్తి కలిగి

వుండాలి. అదే స్త్రీకి ప్రాణం. ఒక వ్యక్తి ఉత్తరాన్ని బంధువులకు లేదా మిత్రులకు వ్రాయవచ్చు. అందులో ఎన్నో మంచి విషయాలుండవచ్చు. అందులో అతని చేవ్రాలు లేకుంటే ఆ విషయాలకు విలువ వుండదు. కాబట్టి చీటికి చేవ్రాలు ప్రాణం.

**Meaning:** Truth in the spoken word, loyal soldiers to defend a fort, virtue in a woman and the acknowledgement of the written word are vital.

**Moral:** Standing by one's word, having brave soldiers to defend a fort, self-respect to a woman and the acknowledgement found in a letter are vital, like the life-force.



**18.** **లావు గలవానికంటెను**
**భావింపగ నీతిపరుడు బలవంతుండౌ**
**గ్రావంబంత గజంబును**
**మావటివాడెక్కినట్లు మహిలో సుమతీ.**

**భావం :** దేహ బలం కలవాని కంటె బుద్ధిబలం గలవాడు బలవంతుడు. కొండంత శరీరం గల ఏనుగునెక్కి చిన్న మావటీడు తన బుద్ధిబలంతో నడిపిస్తాడు గదా!

**నీతి :** బాహుబలం కంటే బుద్ధిబలం గొప్పది.

**అర్థాలు :** గ్రావము = కొండ; గజము = ఏనుగు

**వ్యాఖ్యానం :** ఇక్కడ నీతి యొక్క గొప్పదనాన్ని గూర్చి చెప్పబడింది. కేవలం దేహబలం కలవాని కంటే నీతిపరుడు బలవంతుడు. మహాభారతయుద్ధంలో దేహబలం కలిగిన నూరుగురు కౌరవులు, నీతి బలం కలిగిన ఐదుగురు పాండవుల చేతిలో ఓడిపోయారు. ఉదాహరణకు కొండంత శరీరం కలిగిన ఏనుగును ఒక చిన్న మావటీడు తన బుద్ధిబలంతో నడిపిస్తున్నాడు. కాబట్టి, పశుబలంతో గాదు నీతి బలంతో మనం కార్యాలను సాధించాలి.

**Meaning:** Brain is always superior to brawn. The elephant despite its huge size remains obedient to the mahout who rides on it and controls it.
Brawn = muscle, strength

**Moral:** An intelligent man is always stronger than a man of muscle.



**19.** **వినదగు నెవ్వరు సెప్పిన**
**విని నంతనె వేగపడక వివరింపదగున్**
**గని కల్ల నిజము లెరిగిన**
**మనుజుడె పో నీతిపరుడు మహిలో సుమతీ.**

**భావం :** ఎవ్వరు చెప్పినా, ఆ మాటల్ని శ్రద్ధగా వినాలి. విన్న తర్వాత తొందరపడకుండ విచారించి వివరాలు తెలుసుకోవాలి. లోతుల్లోకి వెళ్లి అందలి నిజాన్ని తెలుసుకోగలవాడే నీతిపరుడు.

**నీతి :** ఓర్పుతో, నేర్పుతో తీర్పు చెప్పేవాడే నీతిపరుడు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ ఎవడు నీతిపరుడో చెప్పబడింది. పెద్దల ముందు తమ కష్ట సుఖాలను గూర్చి, న్యాయాన్యాయాలను గూర్చి, ఎందరో విన్నవించుకొంటారు. చిన్న పెద్ద అనే భేదం లేకుండ ఆ విన్నపాల్ని విని, తొందరపాటు లేకుండ, నిష్పక్షపాతంగా విచారించి, నిజం తెలుసుకొని, తీర్పు చెప్పగలిగినవాడే నీతిమంతుడు.

**Meaning:** It is wise to listen carefully to others. Without haste, one should think about what he has heard and gather enough information. After a deep and careful examination of all the facts he should arrive at a conclusion that is fair and impartial. A man who does this is a man of truth and integrity.

Integrity = honesty

**Moral:** A man of honour is one who gives a patient hearing, examines fairly and justly and then arrives at a conclusion.



**20.** **తీయని పదార్థమొకడివే, తినగబోకు**
**అతిథులకు ముందుపెట్టి నీవారగించు,**
**వైరియైన నీయింటికి వచ్చినపుడు**
**ఉచిత మర్యాదలొనరించు, మోర్మితోడ.**
**– సత్యం శివం సుందరం**

**భావం :** ఇక్కడ ఆతిథ్య ధర్మాన్ని గూర్చి చెప్పబడింది. అతిథిదేవోభవ అన్నారు పెద్దలు. అంటే అతిథిని దేవునిలా భావించమని అర్థం. నీ చేతిలో ఒక తీపి పదార్థముంటే దానిని ఒక్కడివే భుజించకూడదు. పదుగురితో కలిసి భుజించాలి. అతిథులు తిన్న తర్వాతనే, నీవు భోంచేయాలి. విరోధియైనవాడు కూడ నీ యింటికి వస్తే ఓర్పుతో సకల మర్యాదలు చేసి పంపాలి. ఇది మన సంప్రదాయం. ఇందువల్ల సమాజంలో పరస్పర ప్రేమానురాగాలు పెరిగి, జీవితంలో ఆనందం వెల్లివిరిస్తుంది.

**నీతి :** అతిథిని దేవునిగా భావించు.

**అర్థాలు :** ఆరగించు = తిను; వైరి = విరోధి; ఓర్మి = ఓర్పు

**Meaning:** This verse is about the duties of a host towards his guest. A guest should be honoured as if he is divine. A sweetmeat in hand should never be eaten alone. It should be served to others first. The rules of a perfect host should be observed carefully even if an enemy were to be the guest. This is the culture of this country. Such behavior makes love and brotherhood grow in society spreading joy and happiness all around.

Sweet meat = మిఠాయి

**Moral:** A guest is to be treated as a divine visitor.



**21.** **వెలది, జూదంబు, పానంబు, వేట, పలుకు**
**ప్రల్లదంబును, దండంబు బరుసదనము**
**సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేత**
**యనెడు సప్తవ్యసనముల జనదు తగుల.**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** స్త్రీ లోలత్వం, జూదమాడుట, మద్యపానం, వేటాడుట, పరుషంగా మాట్లాడడం, కఠిన దండన, వృథాగా ధనాన్ని వెచ్చించడం అనేవి సప్త వ్యసనాలు. ఎవ్వరును ఈ వ్యసనాల జోలికి పోరాదు.

**నీతి :** మానవుడు వ్యసనాలకు దూరంగా వుండాలి.

**అర్థాలు :** పలుకుప్రల్లదంబు = చెడ్డగా మాట్లాడడం; పరుసదనము = కఠినత్వం.

**వ్యాఖ్యానం :** ఇక్కడ సప్త వ్యసనాలను గూర్చి చెప్పబడింది. స్త్రీలపై వ్యామోహం పెంచుకోకూడదు. అందువల్ల కలహాలేర్పడుతాయి. జూదాలలో పాల్గొనకూడదు. దాని వల్ల ధన నష్టం, మాన నష్టం జరుగుతుంది. మద్యపానం చేయకూడదు. అది మానసికమైన, శారీరకమైన అనారోగ్యానికి దారితీస్తుంది. జంతువులను వేటాడకూడదు. అది జీవహింసా పాపాన్ని అంటగట్టుతుంది. పరుషోక్తులు మాట్లాడగూడదు. అవి యెదుటివారి మనస్సును నొప్పిస్తాయి. ఎవరికైనను విధించిన దండన కఠినంగా వుండకూడదు. పొరపాట్లు చేయడం మానవ సహజం. అందుకని మితిదాటి ఒకనిని బాధపెట్టడం మానవత్వం కాదు. ధనాన్ని నిష్ప్రయోజనంగా వ్యయం చేయకూడదు. అందువల్ల ఆ ధనం అవసరమైన వారికి దక్కకుండా పోతుంది. మనిషి, యీ యేడు వ్యసనాలకు దూరంగా వుంటే సంఘంలో సుఖశాంతులు నెలకొంటాయి.

**Meaning:** Womanizing, gambling, drinking, hunting, harsh speech, cruelty in punishment and spending extravagantly are regarded as the seven vices. On should keep away from them.

**Moral:** A good human being should guard against all these vices.



**22.** **తగిన వేషంబు, దను దాన పొగడుకొనమి**
**నొచ్చియును గీడు పలుకమి యిచ్చి వగవ**
**కునికి, దనకెంత నడవకయున్న బథము**
**దప్పకుండుట నడవడి కొప్పు సేయు.**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** ఉచిత వేషం ధరించడం, తనను తాను పొగడుకోకుండా వుండడం, అవమానం పొంది కూడా తిరిగి దూషించకుండా ఉండడం, దానం చేసి అందుకు విచారించకుండా వుండడం, తనకెన్ని కష్టాలు వచ్చినా, ధర్మపథం తప్పకుండా వుండడం మంచి నడవడికి గుర్తులు.

**నీతి :** ఎన్ని కష్టాలు వచ్చినా ధర్మం తప్పకుండా వుండడం మంచి నడవడికి గుర్తు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ నీతిమంతుని నడవడి ఎలా వుంటుందో చెప్పబడింది. నీతిమంతుడు తగిన విధంగా వస్త్రాలను ధరిస్తాడు. తనను తాను పొగడుకోడు. ఇతరులు తనను నొప్పించినా, వారిని గూర్చి చెడ్డగా మాట్లాడడు. ఒకరికి దానమిచ్చి తర్వాత చింతించడు. తనకు పూటగడవని పరిస్థితులెదురైనా, ధర్మ మార్గాన్ని తప్పడు. ఇవి నీతిమంతుని లక్షణాలు.

**Meaning:** A virtuous man should be suitably dressed and not indulge in self-praise. If someone insults him, he does not react angrily. He never regrets his generosity to someone. Even when he is in dire trouble, he does not stray from the path of right conduct. He has all the qualities of a man of honour.

**Moral:** The test of true virtue is never to stray from the right path, no matter whatever troubles or dangers one has to face.

Stray = deviate from the right path, wander away.



**23.** **తనువున విరిగిన యలుగుల**
**ననువుగ బుచ్చంగవచ్చు, నతినిష్ఠురతన్**
**మనమున నాటిన మాటలు**
**విను మెన్ని యుపాయములను వెడలునె యధిపా!**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** శరీరంలో గుచ్చుకొన్న బాణాలను సులభంగా బైటికి లాగవచ్చు. మిక్కిలి నిష్ఠురంగా మనస్సులో నాటిన మాటల్ని, ఎన్ని ఉపాయాల చేతనైనా తొలగించడం సాధ్యం కాదు. అందువల్ల పరుషంగా మాట్లాడడం మంచిది కాదు.

**నీతి :** మనస్సు గాయపడితే మాన్పలేము.

**అర్థాలు :** అనువున = సులభంగా; తనువు = శరీరం.

**వ్యాఖ్యానం :** మనస్సు చాలా సున్నితమైనది. నిష్ఠురంగా మాట్లాడిన మాటలు వాడి బాణాల లాగా గుచ్చుకొంటాయి. ఆ బాణాలను ఎన్ని ఉపాయాలు పన్నినా లాగివేయడం సాధ్యం కాదు. అదే శరీరంలో గుచ్చుకొన్న బాణాలను సులభంగా తీసివేయవచ్చు. ఆ గాయాలను మాన్పవచ్చు. ఇది దృష్టిలో పెట్టుకొని, మనం పరుషోక్తులు మాట్లాడకూడదు.

**Meaning:** It is easy to remove the arrows that have pierced the body. It is impossible to remove the hurt of the harsh words that have pierced the heart.

Unsaid = without saying.

**Moral:** It is always wise to leave bitter words that hurt others, unsaid. Feelings that are hurt, never heal.



**24.** **లంచమిచ్చి, అధికలాభ మొందెడు వాడు**
**నిక్కమముగ పెద్దనేరగాడు**
**అతడు లేకయున్న అవినీతియే లేదు**
**మనస్సు విప్పి వినుము మంచిమాట.**

**- సత్యం శివం సుందరం**

**భావం :** లంచం పుచ్చుకొనేవాని కంటే, అధిక లాభం పొందాలనే ఆశతో లంచం ఇచ్చేవాడు పెద్ద నేరస్తుడు. అతడు లేకుంటే, అసలు అవినీతికి చోటుండదు.

**నీతి :** లంచమిచ్చే వాడు మొదటి నేరస్తుడు కాగా లంచం పుచ్చుకొనేవాడూ నేరస్తుడే.

**వ్యాఖ్యానం :** అవినీతికి కారణం కొందరి దురాశ. దురాశాపరులు, న్యాయవిరుద్ధంగా తమ కార్యాలను సాధించుకొని, లాభం పొందాలని, అధికారులకు లంచమిస్తారు. అవినీతిపరులైన అధికారులు లంచానికి ఆశపడి, వారి పనిని గుట్టుగా చేసిపెడతారు. ఇక్కడ లంచమిచ్చేవానినే మొదటి నేరస్తుడుగా భావించాలి. అతడు లేకుంటే, అవినీతికి అసలు చోటులేదు.

**Meaning:** The one, who offers a bribe for gain, is a greater offender than the one who accepts a bribe. If there is no one to offer a bribe, corruption cannot exist at all. Good advice needs to be heeded.

Heed = take notice

**Moral:** The one who offers bribe is the first offender, and the one who accepts the bribe is the second offender.



**25.** **క్రూరమైన లేమి కోరలలో చిక్కి**
**ఎండలోన బండలెత్తి, నేడు**
**కందిపోవు బాలకార్మికులను జూచి**
**బండరాయి గుండెబాదుకొనియె.**

**– మానవగీత**

**భావం :** దుర్భరమైన దారిద్ర్యంలో మునిగి, పసిమొగ్గలైన బాలబాలికలు చదువుకొనే అవకాశం లేక కార్మికులుగా బండలు మోయడం జూచి, బండరాళ్ళు గూడ గుండెలు బాదుకొంటున్నాయి. భావిభారత పౌరులైన బాలబాలికలకు పట్టిన యీ దురవస్థ దురదృష్టకరం. దీనిని రూపుమాపక పోతే దేశానికి భవిష్యత్తు ఉండదు.

**నీతి :** బాలబాలికలతో పని చేయించడం నేరం.

**వ్యాఖ్యానం :** బాల్యంలో పిల్లలు విద్యాబద్ధులు నేర్చుకోవాలి. ఆటపాటలతో జీవితాన్ని ఆనందంగా గడపాలి. కాని దుర్భర దారిద్ర్యం వల్ల వారు కార్మికులుగా మారి, బండలు మోసే పని చేస్తున్నారు. ఇది దారుణం. ఈ దారుణాన్ని చూచి బండలే గుండెలు బాదుకొంటున్నాయి. దేశమనే వృక్షానికి పిల్లలు పూవుల వంటివారు. పూవులను నలిపేస్తే ఆ వృక్షం ఫలించదు.

**Meaning:** Dire poverty drives children at a tender age to become labourers carrying heavy stones to make a living. This sight breaks the heart of even the hardest of rocks. It is unfortunate that the future citizens of India are deprived of education and are caught in such a heart-rending situation. There is no future for this country if this evil is not eradicated.

Eradicate = wipe out, erase

**Moral:** Child labour should be eradicated.



**26.** **విద్య బాల్యమందు, విషయసుఖంబులు**
**యౌవనమున, మనుజుడందుటొప్పు**
**ముసలితనము నందు, మునివృత్తి, చివరకు**
**యోగమందు, మరణమొందుటొప్పు.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** ఇక్కడ ఆర్ష సంప్రదాయాన్ని గూర్చి చెప్పబడింది. ఆర్ష సంప్రదాయం ప్రకారం బాల్యంలో ప్రతివారు బ్రహ్మచారులుగా వుండి విద్యాబుద్ధులు నేర్చుకోవాలి. యౌవనంలో వివాహం చేసుకొని గృహస్థులై భార్యతో సుఖసంసారం చేయాలి. వార్ధక్యంలో మునివృత్తిని స్వీకరించి, ఆధ్యాత్మిక చింతనతో కాలం గడిపి చివరకు

యోగంలో ప్రాణ త్యాగం చేయాలి. అందువల్ల సమాజంలో సామరస్యం ఏర్పడి, స్థిరమైన సుఖశాంతులు నెలకొంటాయి.

**నీతి :** ఏ వయసులో చేయాల్సిన పని ఆ వయసులో చేయాలి.

**అర్థాలు :** విషయసుఖంబులు = ఇంద్రియ సుఖాలు

**Meaning:** The sages of ancient times have laid down that children should acquire education early, discharge their duties as householders in youth and accept a philosophical attitude to life in their old age. Finally they should seek refuge in a peaceful death after living a life of renunciation.

Refuge = shelter; renunciation = పరిత్యాగం

**Moral:** A man has to live as per the principles and guidelines given by the sages, suitable for every phase of life from birth to death.



**27. కన్నతల్లి తండ్రి కలహించి విడిపోవ**
**ప్రేమ లేక పెరుగు పిల్లలిపుడు**
**నేరగాంద్రలోన జేరుచుండిరి సుమా**
**పగ, మనస్సులోన రగులుచుండ.**

**– మానవ గీత**

**భావం :** నేటి సమాజంలో భార్యాభర్తలు విడాకులు తీసుకోవడం ఎక్కువవుతున్నది. వారి పిల్లలు అనాథ శరణాలయాల పాలై, తల్లిదండ్రుల ప్రేమకు దూరమై పెరుగుతున్నారు. అట్టి పిల్లలు సంఘం మీద కసి పెంచుకొని నేరగాంద్రుగా మారిపోతున్నారు. దీనిని ఆపకపోతే భావి సమాజం భ్రష్టమైపోతుంది.

**నీతి :** తల్లిదండ్రులు విడిపోతే పిల్లలు చెడిపోతారు.

**Meaning:** In modern times, society is moving towards radical changes. Differences between parents are driving them towards divorce and separation. The children are torn emotionally, denied parental love and security, and they grow up with burning hate and bitterness in their hearts. They become antisocial and offenders against law. If this trend is not checked the future of society is in danger.

**Moral:** A broken home destroys the future of the children.



**28.** **కోట్లు ధనముండియును, మరికొన్ని కోట్లు**
**దొడ్డిదారిన ఆర్జించు దొరయొకండు**
**పస్తుతో దొంగపనికి పాల్పడునొకండు**
**వీరిలో ఎవ్వరసలైన నేరగాడు?**

**– మానవగీత**

**భావం :** లోకంలో రెండు రకాల దొంగలున్నారు. ఒకడేమో కోట్ల ఆస్తి ఉండి కూడ, దొడ్డిదారిన మరికొన్ని కోట్ల ఆస్తులు సమకూర్చుకొనేవాడు. ఇంకొకడేమో ఆకలి బాధకు తట్టుకోలేక అన్నాన్ని దొంగిలించి తినేవాడు. వీరిరువురిలో ఎవ్వరు అసలైన దొంగ అని తేల్చవలసి వుంది. శిక్షించవలసి ఉంది.

**నీతి :** ఆకలి తీర్చుకోవడం ప్రకృతి ధర్మం. అయినా అందుకు దొంగతనం చేయడం నేరం. దొడ్డిదారిన సంపాదించడం కూడా దొంగతనమే.

**వ్యాఖ్యానం :** ఆర్థికమైన అసమానతలే సంఘంలో సంక్షోభం సృష్టిస్తాయి. ప్రస్తుత ఆర్థిక విధానాల వల్ల, ధనవంతులైన వారికి ధనరాశులు పెరిగిపోతున్నాయి. పేదలు నిరుపేదలుగా మారిపోతున్నారు. కోట్ల ఆస్తులున్నవారు కొందరు మరికొన్ని కోట్ల ఆస్తుల్ని దొడ్డిదారిన సంపాదిస్తున్నారు. ఆకలి బాధను తట్టుకోలేక కొందరు అన్నాన్ని దొంగిలిస్తున్నారు. వీరిలో అసలైన నేరగాండ్రెవరో మనం గుర్తించి చర్య తీసుకోవలసిన అవసరం వుంది.

**Meaning:** There are two kinds of thieves. One is the kind who is very wealthy and still tries to secure more wealth through the back door. The other kind is the one who resorts to stealing food to satisfy his hunger. It has to be judged who between the two is the worse offender and deserves to be punished.

Resort = చేయడం

**Moral:** It is natural to want to satisfy hunger. Yet it is an offence to steal even for that reason. But to steal through the backdoor to become richer and richer is nothing but greed and it is a greater offence.



# ౩. వివేక పద్ధతి

**29.** **వాసనలేని పువ్వు, బుధవర్గము లేని పురంబు, నిత్యవి**
**శ్వాసములేని భార్య, గుణవంతుడు కాని కుమారుడున్ సద**
**భ్యాసము లేని విద్య, పరిహాసప్రసంగములేని వాక్యమున్**
**గ్రాసములేని కొల్వు కొరగానివి పెమ్మయ సింగధీమణీ!**

**– జక్కన**

**భావం :** ఇక్కడ ప్రయోజనం లేని విషయాలను గూర్చి చెప్పబడింది. ఎవ్వరును సువాసన లేని పూవును ముట్టుకొనరు. పండితులు లేని నగరానికి పోరు. విశ్వాసం లేని భార్యతో సంసారం చేయలేరు. బుద్ధిమంతుడు గాని కుమారునితో వేగలేరు. అభ్యాసం లేని విద్యతో ఫలితాన్ని పొందలేరు. పరిహాసం లేని ప్రసంగాన్ని యిష్టంగా వినలేరు. తిండికి జరుగని ఉద్యోగాన్ని చేయలేరు. ఇట్టి ప్రయోజనకరం కాని విషయాల నుండి దూరంగా వుండాలి.

**నీతి :** మంచి లేని దానిని ఎంచుకోవద్దు.

**Meaning:**- There are certain things which are of no use to anyone. A flower with no fragrance, a city that has no intellectuals or scholars, a wife who has no trust in her husband, a son of bad character, education without discipline and regular study, a speech that is not dotted with wit and humour and service without adequate payment are useless.

Intellectual = thinker

Scholars = learned men

In adequate = not enough

**Moral:** Never choose anything that is not useful.



**30.** **కాకేమి తన్ను తిట్టెనె?**
**కోకిల ధనమేమి తన్ను గోకొమ్మనెనే?**
**లోకము పగయగు, బరుసని**
**వాకున, జుట్టమగు మధురవాక్యము కలిమిన్.**

**– చాటువు**

**భావం :** కాకి మనల్ని తిట్టలేదు. కాని కర్ణ కఠోరంగా అరుస్తుందని దగ్గరకు రానీయం. కోకిల మనకు ధనమేమి ఇవ్వలేదు. కాని మధురంగా పాడుతుందని యిష్టపడతాం. అంటే లోకం ప్రియంగా మాట్లాడేవారికి చుట్టమౌతుంది. నిష్ఠురంగా మాట్లాడేవారికి విరోధి అవుతుంది. కాబట్టి ప్రియంగా మాట్లాడడం మనం అలవర్చుకోవాలి.

**నీతి :** నోరు మంచిదైతే, ఊరు మంచిది.

**అర్థాలు :** వాకు = వాక్కు, మాట

**Meaning:-** A crow does not abuse anyone. Still no one loves or admires it. The cuckoo does not shower wealth on anyone either, still it loved and favoured by all. Similarly, people are drawn to a person whose speech is soft and gentle. It is equally true that people shy away from those who speak harshly. One should always be careful to speak in a caring and a pleasant manner.

Admire = have praise for

Shy = move back

Favoured = preferred.

**Moral:** A person is liked by all if his speech is soft and pleasant.



**31.** **తన రహస్యము నొకనితో ననియు మరల**
**నితరులకు చెప్పవలదని హెచ్చరించు**
**కంటె, చెప్పకయుండుట కరము మేలు**
**నాల్క దాటిన మాటలు నగరు దాటు.**

**– దువ్వూరి రామిరెడ్డి**

**భావం :** ప్రతి వ్యక్తికి ఏవో రహస్యాలుంటాయి. ఆ రహస్యాలను ఒకరితో చెప్పి, మరొకరికి వాటిని చెప్పవద్దనటం కంటే అసలు చెప్పకుండడమే ఎంతో మేలు. అట్టి రహస్యాలు దాగవు, బయటపడుతాయి. 'నాల్క దాటితే నగరు దాటుతుంది' 'పెదవి దాటితే పెన్న దాటుతుంది' అనే సామెతలు అందుకే పుట్టాయి.

**నీతి :** ఎవరి రహస్యాలను వారి వద్దనే వుంచుకోవాలి.

**Meaning:-** It is usual for every person to have some secret or the other. It is better to be wise and never share ones secrets with others, rather than confiding in them, and then warning them not to tell others. Such secrets never remain secret, as the saying

goes "A secret that slips out of the tongue will slip out of the town too or anything that crosses the lips will cross the river too.

**Moral:** A secret should always be kept closely guarded and never confided to others.



**32.** **చదువు, సద్గుణమ్ము సౌందర్యమున్నట్టి**
**కన్య కొరకు గాక, కట్నమునకు**
**తనకు తానె అమ్ముకొనెడువాడవివేకి**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** చదువు, సద్గుణం, సౌందర్యం వున్న కన్యను వివాహం చేసుకోకుండా, వరకట్నం కోసం, తనను బజారులో అమ్ముకొని, యెవరినో పెళ్ళి చేసుకొనేవాడు అవివేకి. అతడు సంసారంలో సుఖించలేడు. పెళ్ళి రెండు ఆత్మల కలయిక. ఇద్దరి మధ్య వ్యాపారం కాదు.

**నీతి :** కట్నం తీసుకొనేవాడు అవివేకి, అంటే తెలివితక్కువవాడు.

**వ్యాఖ్యానం :** వివాహం స్త్రీ పురుషుల మధ్య పవిత్ర బంధం. అది నూరేండ్ల పంట. చదువు, సద్గుణం, సౌందర్యం వున్న వధువును పురుషుడు పెండ్లి చేసుకోవాలి. వరకట్నం కోసం కాదు. వరకట్నం ఒక దురాచారం. వరకట్నం తీసుకొనడం పురుషుడు తనను తాను అంగడిలో అమ్ముకోవడం వంటిది. వివేకం గల పురుషుడాపని చేయగూడదు.

**Meaning:** A foolish man foregoes a bride who is well-educated, has good character, and is beautiful too and chooses to marry a bride for a hefty dowry. He has sold himself and can never lead a happy life. A marriage is the union of two individuals who choose to lead a life together. It is not a business proposition.

**Moral:** Never marry for money.



**33.** **ప్రాతలోనె లేదు ప్రాశస్త్యమంతయు**
**క్రొత్తయెల్ల హాని కూర్పబోదు**
**క్రొత్తనీరు రాని కోనేరు పసరెక్కు**
**వాస్తవమ్ము నార్లవారి మాట!**

**భావం :** పాతదైనంతమాత్రాన ఒక వస్తువుకు ప్రాశస్త్యం రాదు. కొత్త వస్తువు వల్ల హాని చేకూరదు. ఒక కోనేరులోకి కొత్త నీరు రాకపోతే, అది పాచిపడుతుంది. కంపు కొడుతుంది. కొత్త నీరు కలిసినందువల్ల పాత నీరు నిర్మలమౌతుంది. కాబట్టి పాత కొత్తల కలయికను మనం ఆహ్వానించాలి.

**నీతి :** పాత కొత్తల మేలు కలయిక మన ధ్యేయం కావాలి.

**అర్థాలు :** ప్రాశస్త్యము = గొప్పతనం; పసరు = పాచి

**Meaning:** Anything old need not necessarily be the best. Similarly anything that is novel need not be harmful. If fresh water does not flow into the lake, the water stagnates and becomes dirty and is green with moss. It begins to stink. Fresh water flowing in, will make the water, clear and pure. Hence a judicious mixture of the old and the new should be welcomed.

Stink = give out a foul smell.

Judicious = sensible

**Moral:** Always welcome a wise mixture of retaining what is of value in the old while welcoming what is of value in the new.



**34. పత్రికయొకటున్న పదివేల సైన్యము**
**పత్రికయొకటున్న మిత్రకోటి**
**ప్రజకు రక్షలేదు పత్రిక లేకున్న**
**వాస్తవమ్ము నార్ల వారి మాట.**

**భావం :** ఒక పత్రిక వుంటే అది పదివేల సైన్యంతో సమానం. అది ప్రజాభిప్రాయాన్ని మనకు తెలియచేస్తుంది. పత్రిక మిత్రుడు లాంటిది. మనకు రక్షణ కల్పిస్తుంది. వార్తాపత్రిక వాడిగల అక్షరాయుధం.

**నీతి :** పత్రిక చదవటం మంచిది. దాని వల్ల లోకజ్ఞానం పెరుగుతుంది.

**వ్యాఖ్యానం :** ఇక్కడ వార్తాపత్రిక ఉపయోగాన్ని గూర్చి చెప్పబడింది. పత్రిక ప్రజాభిప్రాయాన్ని ఎప్పటికప్పుడు తెలియచేస్తుంది. అన్ని విషయాలలో మనల్ని జాగరూకుల్ని చేస్తుంది. ఒక పత్రిక, పదివేల సైన్యంతో సమానం. నమ్మకమైన మిత్రుని లాంటిది. పత్రిక లేకుంటే మనకు రక్షణ వుండదు. కాబట్టి శక్తి ఉన్నవాళ్లు పత్రికను స్థాపించి, నడపడం అవసరం. శక్తి లేని వాళ్ళు చదివి ప్రయోజనం పొందాలి.

**Meaning:-** A newspaper is equal to an army of ten thousand. It is like a good friend. People have no protection if they have no access to news. It reflects the news and the opinions of the people.

**Moral:** Reading newspapers is a good habit. It increases both knowledge and awareness.



**35.** **విద్య యొసగును వినయంబు; వినయమునను**
**బడయు బాత్రత పాత్రత వలన ధనము;**
**ధనము వలనను ధర్మంబు దాని వలన**
**నైహికాముష్మిక సుఖంబు లందు నరుడు.**
**– చిన్నయసూరి నీతి చంద్రిక**

**భావం :** విద్య వలన వినయం, వినయం వలన యోగ్యత, యోగ్యత వల్ల ధనం, ధనం వల్ల ధర్మం మనకు లభిస్తాయి. విద్య వల్ల ఇహలోకంలోను పరలోకం లోను మనం సౌఖ్యాలను పొందుతాము.

**నీతి :** ఇహపరాలలో సకల శ్రేయస్సులకు మూలం విద్య.

**అర్థాలు :** పాత్రత = యోగ్యత; ఐహిక = ఇహలోక; ఆముష్మిక = పరలోక

**వ్యాఖ్యానం :** ఇక్కడ విద్య యొక్క ప్రయోజనాలను గూర్చి చెప్పబడింది. విద్య వినయాన్నిస్తుంది. వినయం వల్ల యోగ్యత, యోగ్యత వల్ల ధనం లభిస్తుంది. ధనం వల్ల ధర్మాన్ని ఆచరింపగల్గుతాం. అందువల్ల ఇహపరలోక సుఖాలను పొందగలం. కాబట్టి అందరూ విద్యను అభ్యసించాలి.

**Meaning:** Education teaches a person to be modest. Modesty makes a person worthy. A worthy man is sure to earn wealth. Wealth helps a man to follow the right path of dharma to perform good deeds. The path of dharma gives man joy and prosperity in this world, and the next.

**Moral:** Education is the cornerstone on which rests the welfare of man both on earth and in heaven too.



**36.** **జరయు, మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు**
**ధనము, విద్య గూర్ప దలపవలయు;**
**ధర్మ మాచరింపదగు మృత్యుచే, దల**
**వట్టి యీడ్వబడినవాడు వోలె.**
**– చిన్నయసూరి నీతి చంద్రిక**

**భావం :** తనకు ముసలితనం రాదని, చావు లేదని భావించి ప్రతి వ్యక్తి ధనాన్ని, విద్యను అర్జించాలి. నేడే మరణిస్తామనే భావంతో ధర్మాన్ని ఆచరించాలి.

**నీతి :** ఎల్లకాలం బ్రతికుంటామని సంపాదించాలి. ఏ క్షణంలో పోతామో అని దానం చేయాలి.

**అర్థాలు :** జర = ముసలితనం; మృతి = చావు

**వ్యాఖ్యానం :** తనకు ముసలితనం రాదు, మరణం లేదు అనే భావనతో ప్రాజ్ఞుడైనవాడు ధనాన్ని విద్యను సంపాదించాలి. ఏ క్షణంలో మరణం వస్తుందో అన్న భావనతో ధర్మాన్ని ఆచరించాలి. ఈ భావన వల్ల ఒక వ్యక్తి అకుంఠిత దీక్షతో, నిర్భయంగా ధనాన్ని, విద్యను కూర్చుకోగలుగుతాడు. తర్వాత, ఉదారభావంతో, త్వరితగతిని తన ధర్మాన్ని నిర్వహించగలుగుతాడు.

**Meaning:** Every man has to acquire wealth and education with no thought of ever growing old or becoming prey to death. He has to perform his duty and follow the right path with a feeling of urgency that death may overtake him any moment.

Prey = victim

**Moral:** A man has to earn with the confidence that he will live forever.



**37. పరువంబు, కలిమి, దొరతన,**
**మరయమి, యనునట్టి వీనియం దొకడకడే**
**పొరయించు ననర్థము నా**
**బరగినచో, నాల్గు జెప్పవలయునె చెపుమా?**
**– చిన్నయసూరి నీతి చంద్రిక**

**భావం :** ప్రాయం, సంపద, అధికారం, అజ్ఞానం అనేవి ఒక్కొక్కటే ఎన్నో అనర్థాలకు దారి తీస్తాయి. ఆ నాలుగు ఒకచోట చేరితే జరిగే అనర్థాలకు ఇక అంతు వుండదు.

**నీతి :** అనర్థానికి మూలకారణాలను గ్రహించాలి.

**అర్థాలు :** అరయమి = తెలియకపోవుట; అనర్థము = నష్టం; పరువంబు = ప్రాయం

**వ్యాఖ్యానం :** మనిషి ప్రాయంలో వున్నప్పుడు ఆవేశాలకు, ఉద్రేకాలకు లోనవుతాడు. అనుభవరాహిత్యం వల్ల కొన్ని పొరపాట్లు చేస్తాడు. సంపద కల్గివున్నప్పుడు మనిషి గర్విస్తాడు. విరోధాలు సృష్టించుకొంటాడు. అధికారంలో వున్నప్పుడు అహంకారాన్ని ప్రదర్శిస్తాడు. అవినీతికి పాల్పడుతాడు. అజ్ఞానంలో వున్నప్పుడు తప్పులు చేస్తాడు. పైన చెప్పబడిన ప్రాయం, సంపద, అధికారం, అజ్ఞానం అనే వానిలో ఒక్కొక్కటి ఎన్నో అనర్థాలకు మూలమౌతున్నది. ఆ నాలుగు ఒక్క చోట చేరితే, కలిగే అనర్థాలను ఊహించగలమా!

**Meaning:** Youth, wealth, power and ignorance, each by itself can cause a great deal of harm. If all the four are together, then the combination can lead to endless destruction and misery.

**Moral:** The reasons for all misery and destruction have to be clearly understood.



**38.** **తల్లి కడుపు నుండి ధరణి పైబడు బిడ్డ**
**పాలకేడ్చునదియె ప్రథమభాష**
**అన్ని భాషలకును అదె మాతృభాషరా!**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**- సత్యం శివం సుందరం**

**భావం :** బిడ్డ, తల్లి గర్భంలో నుండి బైటికి వచ్చినపుడు, పాల కోసం ఏడుస్తుంది. అదే ప్రథమ మానవభాష. ప్రపంచంలో అన్ని ఖండాలలో, దేశాలలో జన్మించిన బిడ్డలు ఆ భాషలోనే ఏడుస్తారు. ఆ భాషనే అన్ని భాషలకు మాతృభాషగా మనం భావించాలి. అప్పుడే వివిధ భాషల్ని మనం అర్థం చేసుకోగలం.

**నీతి :** పుట్టిన వెంటనే శిశువు ఏడ్చేదే విశ్వమానవ భాష.

**అర్థాలు :** ధరణి = భూమి

**వ్యాఖ్యానం :** ప్రపంచంలో ప్రజలు మాట్లాడే భాషలు వేల సంఖ్యలో వున్నాయి. ఒక్కొక్క దేశాన్ని బట్టి ప్రాంతాన్ని బట్టి ఒక్కొక్క భాష ఏర్పడింది. అన్ని దేశాలకు, జాతి, మతాలకు అతీతంగా మాట్లాడే విశ్వమానవ భాష ఒకటుంది. అదే తల్లి కడుపులో నుండి భూమిపై పడినప్పుడు శిశువు ఏడ్చే భాష. ఆ భాషనే అన్ని భాషలకు మాతృభాషగా మనం భావించాలి. అప్పుడు మనం అన్ని భాషలను అర్థం చేసుకోగలం.

**Meaning:** When a child enters this world from the mothers' womb the baby cries for milk. That is the first language used by every human child all over the world. It is base for every language.

**Moral:** The cry of the new born baby is certainly the universal language.



**39.** **ఏడు సంద్రములను ఈది దాటగ వచ్చు**
**కొండనైన పిండి గొట్టవచ్చు**
**వీసమంత ఆత్మ విశ్వాసముండిన**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**- సత్యం శివం సుందరం**

**భావం :** ఆత్మ విశ్వాసం వున్నవాడు, ఏడు సముద్రాలను స్వయంగా ఈది దాటగలడు. కొండలను గూడ పిండి గొట్టగలడు. ఎంత బలమున్నా, ఆత్మవిశ్వాసం లేనివాడు కార్యాల్ని సాధించలేడు.

**నీతి :** ఆత్మవిశ్వాసంతో సాధింపలేనిదేదీ లేదు.

**అర్థాలు :** ఆత్మవిశ్వాసము = తన మీద తనకు నమ్మకం

**వ్యాఖ్యానం :** అన్ని కార్యాల సాధనకు ఆత్మ విశ్వాసం మూలం. ఆత్మవిశ్వాసం గలవాడు ఏ పనిలోనైన విజయాన్ని పొందగలడు. ఏడు సముద్రాలను, అవలీలగా ఈది దాటగలడు. కొండలను పిండి చేయగలడు. రామాయణంలో, ఆత్మవిశ్వాసం వల్లనే హనుమంతుడు శతయోజనపర్యంతమైన సముద్రాన్ని ఆకాశమార్గంలో దాటగలిగినాడు.

**Meaning:** A person who has confidence in himself can swim across the seven seas. He can conquer and overcome the mighty mountains. Whatever strength and might a man may have, he cannot hope to succeed in whatever he aspires to do, if he lacks self-confidence and faith in himself.

Lacks = be without

Aspire = wish

**Moral:** There is nothing that cannot be achieved if one has enough faith and confidence in himself.



**40.** **విద్య, ధనము, వంశవిఖ్యాతులను గల్గి,**
**ఎత్తుకెదిగినంత ఏమి వింత!**
**ఏమి లేక పైకి ఎదుగుటయే వింత!**
**మనసువిప్పి వినుము మంచిమాట.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** ఉన్నత విద్య, తగినంత ధనం, మంచి వంశం వున్న వ్యక్తి పై స్థాయికి ఎదగడంలో ఆశ్చర్యం లేదు. పైన చెప్పబడ్డవి, ఏవీ లేకుండ, ఒక వ్యక్తి పైస్థాయికి ఎదగడం అత్యంత ఆశ్చర్యకరం. అట్టి వారిని లోకంలో మనం చూస్తున్నాం. వారిని ఆదర్శంగా తీసుకొని మనం భవిష్యత్తుకు బంగారు బాటలు వేసుకోవాలి. ఒకరి భుజాలపై నుండి కాక, నేల నుండి పైకెగిరిన వాడే మొనగాడు.

**నీతి :** స్వయం కృషి గొప్పది.

**అర్థాలు :** విఖ్యాతి = కీర్తి

**వ్యాఖ్యానం :** పేరు గల వంశంలో జన్మించి విద్యావంతుడుగా, ధనవంతుడుగా వున్న వ్యక్తి తన విద్య వల్ల, ధనం వల్ల, వంశ సంబంధాల వల్ల పలుకుబడి పెంచుకొని, ఉన్నత పదవులను అందుకోగలడు. అందులో ఆశ్చర్యం లేదు. సామాన్య కుటుంబంలో జన్మించి, విద్య లేకుండ, ధనం లేకుండ వున్న వ్యక్తి అట్టడుగు నుండి పైకెదగగల్గడం నిజంగా ఆశ్చర్యం కల్గిస్తుంది. అది అతని అసామాన్యమైన ప్రతిభను, పట్టుదలను తెలియచేస్తుంది.

**Meaning:** It is no surprise if a man with good education, enough wealth and a good family background were to rise in life. It is an amazing wonder when a man rises on the ladder of success, without such advantages. It is a fact that many have achieved success despite not having these advantages. They stand as role models to all men to pave a path of gold for their future.

**Moral:** A true hero is one who achieves success on his own.



**41.** **పుట్టు గుడ్డివాని కిట్టె చూపు నొసంగు**
**చెవిటి వాని కిచ్చు శ్రవణ శక్తి**
**ధర, పొగడ్తకంటె పరమౌషధం బేది?**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**- సత్యం శివం సుందరం**

**భావం :** పొగడ్తకు లొంగని వారు లోకంలో వుండరు. సహస్రనామాలతో స్తుతిస్తే దేవుడే దిగి వచ్చి వరాలిస్తాడు. పొగడ్త చెవిటి వానికి వినికిడి శక్తి ప్రసాదిస్తుంది. గుడ్డివానికి చూపునిస్తుంది. పొగడ్తను మించిన పరమౌషధం లేదు. పొగడ్తను సమయానుకూలంగా వాడుకొంటాడు వివేకవంతుడు.

**నీతి :** పొగడ్తకు దేవుడే దిగి వస్తాడు.

**అర్థాలు :** శ్రవణ శక్తి = వినెడు శక్తి

**Meaning:** There is no one who can resist praise and flattery. Even God comes down to earth and bestows boons if praised with devotion, chanting a thousand names. Praise has the power to make a deaf man hear and a blind man see. There is no greater potion to cure, than praise. A wise man decides to take advantage of flattery and praise, and uses it at the appropriate time.

Flattery = excessive praise, often insincere.

Boon = wish

Potion = medicine

**Moral:** Praise pleases even God, who comes down to grant boons to his devotees.



**42.** **చిదిమితేని గ్రుడ్డు చేతికి చిక్కదు,**
**పొదిగితేని పిల్ల పుట్టివచ్చు**
**ఓర్పుతోనె లాభ మొనగూడు ధరలోన**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**- సత్యం శివం సుందరం**

**భావం :** ఒక కోడిగ్రుడ్డును పొదగవేసి, కొంతకాలం వేచియుంటే దానిలో నుండి కోడిపిల్ల బైటికి వస్తుంది. తొందరపడి చిదిమేస్తే అది చేతికి చిక్కదు. అలాగే, ఒక కార్యాన్ని సాధించాలంటే ఓర్పు కావాలి. వేగిరపడితే ఫలితం లభించదు.

**నీతి :** సహనం సర్వార్థ సాధనం.

**వ్యాఖ్యానం :** ఒక క్లిష్ట సమస్యను పరిష్కరించాలంటే సహనం అవసరం. వేగిరపడితే ఫలితం దక్కదు. భారతంలో మాయాజూదంలో ఓడిపోయిన పాండవులు తిరిగి కౌరవుల నుండి రాజ్యాన్ని జయించుకోవడానికి, పండెండ్రేండ్లు వనవాసం, ఒక యేడు అజ్ఞాతవాసం చేయవలసి వచ్చింది. ఆ కాలంలో వారు యుద్ధానికి కావలసిన ఆయుధాలను, మిత్రుల్ని, పరివారాన్ని సమకూర్చుకొన్నారు. తర్వాత యుద్ధంలో గెలిచి రాజ్యాన్ని చేపట్టారు. ఉదాహరణకు, కోడిగుడ్డును తొందరపడి చిదిమితే, చేతికి చిక్కకుండా బ్రద్ధలైపోతుంది. పొదగవేస్తే కోడిపిల్ల పుట్టి వస్తుంది.

**Meaning:** An egg has to be kept warm and hatched over a period of time, before a chick can emerge from the egg. If the egg is crushed and broken, no chick can be born out of it. Similarly patience is a must, if something has to be achieved. Haste can only spoil and not give any positive results.

Hatch = A bird warms the eggs till the young ones are ready to break open the shell to come out into the world = పొదగటం

**Moral:** With patience, anything can be achieved.



**43. భువనమందు గొప్ప బోధకుడెవడన్న**
**చీమయనుచు మనము చెప్పవచ్చు**
**చీమ నోరు విప్పి చేయదు బోధలు**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** లోకంలో ఒక గొప్ప గురువెవ్వరంటే, అది చీమ అని చెప్పడంలో అతిశయోక్తి లేదు. చీమ శ్రమజీవి. ఎప్పుడూ శ్రమిస్తూ వుంటుంది. కాని, నోరువిప్పి బోధనలు చేయదు. కాబట్టి కేవలం మాటలు చెప్పకుండా, కార్యం ఆచరించి చూపేవాడే నిజమైన గురువు.

**నీతి :** మంచి ఎక్కడున్నా గ్రహించాలి. చీమను చూచి శ్రమపడటం నేర్చుకో.

**వ్యాఖ్యానం :** తాను బోధించే విషయాన్ని స్వయంగా ఆచరించి చూపేవాడే నిజమైన గురువు. చీమను అట్టి గురువుగా మనం పేర్కొనవచ్చు. చీమ శ్రమజీవి. నోరువిప్పి బోధనలు చేయదు. నిరంతరం అలసట లేకుండా పనిచేస్తుంటుంది. అట్టి చీమను ఆదర్శంగా తీసుకొని, మనం కార్యాచరణలో నిమగ్నులం కావాలి.

**Meaning:** It is no exaggeration to perhaps say, that the ant is one of the greatest teachers to mankind. An ant is very industrious and continuously works. It will not preach but works. A true guide worth emulating is one who silently shows the way through practice rather than empty words.

Exaggeration = beyond limits of truth.

Emulate = ఆదర్శంగా తీసుకోవడం

**Moral:** Anything worthwhile and useful has to be observed, copied and learnt.



**44. పాత్రుడగునొ కాదొ పరికింపకయె మేలు**
**చేయరాదు, అట్లు చేసితేని**
**ఏకు వంటివాడు మేకుగా మారును**
**మనసు విప్పి వినుము మంచిమాట.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** యోగ్యత వుందో లేదో తెలుసుకోకుండా, ఎవరికీ మేలు చేయకూడదు. అట్లా చేస్తే ఏకులాంటి వాడు మేకుగా మారి, నీకు హాని కల్గించవచ్చు.

**నీతి :** అపాత్ర దానం చేయరాదు. అది కొరివితో తలగోక్కోవడం వంటిది.

**వ్యాఖ్యానం :** పరులకు మేలు చేయడం మన విధి. అట్లని, ఎవరికంటే వారికి యోగ్యతను పరిశీలించకుండా మేలు చేయడం మంచిది కాదు. అన్ని విధాల పాత్రుడగునో కాదో విచారించి, ఒకరికి మేలు చేయాలి. ఆ మేలు వల్ల సత్ఫలితాలు కలుగుతాయి. పాత్రత చూడకుండా మేలు చేస్తే ఏకు లాంటి వాడు మేకుగా మారి, మనకు ప్రమాదకారి అవుతాడు.

**Meaning:** No help should ever be given without first making sure that it is a truly deserving case. If help is given to an undeserving person, he is bound to show his ingratitude later and perhaps ever harm his benefactor.

Ingratitude = forgetting the help received.

**Moral:** Never help the undeserving, they are bound to prove ungrateful later.



# 4. కార్యసాధక పద్ధతి

**45.** **అనగననగ రాగమతిశయిల్లుచు నుండు**
**తినగ తినగ వేము తియ్యనుండు**
**సాధనమున పనులు సమకూరు ధరలోన**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** సంగీతంలో, ఆలాపించేకొలది రాగం మెరుగవుతుంది. తినే కొలది వేప చేదు తియ్యగా అనిపిస్తుంది. నిరంతర సాధన వల్ల కార్యాలు సమకూరుతాయి.

**నీతి :** నిరంతర సాధన వల్లనే కార్యం సఫలమౌతుంది.

**వ్యాఖ్యానం :** ఎట్టి విద్యనైనను నిరంతరమైన అభ్యాసంతో నేర్చుకోవచ్చు. సంగీతంలో ఆలాపించేకొలది, రాగం మెరుగవుతుంది. తినేకొలది వేప చేదు తీపుగా మార్పు చెందుతుంది. నిరంతర కార్య సాధన వల్ల కార్యాలు సమకూరుతాయి.

**Meaning:** Music can be rendered flawlessly with intense practice. As one gets used to the taste of neem which is bitter, it begins to taste sweet. Constant application and practice assures success in achieving perfection.

Render = present

Flawless = perfect

Intense = engage deeply

Constant = continuous

**Moral:** Constant practice makes one perfect and success is certain.



**46.** **ఒకచో నేలను బవ్వళించు, నొకచో నొప్పారు బూసెజ్జపై,**
**నొకచో శాకము లారగించు, నొకచో నుత్కృష్టశాల్యోదనం,**
**బొకచో బొంత ధరించు, నొక్కొకతరిన్ యోగ్యాంబరశ్రేణి, లె**
**క్కకు రానీయడు కార్యసాధకుడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.**
**– భర్తృహరి**

**భావం :** అవసరమైతే కార్యసాధకుడు ఒక చోట నేలమీదనే పండుకొంటాడు. తనకు లభిస్తే పూలపాన్పు మీద శయనిస్తాడు. దొరికితే మృష్టాన్నాన్ని ఆరగిస్తాడు. దొరక్కపోతే కందమూలాలతో ఆకలి తీర్చుకొంటాడు. ఉంటే మంచి వస్త్రాలు ధరిస్తాడు. లేకుంటే బొంతతో సరిపెట్టుకొంటాడు. అతడు కష్టాల్ని, సుఖాల్ని లెక్కచేయడు.

**నీతి :** కార్యసాధకుడు కష్టాలను సుఖాలను సమానంగా పరిగణిస్తాడు.

**అర్థాలు :** పూసెజ్జ = పూలపాన్పు; శాకములు = కూరగాయలు; ఉత్కృష్ట శాల్యోదనం = ఉత్తమమైన వరి అన్నం; యోగ్యాంబర శ్రేణి = ఉచితమైన వస్త్రాల మడతలు

**Meaning:** An ambitious man who aspires success in life learns to adjust to any situation. He is able to sleep with no discomfort on a hard floor and can just as well sleep on a luxurious bed. He can enjoy a rich feast or survive on roots and tubers without complaining. He wears expensive clothes if he has them or is equally content wearing simple rough garments. Comfort or discomfort make very little difference to a man who is determined to achieve his goals in life.

**Moral:** A man determined to achieve success cares little about comfort or discomfort.



**47.** **ఆరంభింపరు నీచ మానవులు విఘ్నాయాస సంత్రస్తులై**
**యారంభించి పరిత్యజింతురురు విఘ్నాయత్తులై మధ్యముల్**
**ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై**
**ప్రారబ్ధార్థములుజ్జగింపరు సుమీ, ప్రజ్ఞానిధుల్ గావునన్.**
**– భర్తృహరి**

**భావం :** విఘ్నం కలుగుతుందని, యెట్టి కార్యాన్ని ప్రారంభింపనివారు అధములు. కార్యాన్ని ప్రారంభించి, ఆటంకం వచ్చిందని మానుకొనేవారు మధ్యములు. ఎన్ని అడ్డంకులెదురైనా ప్రారంభించిన పనిని ధైర్యంతో పూర్తిచేసేవారు ఉత్తములు.

**నీతి :** ప్రజ్ఞావంతులు ప్రారంభించిన పనిని మధ్యలో వదలరు.

**అర్థాలు :** ఉరువిఘ్నాయాససంత్రస్తులు = గొప్ప విఘ్నానికి భయపడేవారు; నిహన్యమానులు = బాధింపబడువారు; ధృతి = ధైర్యం

**వ్యాఖ్యానం :** విఘ్నం కలుగుతుందనే భయంతో, ఏ కార్యాన్ని ప్రారంభించనివారు అధములు. కార్యాన్ని ప్రారంభించి, ఆటంకాలకు భయపడి, మధ్యలో ఆపివేసేవారు మధ్యములు. ఎన్ని అడ్డంకులెదురైనా లెక్క చేయకుండ ప్రారంభించిన కార్యాన్ని వదలిపెట్టనివారు ఉత్తములు. అది వారి ప్రజ్ఞకు నిదర్శనం.

**Meaning:** People who are not strong-willed are afraid to start any venture as they fear failure. People of average intelligence start to work on something and give up half-way complaining that there are too many hurdles on the way. The best among people are those who fight their way to the finish whatever they aim to achieve, no matter how many difficulties they have to face.

**Moral:** Worthy people, who are courageous never give up half-way and overcome all hurdles with determination till they achieve success in their goals.



**48.** **కందుకమువోలె సుజనుడు**
**గ్రిందంబడి, మగుడమీదికిన్నెగయు, జుమీ**
**మందుడు మృత్పిండమువలె**
**గ్రిందంబడి, యడగియుండు గృపణత్వమునన్.**

**- భర్తృహరి**

**భావం :** సమర్థుడైనవాడు క్రిందపడ్డా, బంతివలె, ఎగిరిపైకి లేస్తాడు. అసమర్థుడైనవాడు క్రింద పడితే, మట్టిముద్దలాగా అక్కడే పడివుంటాడు.

**నీతి :** సమర్థుడు కిందబడ్డా పైకి లేస్తాడు.

**Meaning:** A worthy man bounces back after a fall, like a ball does after it strikes the ground. In other words a man of worth will always rise again even if his fortunes hit rock bottom. An unworthy man on the other hand remains like a lump of earth on the ground with no attempt to rise, as failure weighs him down.

**Moral:** A smart, intelligent man will not allow failure to discourage him. With renewed attempts he will rise again to the heights of success.



**49.** **మాటలాడగల్గు మర్మము లెరిగిన,**
**పిన్న పెద్దతనము లెన్నవలదు**
**పిన్న చేతిదివ్వె పెద్దగా వెలుగదా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మాటలాడడంలో మర్మం తెలిసిన వాని విషయంలో, వయస్సులో చిన్నవాడా, పెద్దవాడా అనే భేదం చూపించకూడదు. ఒక దీపం చిన్నవాని చేతిలో వున్నా పెద్దగా వెలుగుతుంది కదా.

**నీతి :** ధర్మం పిన్నవాడు చెప్పినా గౌరవించాలి.

**వ్యాఖ్యానం :** ఇక్కడ పిట్ట కొంచెమైనా, కూత ఘనం అన్న విషయాన్ని గూర్చి చెప్పబడింది. పూవు పుట్టగానే పరిమళిస్తుంది. కొందరు అతి చిన్న వయసులోనే అద్వితీయమైన ప్రజ్ఞను ప్రదర్శిస్తారు. చిన్న పెద్ద అని వయస్సును చూడకుండ మనం వారి గొప్పతనాన్ని గుర్తించాలి.

**Meaning:** If a person speaks wisely, it matters little whether he is young or old. A lamp shines just as brightly even if it is held in a child's hand.

**Moral:** Good and wise words must be heeded to, even if they are spoken by some one young in years.



# 5. విద్వత్ పద్ధతి

**50.** **పలు సందియముల దొలచును**
**వెలయించు, నగోచరార్థవిజ్ఞానము, లో**
**కుల కక్షి, శాస్త్ర, మయ్యది**
**యలవడ దెవ్వనికి, వాడె యంధుడు జగతిన్.**

**– చిన్నయసూరి నీతిచంద్రిక**

**భావం :** శాస్త్రం మానవునికి కన్ను వంటిది. అది అనేక సందేహాల్ని తీర్చి, అగోచరమైన విజ్ఞానాన్ని అందిస్తుంది. అట్టి శాస్త్రాన్ని అధ్యయనం చేయనివాడు, గుడ్డివానితో సమానం.

**నీతి :** శాస్త్ర జ్ఞానం లేనివాడు దేన్నీ తెలుసుకోలేడు.

**అర్థాలు :** అక్షి = కన్ను; అగోచరం = కనపడనిది.

**వ్యాఖ్యానం :** మానవుని సందేహాలు తీర్చి అర్థంకాని విషయాలను వివరించి, విజ్ఞానాన్ని అందించేది శాస్త్రం. అది లోకులకు కన్ను వంటిది. ఆ కన్ను లేనివాడు గుడ్డివానితో సమానం. అతడు ప్రపంచంలో జరుగుతున్న ఏ విషయాలను చూడలేడు, తెలుసుకోలేడు.

**Meaning:** Principles laid down in texts for the guidance of mankind are like eyes to the human being. Knowledge that is not easily seen or understood is revealed in such texts. A person who does not master these principles is like a blind man. Organized study is a discipline that guides one on the basic principles of a stream of thought or knowledge.

**Moral:** One who does not master the principles that are basic to a subject, can never succeed in mastering any branch of knowledge.



**51.** **ఆకసమ్ముపోలె అవధులు లేనిది**
**హిమనగమ్ము కన్న ఎత్తు కలది**
**జలధి కంటె లోతు కలది విజ్ఞానము**
**దివిని, భువిని, కలుపు దివ్యశక్తి.**

**– మానవగీత**

**భావం :** విజ్ఞానం ఆకాశం లాగా అంతం లేనిది. హిమాలయ పర్వతం కంటె ఎత్తైనది. సముద్రం కంటె లోతు కలది. విజ్ఞానమనే దివ్యశక్తితో మానవుడు భూలోకాన్ని, స్వర్గలోకాన్ని సంధించగలడు.

**నీతి :** భూలోకాన్ని స్వర్గలోకాన్ని కలిపే దివ్యశక్తి విజ్ఞానం. దాన్ని అందరు సంపాదించడానికి ప్రయత్నించాలి.

**అర్థాలు :** అవధులు = హద్దులు

**వ్యాఖ్యానం :** ఆకాశానికి హద్దులు లేనట్లే విజ్ఞానానికి హద్దులు లేవు. వేలకోట్ల కాంతి సంవత్సరాల దూరంలో వున్న నక్షత్రాలను మానవుడు తన దూరదర్శినితో చూడగలుగుతున్నాడు. భూమ్యాకర్షణ శక్తిని దాటుకొని ఉపగ్రహాల వంటి యంత్రాల ద్వారా అంతరిక్షంలో విహరిస్తున్నాడు. చంద్రమండలంపై కాలుమోపగలిగినాడు. మానవుని యొక్క యీ విజయాలు, విశ్వ రహస్యాలతో పోల్చుకొంటే చాలా చిన్నవి. విజ్ఞానం యొక్క లోతు ఎంతో, ఎత్తు ఎంతో మానవుడింకా తెలిసుకోవలసి వుంది.

**Meaning:** Knowledge is vast as the sky and has no limits. It is higher than the highest mountain. Its depths plunge deeper than the deepest oceans. Knowledge has the power to offer man heaven and earth.

Plunge = Sink, మునుగు

**Moral:** Man experiences the wonder of heaven and earth through the power of knowledge.



**52. మాటల చేత భూపతులు మన్నన చేసి, పురమ్ములిత్తు, రా**
**మాటల చేత దేవతలు మన్నన చేసి, వరమ్ములిత్తు, రా**
**మాటల చేత మానినులు మన్నన చేసి, సుఖంబులిత్తు, రా**
**మాటలు నేర్వకున్న, అవమానము, న్యూనము, మానభంగమున్.**

**– చాటువు**

**భావం :** మంచి మాటల వల్లనే రాజులు అగ్రహారాలిస్తారు. దేవతలు వరాలిస్తారు. స్త్రీలు సుఖాన్నిస్తారు. మాటలు నేర్వనివాడు అవమానం పాలౌతాడు. న్యూనతాభావంతో బాధలు పడతాడు. కాబట్టి అందరు చక్కగా మాట్లాడడం అలవరచుకోవాలి.

**నీతి :** చక్కగా మాట్లాడితే అన్నీ పొందవచ్చు.

**అర్థాలు :** భూపతులు = రాజులు; మానినులు = స్త్రీలు; న్యూనము = తక్కువైనది, నిందింపదగింది

**Meaning:** Men who have a pleasing manner of speech have always been honoured and rewarded by kings. Prayers have been rewarded with boons from the gods, and women have showered favours. One who does not master the art of speaking well, faces humiliation. They feel inferior and suffer with a lack of confidence. All should cultivate the art of speaking well.

**Moral:** A man who has mastered the art of speaking can charm his way to success.



**53.** **విద్య నిగూఢ గుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్**
**విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుడున్**
**విద్య విశిష్టదైవతము విద్యకు సాటి ధనంబు లే దిలన్**
**విద్య నృపాలపూజితము విద్య నెరుంగని వాడు మర్త్యుడే.**
**– భర్తృహరి**

**భావం :** విద్య అనేది నీలో ఎంతో గుప్తంగా వున్న ధనం. నీకు అందమైన రూపాన్ని, వ్యక్తిత్వాన్ని కలుగచేస్తుంది. కీర్తిని, సుఖాల్ని అందిస్తుంది. విద్య నీకు గురువు. విదేశాలలో బంధువుగా వుండి తోడ్పడుతుంది. విద్య దైవంతో సమానం. రాజుల చేత పూజలందుకొంటుంది. విద్యకు సాటి వచ్చే ధనం వేరొకటి లేదు. అట్టి విద్యలేనివాడు మానవుడే కాదు. కాబట్టి విద్యను అందరు అభ్యసించాలి.

**నీతి :** విద్య కొంగు బంగారం, ముంజేతి దీపం వంటిది. దానితో అన్నీ లభిస్తాయి.

**వ్యాఖ్యానం :** ధనం వున్నవాడు తన వూర్లోనే గౌరవింపబడతాడు. రాజ్యాధికారం వున్నవాడు తన రాజ్యంలోనే గౌరవింపబడతాడు. విద్యావంతుడు సర్వ ప్రదేశాలలో గౌరవింపబడతాడు. విద్య గుప్తంగా వున్న ధనం. అది మానవునికి రూపం, కీర్తి, భోగాలను కలుగచేస్తుంది. గురువులాగ ఉపదేశం చేస్తుంది. విద్య, విదేశాలలో బంధువు లాగ ఉపయోగపడుతుంది. విద్య దైవంతో సమానం. విద్య గలవానిని రాజులు పూజిస్తారు. అట్టి అపురూపమైన విద్య లేనివాడు మానవుడే కాదు.

**Meaning:** Education is a hidden treasure within a person. Knowledge is a blessing that gives beauty of character and strengthens individuality. It can also give fame and pleasure. It is like a guide and a philosopher. Having education is like having a trusted friend outside the mother country. Knowledge and learning are divine. Even the mightiest among kings bows his head to scholarship and honours men of learning. There can be no wealth on par with education. No one can even qualify to be human if he does not have education. Hence it is wise to engage one's best efforts to acquire the treasure of knowledge and skills through education.

Treasure = wealth

**Moral:** Education is a priceless treasure. It is the light that guides mankind. There is nothing that it cannot offer.



**54.** **భూషలుగావుమర్త్యులకు భూరిమయాంగదతారహారముల్**
**భూషితకేశపాశమృదు పుష్పసుగంధ జలాభిషేకముల్**
**భూషలుగావు, పూరుషుని భూషితుజేయు బవిత్రవాణి, వా**
**గ్భూషణమే, సుభూషణము, భూషణముల్ నశియించునన్నియున్.**
**– భర్తృహరి**

**భావం :** మానవులు ధరించే బంగారు భుజకీర్తులు, హారాలు, పుష్పాలు, అందమైన కొప్పు ముడులు, సుగంధ జలాలతో అభిషేకాలు, నిజమైన భూషణాలు కావు. పవిత్రమైన వాక్కులే మంచి భూషణాలు. తక్కిన భూషణాలన్నీ నశించిపోయేవే. కాబట్టి, వాక్కులనే భూషణాల్ని అందరు ధరించి లోకంలో మెప్పును పొందాలి.

**నీతి :** మంచి మాటలే మనిషికి అలంకారం.

**అర్థాలు :** భూరిమయ = బంగారంతో చేయబడిన; అంగదము = సంది కడియము; తారహారము = నక్షత్రమాల; కేశపాశము = జడ

**వ్యాఖ్యానం :** మానవుడు అందంగా కనపడాలని బంగారు భుజకీర్తులు, హారాలు ధరిస్తాడు. జుట్టును అలంకరించుకొంటాడు. సుగంధ ద్రవ్యాలతో అభిషేకం చేసుకొంటాడు. ఇవన్నీ నిజమైన అలంకారాలు కావు. పవిత్రమైన వాక్కే మానవునికి నిజమైన అలంకారం. తక్కిన అలంకారాలన్నీ నశించిపోతాయి.

**Meaning:** Men may wear golden winged ornaments on their shoulders, or men may wear costly gem-studded necklaces. Flowers and elaborate hair-dos may be worn, or perfumes may have been used.  But they are not the true ornaments nor do they impress others enough. The really valuable jewels are wise and beautiful words, while the other kind of ornaments can perish or be lost.

**Moral:** Gentle, wise words are truly beautiful ornaments.



**55.** **విద్యచే, భూషితుండయి వెలయుచున్న**
**దొడరివర్జింపదగుసుమీ దుర్జనుండు**
**చారు మాణిక్యభూషిత శస్త మస్త**
**కంబు గల, పన్నగము భయంకరము గాదె.**

**– భర్తృహరి**

**భావం :** త్రాచుపాము తలపై ప్రకాశించే మణి వుంటుంది. అయినా, ఆ పాము భయంకరంగా వుంటుంది. దానిని దూరంగా వుంచాలి. అలాగే ఎంత విద్యావంతుడైనను, సత్ప్రవర్తన లేని వానిని దూరంగా వుంచాలి.

**నీతి :** సత్ప్రవర్తనలేని విద్యావంతుడు సర్పం లాంటివాడు.

**అర్థాలు :** పన్నగము = పాము

**వ్యాఖ్యానం :** విద్యావంతుడైనవాడు సుగుణవంతుడై కూడ వుండాలి. అలా కాని వానిని లోకం గౌరవించదు. దూరంగా వుంచుతుంది. ఉదాహరణకు పాము తల మీద ప్రకాశించే మణి వుంటుంది. అయినప్పటికి, పామును చూచి అందరూ భయపడతారు. దగ్గరకు రానీయరు. కాబట్టి విద్యావంతులైన వారు సత్ప్రవర్తన అలవర్చుకోవాలి.

**Meaning:-** The cobra has a beautiful gem on its hood yet all are afraid of the snake as it is fearsome and dangerous. Thus people keep their distance from it. Similarly it is wise to stay away from a person if his character is not noble and good, no matter how learned or scholarly he may be.

**Moral:** A man with poor character is dangerous like a snake even if he is a learned man.



# ౬. సజ్జన పద్ధతి

**56.** **అవని విభుండు నేరుపరియై చరియించిన, గొల్చువార లె**
**ట్లవగుణులైన నేమి పనులన్నియు జేకురు వారి చేతనే,**
**ప్రవిమల నీతిశాలి యగు రాముని కార్యము మర్కటంబులే**
**తవిలి యొనర్పవే జలధి దాటి సురారుల ద్రుంచి, భాస్కరా!**

**భావం :** శ్రీరాముడు నీతిశాలి, సమర్థుడు కాబట్టి, ఆయన ఆదేశంతో వానర సైన్యం సముద్రం దాటి, లంకలో ప్రవేశించి, రాక్షసులను సంహరించి సీతను విడిపించి రామకార్యం నెరవేర్చగలిగింది. అలాగే, రాజు సమర్థుడైతే అతని కొలువులో వుండేవారు ఎట్టివారైనా, రాజకార్యాలనన్నింటినీ చక్కగా నిర్వహించగలరు.

**నీతి :** నాయకుడు సమర్థుడైతే, ఎలాంటివారి చేతనైనా పనులు చేయించగలడు.

**అర్థాలు :** అవగుణులు = చెడ్డగుణాలు కలిగినవారు; సురారులు = రాక్షసులు; మర్కటములు = కోతులు

**వ్యాఖ్యానం :** 'యథా రాజా తథా ప్రజా' అనే విషయం ఇక్కడ చెప్పబడింది. అంటే, రాజు ఎలా ప్రవర్తిస్తాడో ప్రజలు కూడా అలాగే ప్రవర్తిస్తారని అర్థం. నాయకుడు సమర్థుడైతే, అతడు తన అనుచరుల చేత కూడా సమర్థంగా పనిచేయించగలడు. ఒక సంఖ్యలో మొదట ఒకటి అంకె వేసి, తర్వాత సున్నాలు పెడితే, సున్నాలకు విలువ పెరుగుతుంది. ఆ ఒకటి అంకె తీసివేస్తే, సున్నాలకు విలువుండదు. ఆ ఒకటి అంకె నాయకుడు. సున్నాలు అనుచరులు అని యిక్కడ అర్థం చేసుకోవాలి. ఉదాహరణకు శ్రీరాముడు శౌర్యశాలి, సమర్థుడు కాబట్టి, ఆయన ఆదేశంతో వానరసైన్యం సముద్రాన్ని దాటి, లంకలో ప్రవేశించి, రాక్షసులను సంహరించి, సీతను విడిపించి శ్రీరామకార్యం నెరవేర్చగలిగింది.

**Meaning:** Lord Sri Rama was a very virtuous and a great man. Hence under his command the army of monkeys crossed the sea, entered Lanka, killed the demons and helped rescue Sita, and were able to complete Rama's mission. Similarly if the king is an able man, his courtiers and subjects can efficiently carry out the jobs entrusted to them irrespective of their character. The saying that the subjects always follow the lead of their king is a very true statement.

Irrespective = not taking into account

**Moral:** If the leader is an able man, he can get anything done by his followers, no matter what kind of people they are.



**57.** **బల్లిదుడైన సత్ప్రభువు పాయక యుండిన గాని, రచ్చలో**
**జిల్లరవారు నూరుగురు సేరిన దేజము గల్గదెయ్యెడన్**
**చల్లని చందురుండెడసి సన్నపు జుక్కలు కోటియున్న రం**
**జిల్లునె వెన్నెలల్ జగము చీకటు లన్నియుబాయ, భాస్కరా!**

**భావం :** ఆకాశంలో ఎన్ని చుక్కలున్నా, చంద్రుడు వచ్చినప్పుడే చీకట్లు తొలగిపోయి చల్లని వెన్నెల కాస్తుంది. అదే విధంగా సభలో ఎందరు సభాసదులున్నా, బలవంతుడైన సత్ప్రభువు వచ్చినప్పుడే సభలో తేజస్సు వెల్లివిరిస్తుంది.

**నీతి :** సభలో ఎందరున్నా, సమర్థుడైన నాయకుడున్నప్పుడే సభ రక్తిగడుతుంది.

**అర్థాలు :** బల్లిదుడు = బలవంతుడు; ఎడసి = లేకుండ

**వ్యాఖ్యానం :** రాజాస్థానంలో మంత్రులు, సామంతులు, తక్కిన పరివారం చేరివుంటారు. కాని, బలవంతుడైన సత్ప్రభువు వచ్చి సింహాసనం మీద కూర్చున్నప్పుడే ఆస్థానానికి కళాకాంతులు వస్తాయి. అదే విధంగా ఒక సభలో సదస్యులెందరో ఆసీనులై వుంటారు. కాని, పేరు ప్రఖ్యాతులు గల ముఖ్య అతిథి ప్రవేశించినపుడే సభ శోభాయమానమౌతుంది. ఉదాహరణకు, ఆకాశంలో లక్షల కొలది నక్షత్రాలుంటాయి. కాని చంద్రుడు ఉదయించినప్పుడే చీకటి తొలగి వెన్నెల కాస్తుంది. అందరికి ఆహ్లాదం కలుగుతుంది.

**Meaning:** There could be countless stars in the sky, but the darkness can be dispelled only when the moon rises. Similarly there could be a crowd of hundred courtiers assembled in the court, but the assembly is complete only when a strong and mighty king adorns the throne.

Dispel = remove

Adorn = decorate

**Moral:** An assembly is complete and effective only when a great leader presides over it.



**58.** **తమ కార్యంబు పరిత్యజించియు బరార్థప్రాపకుల్ సజ్జనుల్,**
**దమ కార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్,**
**దమకై యన్యహితార్థ ఘాతుకజనుల్ దైత్యుల్, వృథాన్యార్థభం**
**గము గావించెదువారలెవ్వరొ యెరుంగన్ శక్యమే యేరికిన్.**
**– భర్తృహరి**

**భావం :** తమ కార్యాన్ని వదలుకొని, యితరులకు మేలు చేసేవారు సజ్జనులు. తమ కార్యాన్ని నెరవేర్చుకొంటూ, యితరుల కార్యాలను చేసేవారు మధ్యములు. తమ కార్యం కోసం యితరుల కార్యాన్ని చెడగొట్టేవారు అధములు. తమకు ఎటువంటి మేలు కలుగకపోయినా యితరుల కార్యాన్ని వృథాగా భంగపరచేవాళ్లను, ఏమని పిలవాలో తెలియడంలేదు.

**నీతి :** స్వార్థం వదలుకొని, పరులకు సేవ చేయువారు ఉత్తములు.

**అర్థాలు :** అన్యహితార్థ ఘాతుకజనుల్ = ఇతరుల కార్యాలను భంగపరిచే వాళ్లు; దైత్యుల్ = రాక్షసులు; వృథాన్యార్థభంగము = వృథాగా ఇతరుల కార్యాలను భంగపరచటం; పరార్థప్రాపకుల్ = ఇతరులకు మేలు చేయువారు; పరహితార్థవ్యాపృతుల్ = పరులకు మేలు చేయుటే వృత్తిగా గలవారు.

**Meaning:** People who help others, neglecting their own work are truly the best among mankind, they are virtuous. Others who help others while taking care of their own work are the next best. The third group of people who spoil others' work to promote their own are the worst kind of people. There are still others who do not gain anything for themselves but yet harm others' work. They cannot be described with a suitable word and are beyond any expression.

**Moral:** People who are unselfish and help others are the best among mankind.



**59.** **నీతి ప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ,**
**ఖ్యాతింజెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ,**
**ఘాతంబప్పుడ పొందనీ నియతిమైగానీ యుగాంతంబునన్**
**నీతి శ్లాఘ్యపథంబు దప్పరు గదా నిత్యంబు ధీరోత్తముల్.**
**– భర్తృహరి**

**భావం :** నీతివిదులైన నిపుణులు నిందించినా, మెచ్చుకొన్నా తమ సంపదలు నిల్చినా, తరిగిపోతున్నా, దెబ్బలు తగిలినా, తగలకపోయినా ధీరోత్తములైన వారు తమ నీతి మార్గాన్ని తప్పి నడవరు.

**నీతి :** ఎన్ని కష్టాలు వచ్చినా, సజ్జనులు నీతి దప్పరు.

**అర్థాలు :** ఘాతము = దెబ్బ; శ్లాఘ్యపథంబు = పొగడదగిన మార్గం.

**వ్యాఖ్యానం :** ఇక్కడ ధీరోత్తములైన వారిని గూర్చి చెప్పడం జరిగింది. నీతివిదులైన నిపుణులు నిందించవచ్చు, మెచ్చుకోవచ్చు. తన సంపదలు నిలువవచ్చు, తరిగిపోవచ్చు. తనకు మేలు జరుగవచ్చు, కీడు కలుగవచ్చు. అయినా ధీరులైనవారు తామెన్నుకొన్న నీతి మార్గాన్ని తప్పి చరించరు.

**Meaning:** Truly righteous men do not stray from the path of what is right and true. It does not matter to them whether others praise them or criticize them, whether they faced with troubles or their path runs smooth.

**Moral:** Righteous people adhere to what is right. It matters little to them if they have to face difficulties in life.



**60.** **ఆపదలందు ధైర్యగుణ మంచిత సంపదలందు దాల్మియున్**
**భూపసభాంతరాళమున బుష్కలవాక్చతురత్వ, మాజి బా**
**హాపటుశక్తియున్, యశమునం దనురక్తియు, విద్యయందు వాం**
**ఛాపరివృద్ధియున్, ప్రకృతి జన్య గుణంబులు సజ్జనాళికిన్.**
**– భర్తృహరి**

**భావం :** ఆపదలను ధైర్యంగా ఎదుర్కోవడం, సంపదలు వచ్చినప్పుడు ఓర్పుగా వుండడం, రాజసభలో వాక్చాతుర్యాన్ని ప్రదర్శించడం, యుద్ధంలో భుజశక్తిని కల్గి వుండడం, కీర్తిపై కోరిక వుండడం, విద్యను నేర్చుకోవాలని ఆశపడటం – ఇవి సజ్జనుల యొక్క సహజ గుణాలు.

**నీతి :** సజ్జనులకు సద్గుణాలు సహజమైనవి.

**అర్థాలు :** ఆజి = యుద్ధము; వాంఛాపరివృద్ధి = కోరిక పెంచుకొనుట; తాల్మి = ఓర్పు

**Meaning:** The natural qualities of virtuous men are to face trials and tribulations with courage, maintain their equanimity and modesty while enjoying prosperity, speak with tact and diplomacy in a royal court, fight with valour in war, have ambition for fame, and a great thirst for learning.

Tribulations = distress

Equanimity = calm

Valour = courage

**Moral:** Virtues are natural for righteous men.



**61.** **అడవిలోన పూచినంత, మల్లెతావి, దాగదు**
**చెట్టుకింద బోధిస్తే గురువు విలువ తగ్గదు**
**పూరిగుడిసెలో ఉన్నా కారడవుల ఉన్నా**
**ధీమంతుల తేజస్సు లేశమైనతరగదు.**
**– జీవన గీతాలు**

**భావం :** అడవిలో పూచినా, మల్లెపూల సువాసన తగ్గదు. చెట్టు క్రింద కూర్చుండి బోధించినా గురువు గారి బోధన విలువతగ్గదు. పూరి గుడిసెలో వున్నా, కారడవిలో వున్నా ధీమంతుని తేజస్సు తగ్గదు.

**నీతి :** తెలివికలవాడు ఎక్కడున్నా రాణిస్తాడు.

**వ్యాఖ్యానం :** ప్రతిభావంతులెక్కడున్నా రాణిస్తారని యిచ్చట చెప్పబడింది. అడవిలో పూచినా, మల్లెపూవు సువాసన తగ్గిపోదు. చెట్టుక్రింద కూర్చుండి చదువు చెప్పినా, సద్గురుని బోధనాశక్తి కుంటుపడదు. గుడిసెలో నివసిస్తున్నా, అడవుల్లోవున్నా ప్రతిభావంతుని తేజస్సు తరిగిపోదు.

**Meaning:** The fragrance of a jasmine flower does in no way become less even if it blooms in a forest. The value of the teaching of a teacher is no less erudite even if he teaches under a tree. The brilliance of a learned man does not dim whether he is in a thick forest or in a humble cottage.

Erudite = పాండిత్యం

**Moral:** An intelligent, learned man is sure to shine wherever he is.



# 7. స్వార్థ పద్ధతి

**62.** **స్వార్థమును జయించు సంస్కారమే, భేద**
**మగును, మానవునకు మృగమునకును,**
**స్వార్థమును జయింపజాలని మనుజుండు**
**మిగిలిపోవు జగతి మృగముగానె.**

**– మానవ గీత**

**భావం :** స్వార్థ శక్తిని జయించగల సంస్కారమున్నవాడే మానవుడు. స్వార్థశక్తిని జయించలేనివాడు మృగంగా మిగిలిపోతాడు. అందువల్ల, ప్రతి నరుడు మృగత్వదశ నుండి మానవత్వ దశకు ఎదగాలి. దానికి త్యాగం అవసరం.

**నీతి :** స్వార్థాన్ని జయించినవాడే మానవుడు.

**వ్యాఖ్యానం :** స్వార్థాన్ని జయించడమే మానవత్వమని యిక్కడ చెప్పబడింది. స్వార్థం సర్వ జీవులకు సామాన్య ధర్మం. కాని, సంస్కారంతో ఈ స్వార్థాన్ని జయించడమే మానవునకు, మృగానికి వున్న భేదం. స్వార్థాన్ని జయించలేని మానవుడు మృగంలాగే మిగిలిపోతాడు. మానవుడు తన విజ్ఞాన శక్తితో స్వార్థాన్ని జయించాలి.

**Meaning:** A truly cultured man is one who is able to conquer selfishness. The difference between a human being and a beast is the ability of man to overcome selfishness. If a human being cannot conquer selfishness he will remain a beast.

**Moral:** A true human being is one who has overcome selfishness.



**63.** **సకలజీవతతికి సరిపడు అన్నమ్ము**
**ధరణిగర్భమందు దాగియుండె**
**దాని కొరకె నరుడు వేనవేల్ యుద్ధాలు**
**జరిపినాడు, నేడు జరుపుచుండె.**

**– మానవగీత**

**భావం :** భూగర్భంలో అన్ని జీవులకు సరిపడే ఆహారం దాగి వుంది. పైరు పంటల ద్వారా అది మనకు లభిస్తుంది. భూగర్భంలో వున్న ఖనిజ సంపద కూడా ఆహార సాధనకు అవసరం. దాని కొరకు చరిత్రలో మానవుడెన్నో యుద్ధాలు చేసినాడు, చేస్తున్నాడు. స్వార్థమే దీనికంతకు మూలం.

**నీతి :** స్వార్థమే, ప్రపంచంలో జరిగే అన్ని యుద్ధాలకు కారణం. యుద్ధం వినాశహేతువు.

**వ్యాఖ్యానం :** జన్మించిన ప్రతి బిడ్డకు స్వయంపోషక శక్తి వచ్చేదాక కావలసిన ఆహారాన్ని, ప్రకృతి తల్లి చనుబాలలో దాచి వుంచింది. బిడ్డ పెద్దదైన తర్వాత కావలసిన ఆహారాన్ని, భూమాత గర్భంలో ప్రకృతి దాచి వుంచింది. ఆ ఆహారాన్ని చేజిక్కించుకోవడం కోసమే మానవులు వేనవేలు యుద్ధాలు చేశారు, చేస్తున్నారు. దీనికి స్వార్థమే మూలమని మనం తెలుసుకోవాలి. కాబట్టి శాంతిని కోరేవారు స్వార్థాన్ని విడిచిపెట్టాలి.

**Meaning:** Food for the need of entire mankind is found in the bowels of the earth. It appears as grain and man can harvest it. The mineral wealth inside the earth helps man to prosper. Down the ages, greed for this wealth has caused many wars, and wars are still being waged in the present day. The main cause for all this misery is greed and selfishness in man.

**Moral:** Greed and selfishness are the main causes of all wars in this world.



**64.** **అడవిలోని జంతువాకలైనప్పుడు**
**తిండి తినును కడుపు నిండు వరకె**
**అటులగాక, మనుజుడాశతో సర్వమ్ము**
**దోచుకొనును పిదపదాచుకొనును.**

**- మానవగీత**

**భావం :** అడవిలో వుండే జంతువు ఆకలైనప్పుడే మరొక జంతువును చంపి తింటుంది. మనిషి అట్లా కాదు ఆశతో సర్వ సంపదల్ని దోచుకొంటాడు. తర్వాత దాచుకొంటాడు. ఈ విషయంలో మనిషి, జంతువు కంటె హీనుడని చెప్పవచ్చు.

**నీతి :** మానవుడు జంతు దశ నుండి మానవత్వ దశకు ఎదగాలి.

**వ్యాఖ్యానం :** ఇక్కడ జంతువులకు, మానవులకు వున్న భేదాన్ని గూర్చి చెప్పబడింది. అడవిలో వున్న జంతువు ఆకలియైనప్పుడు మాత్రమే ఇంకొక జంతువును చంపి, ఆకలి తీరే వరకు తింటుంది. తర్వాతి దినాలకు ఆహారాన్ని దాచిపెట్టుకొనదు. మానవుడట్లా కాదు. ఆకలి తీరిన తర్వాత కూడ, ఆహారాన్ని ఆశతో దోచుకొని దాచుకొంటాడు. ఈ విషయంలో మానవుడు జంతువు కంటే హీనంగా ప్రవర్తిస్తున్నాడు.

**Meaning:** The beast in the forest kills only to satisfy its hunger. Man, on the other hand plunders to satisfy his greed and then hoards his plunder. This act of his makes him far inferior to any beast.

Plunder = దోచుకోవడం, Hoard = దాచుకోవడం

**Moral:** Mankind has to progress from the beastly level to a human level.



**65.** **దోచుకొనెడు వారు, దోచబడెడు వారు**
**తెగలు రెండు కలవు జగతి యందు**
**వారి మధ్య జరుగు పోరాటమే నేటి**
**ఘోరకృత్యములకు కారణమ్ము.**

**- మానవగీత**

**భావం :** ప్రపంచంలో దోచుకొనేవారు, దోచబడేవారు అని రెండు తెగల మనుషులున్నారు. వారి మధ్య జరుగుతున్న నిరంతరమైన పోరాటమే, యీనాటి ఘోరకృత్యాలకు కారణం. ఈ దోపిడి విధానాన్ని అరికట్టినపుడే లోకంలో సుఖశాంతులు ఏర్పడుతాయి.

**నీతి :** స్వార్థపరుల దోపిడిని, అరికట్టినపుడే లోకంలో సుఖశాంతులుంటాయి.

**వ్యాఖ్యానం :** బలవంతులు, బలహీనుల్ని లొంగదీసుకొని, వారి సంపదను దోచుకొంటారు. ఇది అనాదిగా లోకంలో జరుగుతున్న విషయం. అందువల్ల, సమాజంలో దోచుకొనేవారు, దోచబడేవారు అనే రెండు తెగలు ఏర్పడ్డాయి. ఈ రెండు తెగల మధ్య జరిగే పోరాటమే, ఎన్నో ఘోరకృత్యాలకు కారణమౌతున్నది. ఈ పోరాటాన్ని ఆపినప్పుడే లోకంలో సుఖశాంతులుంటాయి.

**Meaning:** There are two groups in the human world. They are, those who plunder and those who are plundered. It is the struggle between these two groups that causes all the terrible acts that shatter the world. When such a state of affairs is controlled, peace and prosperity can reign in the world.

Reign = rule

**Moral:** Peace and joy can fill the world only when the greed and selfishness in man is controlled.



# 8. అర్థ పద్ధతి

**66.** **ఇచ్చువాని యొద్ద నీయని వాడున్న**
**చచ్చుగాని యీవి సాగనీడు**
**కల్పతరువు క్రింద గచ్చచెట్టున్నట్లు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** దాత దగ్గర లోభి చేరినట్లయితే, అతడు ఎవ్వరికీ ఏమీ యీయనీయడు. వాడు కల్పవృక్షం క్రింద ముండ్లతో కూడుకొన్న గచ్చ పొదలాంటివాడు.

**నీతి :** లోభిని దూరంగా వుంచాలి.

**వ్యాఖ్యానం :** కల్పతరువు అంటే మనం కోరిన ఫలాలనిచ్చే దేవతా వృక్షం. దాని దగ్గర ముండ్లతో నిండిన గచ్చచెట్టు వుంటే, అక్కడికి ఎవరును పోలేరు. ఆ ఫలాలను అందుకోలేరు, అదే విధంగా ఒక దానశీలి వద్ద, లోభి చేరితే, అర్థించేవారిని దగ్గరకు రానీయడు దానశీలి వారికెట్టి సాయం చేయలేడు.

**Meaning:** If a miser is close to a generous man, he will not allow him to give anything in charity to anyone. The mythical tree of paradise is the 'kalpavriksha' which is capable of granting anything that one desires. A miser is like the thorny bush, under the kalpavriksha, which prevents all from the benefits it grants.

**Moral:** One is wise to keep away from miserly men.



**67.** **ధనము కూడబెట్టి దానంబు సేయక**
**తాను తినక లెస్సదాచు లోభి,**
**తేనెటీగ కూర్చి తెరువరికియ్యదా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** తాను తినకుండా, దానం చేయకుండా, లోభి కూడబెట్టిన ధనం, చివరకు పరులపాలౌతుంది. తేనెటీగలు తేనెతెట్టెలో కూర్చి పెట్టిన తేనె, చివరకు ఒక బాటసారి పాలైపోతుంది గదా. పాచిపండ్ల వాడు దాచిపెడితే బంగారు పండ్ల వాడు తింటాడు.

**నీతి :** లోభి ధనం పరుల పాలవుతుంది కనుక ధనాన్ని సద్వినియోగం చేయాలి.

**అర్థాలు :** తెరువరి = బాటసారి

**వ్యాఖ్యానం :** బాల్యంలో దారిద్ర్యం వల్ల, ఎన్నో కష్టాలను ఎదుర్కొని, చదువుకొని, ఒక వృత్తిని చేపట్టి ధనార్జన చేసేవారు ఎందరో లోకంలో వున్నారు. చిన్నప్పుడు ధనం లేక, పడ్డ బాధల్ని తలచుకొంటూ తాము సంపాదించిన ధనాన్ని అపురూపంగా చూచుకొని, దానిని తమ కోసం కాని, తమ భార్య కోసం కాని ఖర్చు పెట్టడానికి ఇష్టపడక, దాచుకొనేవారు కూడ వున్నారు. అలా దాచుకొన్న ధనం దొంగల పాలైపోవచ్చు. ఆదాయం పన్ను శాఖవారి చేతికి చిక్కవచ్చు. ఆ విధంగా కూడబెట్టిన ధనాన్ని లోభి పోగొట్టుకుంటాడు.

**Meaning:** A miser, who does not spend on himself, or others, keeps his wealth untouched. He does not realize that one day that wealth will find its way into another's hands, like honey, that is collected so diligently by the bees, is enjoyed by someone else.

Diligently =శ్రద్ధతో

**Moral:** A miser's wealth is never used by him and is used by others after him. Wealth is meant to be spent well for good actions.



**68.** **కలిమిగల్గునాడు, కానదు మదమున**
**లేమి నాడు మొదలె లేదుపెట్ట,**
**కలిమిలేమి లేని కాలమ్ము గలుగునా!**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ధనం వున్ననాడు గర్వంతో ఎవ్వరికీ దానం చేయడు. ధనం లేని నాడు తాను దానం చేయాలనుకొన్నా చేయలేడు. కలిమి, లేమి రెండు లేని కాలం వుండదు కదా!

**నీతి :** ధనం ఉన్నప్పుడే దానం చేయాలి.

**వ్యాఖ్యానం :** తల్లిదండ్రుల నుండి గాని, తమ స్వయంకృషి వల్ల గాని, ధనాన్ని పొందేవారు ఎందరో వున్నారు. అలా ధనవంతులైన కొందరు ధన గర్వంతో మదించి, ఎవ్వరికీ దానం గాని, సాయం గాని చేయరు. అనుకోకుండ వ్యాపారంలో వచ్చిన నష్టం వల్ల గాని, తమ పిల్లలు దుబారా చేయడం వల్ల గాని, వారా ధనాన్ని పోగొట్టుకొంటారు. అప్పుడు దానధర్మాలు చేయాలని వారు ప్రయత్నించినా వారి చేతిలో ధనం లేనందువల్ల, ఆ ప్రయత్నాలు ఫలించవు. ధనం చేతిలో వున్నప్పుడు అట్టి పనులు చేయలేకపోయామని వారు చింతలో మునిగిపోతారు. ధనం ఉన్న కాలం వుంటుంది. ధనం లేని కాలం వుంటుంది. రెండు లేని కాలం వుండదని వారు ఆలస్యంగా తెలుసుకొంటారు.

**Meaning:** A rich man has no heart to spend when he is prosperous and wealthy as his riches blind him with arrogance. He does not share his wealth with anyone. A man in poverty cannot be generous because he does not have the ability to do so. It is strange

that people cannot spend for charitable acts, when they are well off and when in poverty they have nothing to spend. Either riches or poverty are with man all the time.

**Moral:** A man should be generous when he has money.



**69.** **ధనము లేమి యనుట దావానలంబగు**
**తన్ను జెరచు తనదు దాపుజెరచు**
**ధనము లేమి, మదిని తలచుట పాపంబు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** దారిద్ర్యం దావాగ్ని లాంటిది. అది దరిద్రుణ్ణే కాదు, అతని దగ్గర వున్న వాళ్ళను కూడ కాల్చేస్తుంది. దారిద్ర్యాన్ని గూర్చి తలచుకోవడం పాపం. అది ఒక పెద్ద పీడకల లాంటిది.

**నీతి :** దారిద్ర్యం మహా భయంకరమైనది. అది యెవరికీ రాకూడదు.

**వ్యాఖ్యానం :** ఆస్తిపాస్తులు లేక, రెక్కాడితే కాని, డొక్కాడని నిరుపేదల్ని గ్రామాలలో, పట్టణాలలోని బస్తీల్లోని, మురికివాడల్లో మనం చూస్తున్నాం. వారికి తినడానికి సరియైన తిండి, త్రాగడానికి మంచినీళ్ళు, ఉండడానికి శుభ్రమైన ఇల్లు వుండవు. అక్కడ దుర్గంధం కూడా వ్యాపించి యుంటుంది. అట్టి దారుణ పరిస్థితి, ఆ ప్రాంతానికంతా విస్తరించి వుంటుంది. నాగరికులైనవారు ఆ ప్రాంతాన్ని దర్శించరు. అట్టి దుర్భరదారిద్ర్యాన్ని, వూహించుకోవడమే నాగరిక సమాజానికి పీడకల లాంటిది. కాబట్టి స్వయంకృషితో దరిద్ర్యాన్ని దరిదాపులకు రాకుండా చూచుకోవాలి.

**Meaning:** Poverty is like a fire. It consumes not only the poor man but all those around him. It is wrong to even dwell on the thought of poverty. It is nothing short of a night mare.

Nightmare = frightening dream, దుస్స్వప్నం; dwell = ఆలోచన నిలుపుట

**Moral:** Poverty is very frightening. It should never happen to anyone.



**70.** **కలనాటి ధనము లక్కర**
**గలనాటికి దాచ, గమలగర్భుని వశమా?**
**నెలనడిమినాటి వెన్నెల**
**యలవడునే గాదెబోయ నమవసనిసికిన్.**

**– పెద్దన**

**భావం :** సంపదలో వున్నపుడు తన దగ్గర వున్న ధనాన్ని, అవసరం వచ్చిన నాటికి దాచి వుంచడం ఎవ్వరికి సాధ్యం కాదు. పున్నమినాడు కాచిన వెన్నెలను, అమావాస్య నాటికి దాచి వుంచుకోవడం సాధ్యమేనా?

**నీతి :** ఉన్ననాటి ధనం, అవసరమున్న నాటికి దాచివుంచలేము.

**వ్యాఖ్యానం :** ఒక వ్యక్తికి, తల్లిదండ్రుల ద్వారా బోలెడు ఆస్తి లభించింది. భార్య ద్వారా పెద్ద కట్నం వచ్చింది. ఇల్లు, పొలం, నగలు ఇత్యాది సంపదలు సమకూడాయి. నడమంత్రపుసిరిలో ఒళ్లు తెలియక అతడు విలాసాలలో మునిగి వ్యసనాలకు లోబడి, ఆస్తినంతా కర్పూరంలాగా కరగించేశాడు. ఒక్క పైసా కూడా చేతిలో లేనందువల్ల, దినం గడవడం కష్టమైపోయింది. అతని ఆరోగ్యం కూడ క్షీణించింది. అట్టి ఆపదలలో నుంచి బైటపడడానికి అతనికి ధనం అవసరమైనది. కాని ఆ ధనం అతనికి లభ్యం కాలేదు. తన దగ్గర ధనం వున్నప్పుడు అవసరానికి పనికి వస్తుందని కొంచెం కూడ దాన్ని దాచుకోలేకపోయాడు. పున్నమి నాటి వెన్నెలను అమావాస్య నాటికి దాచుకోవడం సాధ్యం కాదని ఆలస్యంగా అతడు తెలిసికొన్నాడు.

**Meaning:** It does not seem possible to keep aside any amount of wealth for a future rainy day. A man may find that on a day he really needs money he may have none, even though he had been wealthy in the past. The poet asks whether it is possible to store the moonlight of a full moon for the dark night of the new moon.

**Moral:** Wealth in hand today may not be there for the hour of need, tomorrow.



**71.** **ఏ నరునకు విత్తముగల,**
**దానరుడు కులీనుడ ధికుదార్యుడతండే**
**ధీనిధి, ధన్యుడు నేర్పరి,**
**నానాగుణగణము కాంచనమ్మునునుండున్**

**– భర్తృహరి**

**భావం :** ఎవని దగ్గర ధనం వుంటుందో, అతడే మంచి వంశంలో జన్మించినవాడని, గొప్పవాడని, మేధావంతుడని, నేర్పు గలవాడని, జన్మ ధన్యం చేసుకొన్నవాడని జనం కీర్తిస్తారు. అన్ని గుణాలు ధనంలో వున్నాయంటుందీ లోకం.

**నీతి :** ధనం వున్న వారే లోకంలో గొప్పగా చూడబడతారు. కనుక మానవులు ధనార్జన చేయడం అవసరం.

**అర్థాలు :** కాంచనము = బంగారం.

**వ్యాఖ్యానం :** లోక స్వభావం విచిత్రమైనది. ధనమే లోకాన్ని నడిపిస్తుందని లోకులు విశ్వసిస్తారు. ధనం గలవాడే అన్నింటిలో గొప్పవాడని మాట్లాడతారు. అతడే ఉత్తమ వంశస్థుడని, మేధావంతుడని, పెద్ద మనిషి అని, జన్మ ధన్యం చేసుకొన్నవాడని, నేర్పుగలవాడని వేనోళ్ల కీర్తిస్తారు. అతణ్ణి బంగారంతో పోలుస్తారు. ధనం పోగొట్టుకొన్నాడంటే, అతణ్ణి నికృష్టుడని తెగడుతారు.

**Meaning:** Whoever has a great deal of wealth in his possession he is accepted by the world as being born of noble blood. He is also described as a great man, a very intelligent man, a capable man and as one who is a truly blessed man. The world showers praise on him. The world seems to presume that all virtues are found in wealth alone.

Presume = take for granted

**Moral:** Only a man of wealth is highly respected by all. Hence it is necessary to earn wealth.



**72.** **ఆకలిని మించి భుజియించునట్టి వాడ**
**జీర్ణరోగంబుచే బాధ జెందినట్లు**
**అవసరమును మించి, ధనార్జనమ్ము**
**సలుపువాడొందు సంపద్విషాదగతిని.**

**– మానవ గీత**

**భావం :** ఆకలిని మించి అన్నం తిన్నవాడు అజీర్ణవ్యాధితో బాధపడతాడు. అలాగే, అవసరాన్ని మించి ధనమార్జించినవాడు కుటుంబంలో, సమాజంలో తలయెత్తే అనర్థాల వల్ల బాధలకు లోనవుతాడు.

**నీతి :** అతిగా తింటే అజీర్తి బాధ. అతిగా ఆర్జిస్తే దాచుకొనే బాధ.

**వ్యాఖ్యానం :** ఆకలి తీరేటంత వరకు అన్నం తినడం ఆరోగ్యకరం. ఆకలిని మించి భోజనం చేసినవాడు అజీర్ణ రోగానికి గురి అవుతాడు. అదే విధంగా, తనకు కావలసిన దానికంటే ఎక్కువ ధనం ఆర్జించినవాడు ఎన్నో సమస్యల్ని ఎదుర్కొనవలసి వస్తుంది. ధనమదంతో కుటుంబ సభ్యులే వ్యసనాలకు బానిసలు కావచ్చు. వారు తమ దుష్ప్రవర్తనతో ఇరుగుపొరుగు వారితో కలహాలు కొనితెచ్చుకోవచ్చు. ఇది మనిషిని మనశ్శాంతికి దూరం చేస్తుంది. దీనినే సంపద్విషాదమంటారు.

**Meaning:** A man who eats beyond satisfying his hunger has to suffer with indigestion. One who earns more than is necessary has to suffer with the problems that arise from his family and society, who wish to take away that money from him.

**Moral:** Eat more and suffer indigestion.
Earn more wealth and suffer in trying to protect it.



**73.** **పుత్తడిగలవాని పుండు బాధైనను**
**వసుధలోన చాలవార్త కెక్కు**
**పేదవాని ఇంటిపెండ్లైన ఎరుగరు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ధనం గలవాని పుండు, బాధపెడ్తే, లోకానికంతా అది వార్త అవుతుంది. అదే పేదవాడి ఇంట్లో పెండ్లి అయితే కూడ, ఎవ్వరికి తెలియదు.

**నీతి :** ధనం గలవాడు ఏ చిన్నపని చేసినా పెద్ద వార్త అవుతుంది.

**అర్థాలు :** పుత్తడి = బంగారం

**వ్యాఖ్యానం :** ధనవంతునికి చిన్న పుండు లేస్తే, దాని బాధను గూర్చి పెద్దగా రాస్తారు పత్రికలవాళ్లు. అదే నిరుపేదవాని యింట్లో పెండ్లి అయితే కూడ వారు పట్టించుకోరు. దీనిని బట్టి, ప్రపంచం మనుషుల కంటె ధనానికి ఎక్కువ విలువ ఇస్తుందని అర్థమౌతుంది.

**Meaning:** A sore troubling a rich man, becomes big news, that spreads far and wide, while a wedding in a poor man's home goes totally unnoticed.

sore = పుండు

**Moral:** Even a minor event in a rich man's house is big news.



# 9. అధికార పద్ధతి

**74.** **అధికార గర్వాంధు డడ్డదారులు వెదకు**
**తన గోతిలో తాను పడిపోవు తుదకు.**

**– మానవగీత**

**భావం :** అధికారంతో గర్వించి, కండ్లు మూసుకుపోయినవాడు, తన అధికారం నిలుపుకోవడానికి ఎన్నో అడ్డదారులు వెదకుతాడు. చివరకు, తాను త్రవ్వుకున్న గోతిలోనే తాను పడిపోతాడు. కాబట్టి అధికార గర్వం పనికిరాదు.

**నీతి :** అధికారంతో మిడిసిపడితే గోతిలో దిగబడక తప్పదు.

**వ్యాఖ్యానం :** ప్రపంచ చరిత్రలో ఎన్నో సామ్రాజ్యాలు ఏర్పడ్డాయి. రాజవంశస్థులైన చక్రవర్తులు అధికారం చెలాయించారు. ప్రజల తిరుగుబాటు వల్ల చాల రాజవంశాలు అంతరించిపోయాయి. ఎక్కువ సామ్రాజ్యాలు అంతరించడానికి కారణం చక్రవర్తులు గర్వాంధులై ప్రజలను హింసించడమే.

**Meaning:** A man with power is blinded with his arrogance and tries to safeguard his power by wrong methods. Finally he falls into the very trap that he has set himself. Thus men in power should realize, that pride can lead to their downfall.

vanity = empty pride

**Moral:** The vanity of a man in power leads to his downfall.



**75.** **సత్ప్రవర్తనమ్ము జగతి నేలెను మున్ను**
**అర్థబలము దాని నణగద్రొక్కె**
**కండబలము నేడు గద్దెనెక్కెను గదా**
**నీతి లేక, పాప భీతి లేక.**

**– మానవ గీత**

**భావం :** పూర్వం సత్ప్రవర్తన కలవారే ప్రజల అండతో అధికారం చేపట్టేవారు. తర్వాత ధనం కలవారు సజ్జనుల్ని అణగద్రొక్కి, ధనబలంతో రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవడం మొదలుపెట్టారు. ప్రస్తుతం కండబలం వున్నవారు దౌర్జన్యం చేసి చాలా దేశాలలో రాజ్యాల్ని ఆక్రమించుకొంటున్నారు. వారికి నీతిగాని, పాపభీతిగాని లేవు. ఇట్టి నియంతృత్వ పాలనకు స్వస్తి చెప్పాల్సిన బాధ్యత ప్రజలకు, ముఖ్యంగా యువతకు వుంది.

**నీతి :** రాజ్యం వీరభోజ్యమే కాని చోరభోజ్యం కాకూడదు.

**వ్యాఖ్యానం :** రాజు అంటే ప్రజలను రంజింపజేయువాడని అర్థం. పూర్వం సత్ప్రవర్తన గలవారే రాజ్యాధికారంలో వుండేవారు. తర్వాత ధనబలం గలవారు ఆ తర్వాత కండబలం గలవారు రాజ్యాధికారాన్ని పొందాలని అనుకుంటున్నారు. ప్రజాస్వామ్యంలో ప్రజలు తమ ఓటుహక్కుతో, ఈ పరిస్థితిని మార్చగలరని మనం ఆశిద్దాం.

**Meaning:** In the past, men of good character wielded power. Later money power overcame these noble men and they grabbed political power. Now, men of physical might bully people, have become very powerful. They have neither ethics nor fear of sin.

Wield = hold and use; Grab = snatch

Bully = threaten; Might = Strength, శక్తి

**Moral:** A country should be ruled by heroic virtuous men and not by robbers and bullies.



**76.** **'ఎవని శీలమ్మునైన పరీక్ష సేయ**
**నెంచితివయేని, అధికారమిచ్చి చూడు'**
**అన్న ఆర్యోక్తిలోని గూఢార్థమెరిగి**
**ఈయదగు, అధికారమ్మునెవరికైన.**

**– మానవ గీత**

**భావం :** 'ఎవరి శీలాన్నైనా పరీక్ష చేయదలుచుకొంటే, రాజ్యాధికారాన్ని యిచ్చి చూడండి' అన్నది ఆర్యోక్తి. ఇందలి అర్థం తెలిసికొన్నతర్వాతనే ఎవ్వరికైనా రాజ్యాధికారం ఇవ్వడం మంచిది.

**నీతి :** శీలం పరీక్షించకుండా అధికారం ఇవ్వకూడదు.

**వ్యాఖ్యానం :** 'అధికారం అవినీతికి దారితీస్తుంది. సంపూర్ణమైన అధికారం సంపూర్ణమైన అవినీతికి దారితీస్తుంది' అన్నది లోకోక్తి. ఎవరి శీలాన్నైనా పరీక్ష చేయదలుచుకొంటే, అతనికి అధికారమిచ్చి చూడండని విషయజ్ఞులన్నారు. కాబట్టి పరీక్ష పెట్టి మంచి శీలం గలవానికే రాజ్యాధికారం కట్టబెట్టాలి.

**Meaning:** It is often said that the character of a man should be first tested and then the reins of power should be put in his hands. It is always better to entrust power to a deserving person, only after carefully making certain that he will not misuse it.

reins = పగ్గం లేదా కళ్లెం

**Moral:** Power should be given to individuals, only after being certain about their character and sincerity.



**77. మాలాకారుండే గతి**
**పూలను గ్రహియించు, తేటి పుష్పమరందం**
**బేలీలగ్రోలు, అటులె, నృ**
**పాలుడు చేకొనగవలయు ప్రజలధనమ్ముల్.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** పుష్పహారాలను తయారుచేసేవాడు ఏ విధంగా పూలను చెట్ల నుండి తనకవసరమైనంత వరకు, చెట్టుకు నష్టం రాకుండా కోసుకుంటాడో, పూలలోని తేనెను ఏ విధంగా తుమ్మెద పూలకు నొప్పి తగలకుండా గ్రహిస్తుందో, ఆ విధంగా రాజు ప్రజల నుండి ధనాన్ని గ్రహించాలి. ప్రజల్ని పీడించి పన్నులు వసూలు చేయకూడదు.

**నీతి :** పూల నుండి తేనెటీగ తేనెను గ్రహించినట్లు ప్రభువు ప్రజల నుండి ధనాన్ని గ్రహించాలి.

**వ్యాఖ్యానం :** రాజు ప్రజల ధనాన్ని ఎలా స్వీకరించాలో ఇచ్చట చెప్పబడింది. రాజు ప్రజల క్షేమం కోసం ప్రజలను పీడించకుండ, ప్రజల నుండి పన్ను రూపంలో ధనాన్ని వసూలు చేయాలి. ఆ వసూలు పూలదండను కూర్చేవాడు, తీగకు దెబ్బ తగలకుండ ఏ విధంగా పూలను కోసుకొంటాడో తుమ్మెద ఏ విధంగా పువ్వుకు నొప్పి లేకుండా తేనెను గ్రహిస్తుందో ఆ విధంగా వుండాలి.

**Meaning:** A man who weaves garlands chooses his flowers with great care. He takes care that the trees and bushes are not harmed while he picks his flowers. As a bee sucks honey from the flowers, without causing pain to the flower, so also should a king ensure that he collects taxes from his subjects without troubling them. He should never harass his people and extract taxes.

**Moral:** A king should collect taxes painlessly as a bee sucks honey from a flower.



# 10. మూర్ఖ పద్ధతి

**78.** **తుమ్మచెట్టు ముండ్లు తోడనే పుట్టును**
**విత్తులోన నుండి వెడలునట్లు,**
**మూర్ఖునకు బుద్ధి ముందుగాబుట్టును**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** పుట్టినప్పుడే తుమ్మ చెట్టుకు ముండ్లు పుడుతాయి. అవి విత్తు నుండే ప్రారంభమౌతాయి. ఆ రీతినే మూర్ఖునికి చెడ్డబుద్ధి పుట్టుకతోనే వస్తుంది.

**నీతి :** మూర్ఖునికి మూర్ఖత్వం పుట్టుకతోనే వస్తుంది.

**వ్యాఖ్యానం :** ప్రతి చెట్టుకు, ప్రతి జీవికి దాని గుణం దాని పుట్టుకతోనే వస్తుంది. వేపచెట్టుకు చేదు, తుమ్మచెట్టుకు ముండ్లు, పులి పిల్లలకు క్రూరత్వం పుట్టుకతోనే వస్తాయి. అట్లే మూర్ఖునికి, మూర్ఖత్వం పుట్టుకతో వస్తుంది. పుట్టుకతో వచ్చింది, పుడకలతో గాని పోదంటారు. అంటే జన్మతో వచ్చింది చావుతో గాని పోదని అర్థం.

**Meaning:** The thorny bush, Acacia Arabica, has thorns right from the time it sprouts from the seed. A foolish man's stupidity is born with him at birth.

**Moral:** Foolishness is a trait that is present in a fool right from the time of his birth.

trait = చిహ్నం, గుర్తు



**79.** **పాముకన్న లేదు పాపిష్ఠి యగు జీవి**
**అట్టి పాము చెప్పినట్టు వినును**
**ఇలను మూర్ఖుజెప్ప నెవ్వరి తరమయా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** పాము చాలా పాపిష్ఠిది. అది మనుష్యుల్ని కరిచి తన విషంతో చంపుతుంది. అట్టి పామును పట్టుకొని నాగస్వరం ఊది ఆడించవచ్చు. కాని మూర్ఖుణ్ణి ఎన్ని విధాలుగా చెప్పినా, ఒప్పించడం సాధ్యం కాదు.

**నీతి :** మూర్ఖుడు పాముకంటే పాపిష్ఠివాడు.

**వ్యాఖ్యానం :** అన్ని పక్షులు, జంతువులు శిక్షణ యిస్తే మనం చెప్పిన పనులు చేస్తాయి. పాము చాలా పాపిష్ఠి జీవి. అది తన విషపు కోరలతో కరచి మనుష్యుల్ని చంపుతుంది. అట్టి పామును కూడ, నాగస్వరంతో నాట్యం చేయించవచ్చు. కాని, ఎన్ని విధాలుగా చెప్పినా మూర్ఖుణ్ణి ఒప్పించలేము.

**Meaning:** The snake is a horrible creature. It can bite and kill humans. Even such a dreadful creature can be made to dance to the tune of the snake charmer. The fool on the other hand cannot be made to understand and accept anything, however much one may try.

**Moral:** A fool is often worse than the snake.



**80.** **పొట్లకాయ రాయి పొసగ త్రాటను గట్ట**
**లీలతోడ వంక లేక పెరుగు,**
**కుక్కతోకగట్ట గుదురునా చక్కగా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** పొట్లకాయకు ఒక రాయి కట్టి వ్రేలాడదీస్తే, అది వంక లేకుండా చక్కగా పెరుగుతుంది. అదే విధంగా కుక్క తోకను చక్కజేయాలని ప్రయత్నిస్తే, దాని వంకర పోదు. అలాగే ఎన్ని ప్రయత్నాలు చేసినా మూర్ఖుని మనస్సు మారదు.

**నీతి :** మూర్ఖుని బుద్ధి మార్చడం సాధ్యం కాదు.

**వ్యాఖ్యానం :** పొట్ల తీగను పందిరివేసి పెంచుతారు. పొట్లకాయలు పందిరి నుండి క్రిందికి వ్రేలాడుతూ పెరుగుతాయి. అందులో కొన్ని వంకరగా వుంటే, వాటిని చక్కగా చేయడానికి త్రాటితో రాయి గట్టుతారు. అప్పుడా కాయలు వంకర లేకుండా పెరుగుతాయి. అదే విధంగా కుక్క తోకను చక్క చేయాలని ప్రయత్నిస్తే దాని వంకర పోదు. అలాగే ఎన్ని ప్రయత్నాలు చేసినా, మూర్ఖుని మనస్సు మారదు.

**Meaning:** The snake gourd can be made to grow straight if a stone is hung on its end. Trying to straighten the tail of a dog is an impossible task. Similarly it is impossible to change the mind of a fool.

**Moral:** It is impossible to convince a fool.



**81.** **పండితులైనవారు దిగువం దగ నుండగ నల్పుడొక్కడు**
**ద్దండత బీఠమెక్కిన బుధ ప్రకరంబుల కేమి యెగ్గగున్**
**గొండొక కోతి చెట్టుకొన కొమ్మల నుండగ, గ్రింద గండభే**
**రుండ మదేభసింహ నికురంబములుండవె చేరి భాస్కరా!**

**భావం :** ఒక చెట్టు కొన కొమ్మ మీద కోతి కూర్చుని వుంటుంది. నేల మీద ఏనుగులు, సింహాలు వుంటాయి. అంతమాత్రాన కోతికి గొప్పతనం రాదు. ఒక పండిత సభలో, అల్పుడొకడు బలవంతంగా వేదిక నెక్కి అగ్రాసనంలో కూర్చుంటాడు. అందువల్ల పండితులైనవారి గొప్పతనం తగ్గిపోదు. అల్పుని బుద్ధి బైట పడుతుంది.

**నీతి :** వ్యక్తిని బట్టి గొప్పతనం కాని స్థానాన్ని బట్టి కాదు.

**వ్యాఖ్యానం :** మనం ఎన్నో సభల్ని చూస్తుంటాము. ఆహ్వానితులైన చిన్నలు, పెద్దలు, పండితులు, సామాన్యులు వచ్చి, వారి వారి ఆసనాలలో కూర్చుంటారు. అల్పుడైన సామాన్యుడొకడు పిలవకుండానే వేదికనెక్కి అగ్రాసనంలో కూర్చుంటాడు. అందువల్ల, క్రింద కూర్చున్న మాన్యుల మర్యాదకు భంగమేర్పడదు. ఉదాహరణకు అరణ్యంలో ఒక చెట్టు క్రింద ఏనుగులు సింహాల వంటి జంతువులు చేరివుంటాయి. కాని కోతి ఒకటి చెట్టు కొనకొమ్మ మీద నెక్కి కూర్చుంటుంది. అందువల్ల క్రిందనున్న జంతువుల గొప్పతనం తగ్గిపోదు. కోతి బుద్ధి బైటపడుతుంది.

**Meaning:** A monkey may swing high at the edge of a branch. Lions and elephants may wander below the tree. But that does not in any way help to boost up the worth of the monkey. Similarly if in a scholars' assembly, a fool were to force himself in, and occupies a prominent place, the worth of the scholars is in no way diminished. The foolish man stands out as a misfit among the scholars.

**Moral:** The worth of an individual is assessed on his character and ability, and not on the position he occupies.



**82.** **తెలియని మనుజుని సుఖముగ**
**దెలుపం దగు, సుఖతరముగ దెలుపగ వచ్చున్**
**దెలిసినవానిం, దెలిసియు**
**దెలియని నరుదెల్ప బ్రహ్మదేవుని వశమే.**

**– భర్తృహరి**

**భావం :** ఏమీ తెలియని వానికి విషయాలను సులభంగా తెలియచేయవచ్చు. తెలిసిన వానికి ఇంకా సులభంగా తెలియచేయవచ్చు. కాని తెలిసీ తెలియని వానికి తెలియచేయడం బ్రహ్మదేవునికి కూడ చేతగాదు.

**నీతి :** తెలిసీ తెలియని వానికి తెలియచెప్పడం అసాధ్యం.

**వ్యాఖ్యానం :** ఏమీ తెలియని వానిని దగ్గర కూర్చుండ బెట్టుకొని విషయాలను సులువుగా బోధించవచ్చు. అతడు శ్రద్ధతో విని విషయాలను గ్రహిస్తాడు. తెలిసిన వానికి తెలియచెప్పడం చాలా సులభం. అతనికి విషయాలపై అవగాహన వుంటుంది. కాబట్టి వెంటనే వాటిని గ్రహిస్తాడు. తెలిసీ తెలియని వానికి బోధించడం చాలా కష్టం. అతడు మిడిమిడి జ్ఞానంతో అర్థం లేని ప్రశ్నలు వేస్తాడు. తెలియకపోయినా తెలిసినట్లు నటిస్తాడు.

**Meaning:** It is possible to explain and convince a man who is ignorant. It is also easy to explain to a knowledgeable man. But it is impossible to explain and convince a man with half-baked knowledge.

**Moral:** It is impossible to explain to a man who has half-baked knowledge.



**83.** **తెలివి యొకింత లేని యెడ, దృప్తుడనై కరిభంగి సర్వమున్**
**దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితి దొల్లి యిప్పుడు**
**జ్ఞులమతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలినై**
**తెలియనివాడనై మెలగితిం గతమయ్యె నితాంతగర్వమున్.**
**- భర్తృహరి**

**భావం :** నాకు కొంచెం కూడా తెలివి లేనప్పుడు, ఏనుగులాగా మదించి, సర్వం తెలిసినట్లు గర్వంతో తిరిగాను. మంచి పండితుల వద్దకు వెళ్ళి, కొంత తెలివి తెచ్చుకొని, నాకేమి తెలియదని తెలుసుకొన్నాను. నా గర్వం వదలిపోయింది. అంతా తెలుసునన్నవాడు అజ్ఞుడు. ఏమీ తెలియదన్నవాడు సర్వజ్ఞుడు.

**నీతి :** ఎవరూ తనకు అంతా తెలుసని గర్వించకూడదు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ తెలివిలేనివాని ప్రవర్తనను గూర్చి చెప్పబడింది. పూర్వం నాకు ఏ మాత్రం తెలివి లేనప్పుడు, ఏనుగులాగా గర్వించి, అంతా తెలిసినవాడుగా ప్రవర్తించాను. ప్రస్తుతం మంచి పండితుల దగ్గరకు వెళ్లి, కొంత తెలివితెచ్చుకొని, నాకేమీ తెలియదన్న విషయాన్ని తెలుసుకొన్నాను. నా గర్వం పూర్తిగా వదలిపోయింది అని అతడు తెలిపాడు.

**Meaning:** The poet says “when I knew little, I wandered like a mad elephant, in utter vanity, that I knew everything. When I came upon scholars who were far more learned than I was, my arrogance disappeared. I realized how little I knew”. A man, who believes he knows all, is an ignorant man. One who believes he knows too little is a truly learned man.

**Moral:** No man should presume that he knows everything, there is to know in this world.

Presume = take for granted



**84.** **ఎలుగు తోలు తెచ్చి యెన్ని నాళ్ళుదికిన**
**నలుపు నలుపెకాని తెలుపు కాదు,**
**కొయ్య బొమ్మదెచ్చి కొట్టిన పలుకునా;**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఎలుగుబంటితోలు నల్లగా వుంటుంది. ఎన్నినాళ్లు ఉతికినా అది తెలుపుకాదు. ఎంత కొట్టినా కొయ్యబొమ్మ పలకదు, అట్లే మూర్ఖునికెంత చెప్పినా బోధపడదు.

**నీతి :** ఎంత మెరుగుపెట్టినా ఇత్తడి పుత్తడి కాదు.

**Meaning:** The fur of a bear is black in colour. No amount of washing can make it white. A wooden doll remains mute however much it is beaten. In the same manner no one can make a fool understand, or learn, anything.

**Moral:** No amount of polishing can make brass, gold.



**85.** **ఓగునోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని**
**భావమిచ్చి మెచ్చు పరమలుబ్ధ**
**బంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** చెడ్డవాడు చెడ్డవానినే మెచ్చుకొంటాడు. మంచివానిని మెచ్చుకొనడు. అజ్ఞాని పరమలోభినే మెచ్చుకొంటాడు. పంది బురదను మెచ్చుకొంటుంది. అందులో పొర్లుతుంది. కాని పన్నీరును మెచ్చుకొనదు. అంటే మంచి వాళ్లను మంచివాళ్ళు, చెడ్డవాళ్ళను చెడ్డవాళ్ళే మెచ్చుకుంటారని అర్థం.

**నీతి :** తాను ఎలాంటివాడో అలాంటివాడినే అతడు మెచ్చుకుంటాడు.

**Meaning:** An evil man admires another evil man. A noble man admires another noble man. An evil man has no word of praise for a good man. An ignorant man is full of praise for a selfish man. A pig loves mud and slush and revels in it. It does not enjoy perfume. Hence good people praise good people and evil ones praise bad people

Revel = enjoy

**Moral:** A man has admiration only for another like him.



**86.** **మృగము మృగమనుచును మృగమును దూషింత్రు**
**మృగము కన్న చెడ్డ మూర్ఖుడగును**
**మృగముకున్న గుణము మూర్ఖునకేదయా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మృగం మృగం అంటూ మనం మృగాన్ని దూషిస్తాం. మృగం కంటె మూర్ఖుడు చెడ్డవాడు. మృగం ఆకలైనపుడే, ఇతర జంతువులను చంపి తింటుంది. మూర్ఖుడు అన్ని వేళలా, అందరిని హింసిస్తుంటాడు. మృగానికున్న గుణం మూర్ఖునికి లేదు.

**నీతి :** మూర్ఖుని కంటే మృగం మేలు.

**Meaning:** An epithet 'beast' is used as a word of abuse. A stupid man is worse than a beast. A beast is cruel and kills only when it is hungry. A foolish man harasses and troubles everyone at all times. A beast is certainly preferable to a foolish man.

Epithet = a word describing a quality

Abuse = insulting language

**Moral:** A fool can be more dangerous than a beast.



**87.** **హీనుడెన్ని విద్య లిల నభ్యసించిన**
**ఘనుడు గాడు మొరకు జనుడె గాని**
**పరిమళములు గార్దభము మోయ ఘనమౌనె**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** హీనుడైనవాడు ఎన్ని విద్యలను నేర్చినా, ఘనుడు కాలేడు. హీనుడుగానే వుంటాడు. గంధపు చెక్కల్ని గాడిద యెన్నిమార్లు మోసినా, అందలి పరిమళాల్ని గ్రహించలేదు. గాడిదలాగానే వుంటుంది.

**నీతి :** ఎన్ని విద్యలు నేర్చినా హీనుడు హీనుడే గాని గొప్పవాడు కాడు.

**Meaning:** An unworthy man remains unworthy, despite having acquired skill in a number of arts. A donkey may have carried on its back, loads of sandalwood any number of times, yet it remains insensitive to the fragrance of sandalwood. A donkey remains a donkey forever.

**Moral:** A fool remains a fool in spite of all that he is taught.



**88.** **విద్యలేనివాడు విద్వాంసు చేరువ**
**నుండగానె పండితుండు కాదు**
**కొలది హంసల కడ కొక్కెరలున్నట్లు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** విద్యలేనివాడు విద్వాంసుల దగ్గర చేరినంత మాత్రాన, విద్వాంసుడు కాలేడు. ఒక సరస్సులో వున్న హంసల దగ్గరకు పోయినంత మాత్రాన, కొంగలు హంసలు కాలేవు కదా.

**నీతి :** విద్యా విహీనుడు, విద్వాంసులతో చేరినంత మాత్రాన విద్వాంసుడు కాలేడు.

**Meaning:** A person who is not educated can never become a scholar even if he is in the company of scholars. A crane can never be a swan even if it haunts the same lake with a number of swans.

Crane = కొంగ; Haunt = సంచరించు

**Moral:** An uneducated man remains the same even if he is among scholars.



# 11. దుర్జన పద్ధతి

**89.** **అంతరంగమందు నపరాధములు సేసి**
**మంచివానివలెనె మనుజుడుండు,**
**ఇతరు లెరుగకున్న నీశ్వరుడెరుగడా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** తన మనస్సులో అపరాధాల్ని చేసి అవి యెవ్వరికి తెలియవని అనుకొని, పైకి మంచివాడుగా నటిస్తుంటాడు దుర్జనుడు. ఇతరులకు తెలియకపోయినా, దైవం గమనిస్తాడు గదా!

**నీతి :** అందరి కనులు కప్పగలవు గాని దైవం కనులు కప్పలేవు. అందువల్ల తప్పు చేయరాదు.

**వ్యాఖ్యానం :** పైకి పెద్ద మనుష్యులలాగా కన్పిస్తూ, మనస్సులో దురాలోచనలు చేసేవారున్నారు. ఉదాహరణకు అగ్ని ప్రమాదాలు, తుఫానులు, భూకంపాల వంటి ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు, బాధితులైన ప్రజలను ఆదుకోవడానికి కొన్ని సేవా సంస్థలు ముందుకు వస్తాయి. ప్రజల నుండి విరాళాలను విస్తారంగా వసూలు చేసి, అందులో వీలైనంత ఎక్కువ భాగాన్ని రహస్యంగా స్వార్థానికి వాడుకొని ప్రజాసేవకే అంతా ధనం వుపయోగించినట్లు లెక్కలు చూపేవారున్నారు. ఈ విషయం ఇతరులకు తెలియదని వారనుకొంటారు. కాని దైవం కన్నులు కప్పలేరు కదా. వారి మోసం ఒకనాడు తప్పక లోకానికి తెలుస్తుంది. వారు శిక్షింపబడతారు.

**Meaning:** A man who sins in his mind and pretends to be a good man in the eyes of the world is, by nature, a bad man. Even if others remain unaware of his evil thoughts God is bound to know about them.

**Moral:** Never sin even in thought. Others may not know but God will.



**90.** **అల్పబుద్ధి వాని కధికారమిచ్చిన**
**దొడ్డవారినెల్ల తొలగగొట్టు,**
**చెప్పు దినెడి కుక్క చెరకు తీపెరుగునా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** చెప్పును తినడానికి అలవాటుపడ్డ కుక్క, చెరకు తీపిని తెలుసుకోలేదు. అలాగే అల్పుడైనవాడు అధికారంలోకి వస్తే, బుద్ధిమంతుల యొక్క ప్రజ్ఞా విశేషాలు తెలుసుకోలేక, వారిని పదవుల నుండి తొలగిస్తాడు.

**నీతి :** అల్పునికి అధికారం ఇవ్వకూడదు.

**వ్యాఖ్యానం :** సదసద్వివేచన శక్తి, యోగ్యత లేని అల్పబుద్ధి వానికి బాధ్యతాయుతమైన అధికార పదవి యివ్వకూడదు. అలా యిస్తే, అతడు బుద్ధిమంతుల యొక్క ప్రతిభా విశేషాలను తెలిసికొనలేక వారిని పదవుల నుండి తొలగిస్తాడు. ఉదాహరణకు చెప్పును కొరికి తినడానికి అలవాటు పడ్డ కుక్కకు చెరకు గడను అందిస్తే, అది దాని తీపిని తెలుసుకోలేక త్రోసివేస్తుంది.

**Meaning:** Dogs love to chew leather footwear. It can never relish the sweetness of sugar cane. Similarly if an evil man attains a position of power, he can never appreciate the worthy advice of good, noble people and gets rid of them.

Attain = get

**Moral:** Never hand over power to an evil man.



**91.** **అల్పుడెపుడు బల్కు నాడంబరముగాను**
**సజ్జనుండు బల్కు చల్లగాను**
**కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** అల్పుడైనవాడు కంచులాగా ఆడంబరంగా పల్కుతుంటాడు. సజ్జనుడు బంగారం లాగా చల్లగా పల్కుతుంటాడు. అల్పునికి, సజ్జనునికి వున్న భేదం ఇదే.

**నీతి :** ఆడంబరం ఎవరికీ తగదు.

**వ్యాఖ్యానం :** జ్ఞానహీనుడైన అల్పుడు తనకు లేని గొప్పతనాన్ని చాటుకోవాలని ఆడంబరంగా మాట్లాడతాడు. పూర్ణ జ్ఞానవంతుడైన సజ్జనుడు మితంగా సౌమ్యంగా మాట్లాడతాడు. ఉదాహరణకు విలువ లేని కంచు ఘనంగా మ్రోగుతుంది. విలువ గల బంగారం ఆ విధంగా మ్రోగదు. మిత భాషిత్వం, స్మిత భాషిత్వం సజ్జనుల లక్షణం. అతి భాషణం అహంకార భాషణం దుర్జన లక్షణం. అన్నీ వడ్డించిన విస్తరి అణిగి మణిగి వుంటుంది. ఏమీ లేని విస్తరి ఎగిరెగిరి పడుతుంది.

**Meaning:** A man with a weak character is vain. His words are loud and pompous as he is always boasting. A worthy man speaks gentle words sober and dignified. The former's words ring loud like bronze while the latter's words ring low, like gold.

**Moral:** Vanity is a bad quality in anyone.

Vanity = empty pride



**92.** **కాని వానితోడ గలసి మెలంగిన**
**హానివచ్చు నెంతవానికైన**
**కాకి గూడి హంస కష్టంబు పొందదా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** కాకితో సహవాసం చేస్తే, హంస తప్పక కష్టాలపాలౌతుంది. అలాగే చెడ్డవానితో కలిసి వుంటే, ఎట్టివానికైనా హాని తప్పదు.

**నీతి :** దుష్ట సహవాసం హానికరం.

**వ్యాఖ్యానం :** ఇక్కడ దుష్ట సహవాసాన్ని గూర్చి చెప్పబడింది. దుష్టున్ని దూరంగా వుంచాలి. దుష్టులతో నీవు సహవాసం చేస్తే అతడు చేసే దుష్టకార్యాల వల్ల నీకు హాని కలుగుతుంది. ఉదాహరణకు కాకుల ఆహ్వానంపై ఒక హంస కాకుల దగ్గరకు వచ్చింది. కాకులు చేసే గోలను భరించలేని పొరుగు వారు కాకులపై రాళ్లు రువ్వినారు. అవి హంసకు కూడా తగిలాయి. హంస గాయపడింది.

**Meaning:** If a swan seeks the company of a raven, it is bound to get into trouble. In the same way, the company of a bad man is bound to land a good man in trouble.

**Moral:** Evil company is always harmful.



**93.** **గంగపారుచుండు కదలని గతి తోడ**
**మురికివాగు పారు మ్రోత తోడ**
**అధికుడోర్చునట్టు లధముడోర్వగలేడు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** గంగానది ప్రశాంతంగా ప్రవహిస్తుంటూ వుంటుంది. అందలి నీరు కదలినట్లనిపించదు. మురికి వాగు మ్రోత చేస్తూ ప్రవహిస్తూ వుంటుంది. అందలి నీరు ఎగిరెగిరి పడుతూ వుంటుంది. ఉత్తముడైనవాడు గంగానదిలాగా ఓర్పుతో నెమ్మదిగా వుంటాడు. అధముడైనవాడు మురికివాగులాగా ఓర్పులేకుండా మిడిసి మిడిసి పడుతూంటాడు.

**నీతి :** నిండు కుండ తొణకదు.

**వ్యాఖ్యానం :** భారతదేశంలో చాలా పవిత్రమైన పెద్ద నది గంగానది. ఆ నది హిమాలయ పర్వతాల నుండి మహా ప్రవాహంతో నిండి ప్రవహిస్తున్నది. ఆ ప్రవాహం చాలా ప్రశాంతంగా వుంటుంది. ఎటువంటి శబ్దం చేయదు. ప్రక్కనే వున్న మురికి వాగులోని ప్రవాహం చాలా చిన్నది. కాని అది చెవులు గింగురుమనేటట్లు మ్రోతచేస్తూ ప్రవహిస్తుంది. ఉత్తముడైన వ్యక్తి గంగానది లాగా నెమ్మదిగా ఓర్పుతో వుంటాడు. అధముడైనవాడు మురికి వాగులాగా ఓర్పు లేకుండ, ఎగసిపడుతుంటాడు.

**Meaning:** The waters in the river Ganga flow calm and quite. The water looks almost still and tranquil. A small dirty stream rumbles hastily and noisily, splashing its murky waters. A good and a worthy man is calm, quiet and patient like the river Ganga while a worthless man is like the dirty stream, loud, boastful and impatient.

Tranquil = Peaceful, undisturbed

**Moral:** A pot that is full does not splash as it remains steady.



**94.** **వేరు పురుగుచేరి వృక్షంబు జెరచును**
**చీడ పురుగు చేరి చేను జెరుచు**
**కుత్సితుండు చేరి గుణవంతు జెరచును**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** వ్రేళ్లను తినేసే పురుగు చేరి చెట్టును నాశనం చేస్తుంది. చీడ పురుగు చేరి పంట చేనును నాశనం చేస్తుంది. అలాగే, దుష్టుడు చేరి మంచివాడిని చెడగొడతాడు.

**నీతి :** కూసే గాడిద మేసే గాడిదను చెడగొడుతుంది.

**అర్థాలు :** కుత్సితుడు = దుర్మార్గుడు

**Meaning:** The pests that attack the roots of a tree destroy it. Pests can destroy an entire field. Similarly, one bad man's company corrupts even good men who move with him.

**Moral:** A donkey that brays spoils a donkey that is grazing.

Bray = cry of a donkey.



**95.** **అల్పుడెన్ని పల్కులలయక పల్కిన**
**నధికు దూరకుండు నదిరిపడక**
**చెట్టు మీద కాకిరెట్ట వేసినయట్లు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** అల్పుడైనవాడు అధికునిపై నిందలు వేసి, నోరు నొప్పి పుట్టేదాక, అలసిపోక దూషిస్తాడు. అయినప్పటికి అధికుడు అదరకుండా, బెదర కుండా ఆ తిట్లను భరిస్తాడు. ఒక కాకి కోపంతో చెట్టు మీద రెట్టవేస్తే చెట్టు లెక్కచేయదు గదా.

**నీతి :** కుక్కలరిస్తే ఏనుగు బెదరదు. అలాగే అల్పులను లెక్కచేయకూడదు.

**Meaning:** A man of low character can shower abuse on a worthy man. Still a worthy man remains undisturbed and does not react. A crow's dropping on a tree does not bother the tree at all.

**Moral:** The elephant remains calm and undisturbed when dogs bark. Strong, worthy men remains calm when lesser mortals throw abuse at them.

Lesser mortals = అల్పులు.



**96.** **తల నుండు విషము ఫణికిని**
**వెలయంగా దోకనుండు వృశ్చికమునకున్**
**తల తోక యనక యుండును**
**ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ.**

**భావం :** పాముకు తలలో విషం వుంటుంది. తేలుకు తోకలో వుంటుంది. తల, తోక అనకుండా దుష్టునికి నిలువెల్ల విషం వుంటుంది. అలాంటి ఖలుని నుండి నిన్ను నీవు రక్షించుకోవాలి.

**నీతి :** దుర్మార్గుడు దురదగొండిలాంటివాడు ఎక్కడ తాకినా దురద పుట్టిస్తాడు.

**అర్థాలు :** ఫణి = పాము; వృశ్చికము = తేలు; ఖలుడు = చెడ్డవాడు

**వ్యాఖ్యానం :** పాముకు తలలో అంటే కోరలలో విషం వుంటుంది. పామును పట్టుకొనేవాడు, దాని తలను ఒడిసిపట్టుకొని, అది తనను కోరలతో కరవకుండా చూసుకొంటాడు. తేలుకు విషం దాని తోక కొండిలో వుంటుంది. తేలును పట్టుకొనేవాడు, అది తన కొండితో కుట్టడానికి వీలులేని విధంగా నేర్పుతో పట్టుకొంటాడు. కాని దుష్టునికి విషం ఒంటి నిండ వుంటుంది. ఎక్కడ పట్టుకొన్నా, అతడు కాటు వేస్తాడు. దుష్టుని విషపు కాటు నుండి తప్పించుకోవడం సాధ్యం కాదు కాబట్టి దుష్టునికి దూరంగా ఉండాలి.

**Meaning:** Snakes have poison in their fangs, scorpions have poison in their tails, but an evil man has poison all over his body.

**Moral:** An evil man is like the poisonous plant which causes a rash wherever it touches the body.



**97.** **బలవంతుడ నాకేమని**
**పలువురతో నిగ్రహించి పలుకుటమేలా?**
**బలవంతమైన సర్పము**
**చలిచీమల చేత జిక్కి చావదె సుమతీ.**

**భావం :** నేను బలవంతుణ్ణి. నన్నెవరును ఓడించలేరని పలువురతో గర్వించి పలుకుట మంచిది కాదు. పాము బలవంతమైనదే కానీ, చలి చీమల గుంపుకు దొరికితే చస్తుంది కదా.

**నీతి :** మందితో విరోధం పెట్టుకోకు. అనేక మందిని ఒక్కడు ఎదుర్కోకూడదు.

**వ్యాఖ్యానం :** ఎంత బలవంతుడైనా, పలువురితో విరోధం పెట్టుకోకూడదు. వారితో పోరాటానికి దిగకూడదు. చీమలతో పోల్చుకొంటే, పాము చాలా బలవంతమైనది. కాని ఆ చీమలు గుంపుగా వచ్చి, దాడిచేస్తే పాము చస్తుంది.

**Meaning:** A man should never be over confident, believing he can behave as he pleases, just because he has strength. He should remember that a swarm of ants can kill a huge serpent.

Swarm = గుంపు

**Moral:** No one should make too many enemies as united they may prove too strong for him.



**98.** **లోకములోన దుర్జనుల లోతు నెరుంగక చేరరాదు, సు**
**శ్లోకుడు చేరినం గవయజూతురు చేయుదురెక్కసక్కెముల్**
**కోకిలగన్న చోట గుమిగూడి యసహ్యపు గూతలార్చుచున్**
**గాకులు తన్నవే తరిమి కాయము తల్లడమంద, భాస్కరా!**

**భావం :** దుర్జనుల లోతుపాతులు తెలుసుకోకుండ, సజ్జనుడు వారి చెంత జేరితే, వారు అతణ్ణి ఎకసెక్కములాడి గేలి చేస్తారు. ఎలాగంటే, కోకిలను చూచిన కాకులు గుంపుగా చేరి, అసహ్యంగా కూతలు పెట్టి దానిని తన్ని తరిమేయాలని చూస్తాయి కదా!

**నీతి :** దుర్జనులను దూరంగా ఉంచాలి.

**అర్థాలు :** సుశ్లోకుడు = మంచి పేరుగలవాడు

**వ్యాఖ్యానం :** దుర్జనుల లోతుపాతులు తెలిసికొనకుండ, సజ్జనుడు వారితో స్నేహం చేయకూడదు. అలా జరిగితే, దుర్జనులు సజ్జనుని ఎకసెక్కము లాడి గేలి చేసి అవమానిస్తారు. ఉదాహరణకు, కోకిల పొరపాటున

కాకుల గుంపును సమీపిస్తే, అవి దానిని ముక్కులతో పొడిచి, కాళ్ళతో తన్ని, శరీరాన్ని బాధపడేటట్లు చేసి, తరిమివేస్తాయి.

**Meaning:** A good man should never get familiar with strangers without knowing enough about them. They can ridicule him and make fun of him if they are evil men. Crows gather together to drive away the cuckoo, with their maddening cawing.

ridicule = ఎగతాళి, పరిహాసం

**Moral:** Keep evil people at a safe distance.



**99.** **స్థిరతర ధర్మవర్తన బ్రసిద్ధికి నెక్కిన వాని నొక్కము**
**ష్కరుడతినీచ వాక్యముల గాదని పల్కిన నమ్మహాత్ముడుం**
**గౌరత వహింప దయ్యెడ, నకుంఠిత పూర్ణ సుధా పయోధిలో**
**నరుగుచు గాకి రెట్ట యిడినందున నేమి కొరంత, భాస్కరా!**

**భావం :** సత్ప్రవర్తన గల్గి పేరు ప్రఖ్యాతులు సంపాదించిన పెద్ద మనిషిని, ఒక ముష్కరుడు నీచ వాక్యాలతో దూషించితే, ఆ మహాత్ముని గొప్పతనానికి లోటుగల్గదు. పూర్ణంగా వుండి అలలతో వుప్పొంగే, క్షీర సాగరంపైన ఒక కాకి రెట్ట వేసినంత మాత్రాన ఆ సముద్రం యొక్క ఘనత తగ్గిపోదు కదా. కుక్క అరచినంత మాత్రాన ఏనుగు విలువ తగ్గిపోతుందా!

**నీతి :** నీచుల మాటలు పట్టించుకోకూడదు.

**అర్థాలు :** సుధాపయోధి = పాల సముద్రం; ముష్కరుడు = చెడ్డవాడు

**Meaning:** A noble man with character earns name and fame. Even if an evil man were to hurl abuses at him, still his greatness will in no way be less. An ocean of milk does not become impure because of a single crow's dropping. It remains pure, with its billowing waves and remains the same mighty ocean.

Hurl = throw

Billows = rising waves

**Moral:** Never give importance to the words of a bad man.



**100.** **బలవంతుడు పై నెత్తిన**
**బలహీనుడు, ధనము గోలుపడిన యతడు, మ్రు**
**చ్చిల వేచువాడు, గామా**
**కుల చిత్తుడు నిద్రలేక కుందుదు రధిపా!**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** బలవంతునిచే దాడి చేయబడిన బలహీనుడు, ధనాన్ని పోగొట్టుకొన్న వాడు, దొంగతనం చేయాలని వేచియుండేవాడు, కామ వికారంతో మనస్సు వికలమైనవాడు, ఎప్పుడు ఏ ఆపద వస్తుందోనన్న భయంతో నిద్రలేకుండా దుఃఖిస్తూ వుంటారు.

**నీతి :** దురాలోచనాపరులకే నిద్ర రాదు.

**అర్థాలు :** మ్రుచ్చిలుట = దొంగిలించుట; పైనెత్తిన = మీదపడిన

**వ్యాఖ్యానం :** నిద్ర లేకుండ, ఎప్పుడు ఏడుస్తుండేవారిని గూర్చి యిచ్చట చెప్పబడింది. బలవంతునిచే దాడిచేయబడిన వానికి, ఎప్పుడు ఓడిపోతానో అని భయం పట్టుకొంటుంది. జూదంలోనో, గుర్రపు పందేలలోనో, ధనం పోగొట్టుకొన్నవాడు, తన బ్రదుకు ఏమౌతుందో అని దిగులుతో మునిగిపోతాడు. ఇంటికి కన్నం వేసి, దొంగతనం చేయాలని వేచియుండేవాడు, తనను ఎవ్వరు, ఎప్పుడు పట్టుకొని శిక్షిస్తారో అనే జంకుతో దిక్కులు చూస్తుంటాడు. ఒక స్త్రీపై వ్యామోహంతో, కామోద్రేకాన్ని అణచుకోలేనివాడు వికలమైన మనస్సుతో అలమటిస్తుంటాడు. వీరు నిద్రపట్టక, మనశ్శాంతి లేక ఏడుస్తుంటారు.

**Meaning:** A weak man opposed by a mighty man, a man who has lost all his wealth, a thief who waits to break into a house and a man blinded by passion can never hope to sleep peacefully, as they are always afraid of what may happen, and suffer deep anxiety.

**Moral:** Evil minded people can never enjoy sound sleep.



**101.** **ధనమును విద్యయు వంశం**
**బును దుర్మతులకు మదంబు పొనరించును స**
**జ్జనులైన వారి కడకువ**
**యును, వినయము నివియ తెచ్చు నుర్వీనాథా!**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** ధనం, విద్య, వంశం అనేవి దుర్మార్గులకు మదం కల్గిస్తాయి. అవే సన్మార్గుల విషయంలో అణకువ, వినయం కల్గిస్తాయి.

**నీతి :** పాలు త్రాగిన పాము విషం కక్కుతుంది. అదే పాలు త్రాగిన శునకం విశ్వాసం పెంచుకొంటుంది.

**వ్యాఖ్యానం :** మంచి వంశంలో జన్మించడం, విద్య నేర్వడం, ధనాన్ని ఆర్జించడం మనిషిలో మార్పు తెస్తాయి. దుర్జనుల విషయంలో అవి మదాన్ని, అహంకారాన్ని కల్గిస్తాయి. సజ్జనుల విషయంలో, అవి అణకువ, వినయం కల్గిస్తాయి.

**Meaning:** Wealth, scholarship and birth in a noble family make evil men proud and arrogant, while good men with the same advantages learn to be humble, and have no arrogance at all.

**Moral:** A snake drinks milk and spits out poison. A dog drinks milk and learns to be loyal and true to its master.



**102.** **ఆకాశంబుననుండి శంభుని శిరం బందుండి శీతాద్రి సు**
**శ్లోకంబైన హిమాద్రి నుండి భువి భూలోకంబునందుండి య**
**స్తోకాంభోధి పయోధి నుండి పవనాంధోలోకముం జేరె గం**
**గాకూలంకష పెక్కు భంగులు వివేక భ్రష్ట సంపాతముల్.**

**– భర్తృహరి**

**భావం :** భగీరథుడు తపస్సు చేసి ఆకాశగంగ భూలోకానికి వచ్చేటట్లు చేశాడు. గంగానది మొదట శివుని శిరస్సు మీద, తర్వాత హిమాలయ పర్వతం మీద, తదుపరి భూలోకం మీద, అటు పిమ్మట సముద్రంలోకి సముద్రం నుండి పాతాళలోకంలోకి పడిపోతుంది. అంటే ఉన్నత స్థానం ఒకతడవ కోల్పోయినవాడు, ఎన్నో విధాలుగా క్రిందికి జారిపోతూ చివరకు అధోగతి పాలైపోతాడు.

**నీతి :** కొండపై నుండి జారిన రాయి, ఎక్కడ పడి ఆగుతుందో తెలియదు.

**వ్యాఖ్యానం :** ఆకాశగంగ, పాతాళలోకానికి చేరిన పద్ధతిని గూర్చి యిచ్చట చెప్పబడింది. మొదట గంగానది ఆకాశంలో వుండేది. అది జారి శివుని జటాజూటంలో పడింది. అక్కడి నుండి జారి హిమాలయపర్వతం మీద పడింది. అందుండి జారి భూలోకానికి చేరుకొన్నది. అక్కడ నుండి సముద్రంలోకి చేరి పోయింది. అక్కడ నుండి పాతాళలోకంలోకి పడిపోయింది. ఇదే విధంగా, ఒక్కసారి ఉన్నతస్థానంలో పట్టుకోల్పోయిన వ్యక్తి ఎన్నో విధాలుగా క్రిందికి జారిపోయి చివరకు అట్టడుగు చేరుకొంటాడు.

**Meaning:** Bhagiratha performed severe penance and brought the Ganga from the sky to the earth. The holy river first descended to the locks of Lord Siva and then on to the Himalayas. From the Himalayan peaks the river flows down to the plains. Finally it joins the sea and moves on into the netherworld, Patala. Similarly, a man who has attained the highest peak of success loses it and slides down, descending till he finally disappears into oblivion.

Oblivion = state of being forgotten.

**Moral:** No one can predict where a stone rolling down the mountain side will come to a stop.



**103. సందు దొరికెనేని సడియు చప్పుడు లేక**
**మేతమేయువాడు నేతయగునె?**
**చేను మేయు కంచె సేమమ్ము నరయునా**
**వాస్తవమ్ము నార్ల వారి మాట!**

**భావం :** ఏ మాత్రం సందు దొరికినా, సడి చప్పుడు లేకుండ ప్రజాధనాన్ని మింగేవాడు నిజమైన నాయకుడు కాలేడు. చేనునే భక్షించే కంచె, చేను యొక్క క్షేమాన్ని గూర్చి ఆలోచించదు గదా!

**నీతి :** ప్రజాక్షేమం కోసం పనిచేసేవాడే నిజమైన నాయకుడు.

**వ్యాఖ్యానం :** ప్రజాధనాన్ని మింగేవారిని గూర్చి యిచ్చట చెప్పబడింది. ఏ విధంగా ప్రజాధనాన్ని మింగుదామా అని కొందరు కనిపెట్టుకొని వుంటారు. సందు దొరికితే చాలు సడి చప్పుడు లేకుండ ఆ ధనాన్ని వారు మేస్తారు. అటువంటి వారికి వారి స్వార్థమే కాని దేశ క్షేమం ముఖ్యం కాదు. అట్టి వారికి రాజ్యాధికారం ఇవ్వకూడదు.

**Meaning:** A man can never be a true leader of the people if he quietly embezzles public funds. A fence which grazes on a field it is supposed to protect, can never work for its welfare.

Embezzle = steal

**Moral:** A true leader works for the welfare of the people.



**104. స్వార్థమొకటె యేలు సర్వ జగత్తును**
**స్వార్థ ముడిగెనేని శాంతి గల్గు**
**కులము, మతము, భాష కుంటిసాకులు సుమా!**
**మనసు విప్పి వినుము మంచి మాట.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** ఈ ప్రపంచాన్ని నడిపేది స్వార్థం ఒక్కటే. కులం, మతం, భాష అనేవి తాత్కాలికమైన కుంటి సాకులు మాత్రమే. అందువల్ల స్వార్థాన్ని జయించగలిగితే కులం, మతం అడ్డురావు. లోకంలో శాంతి యేర్పడుతుంది.

**నీతి :** స్వార్థాన్ని విడిస్తే శాంతి లభిస్తుంది.

**వ్యాఖ్యానం :** స్వార్థానికి కులం, మతం, భాష అనేవి లేవు. అవి తాత్కాలికమైన కుంటి సాకులు మాత్రమే. ప్రపంచాన్ని నేడు పరిపాలిస్తున్నది స్వార్థమే. ఆ స్వార్థాన్ని జయించినప్పుడే ప్రపంచంలో శాంతి ఏర్పడుతుంది. అన్ని మతాలు బోధించిన ధర్మం యిదే.

**Meaning:** It is selfishness that makes the world go round. Differences on caste, religion and language all remain only weak excuses, to be used on and off. If selfishness can be conquered and erased, caste, religion or language will never come in the way of world peace.

Erase = remove

**Moral:** Erasing selfishness ensures peace.



**105.** **అధముడైన మనుజుడర్థవంతుండైన**
**అతని మాట నడచు నవనిలోన**
**గజపతి కొలువందు గవ్వలు చెల్లవా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** డబ్బున్నవాడు అధముడైనా వాని మాట నెగ్గుతుంది. రాజు ఇంటిలో గవ్వలు కూడ చెల్లుబాటు అవుతాయి కదా! ఇదీ లోకం తీరం.

**అర్థం :** గజపతి = రాజు

**నీతి :** సంపదలోనే గొప్పతనం ఉంటుంది. దాన్ని గమనించి నడుచుకోవాలి.

**Meaning:** An evil man, if he is rich, his word is writ everywhere. Even shells, have great value in a king's court. That is the way of the world.

**Moral:** There is great power in wealth knowing this, one has to conduct himself accordingly.



**106.** **ఎంత చదువు చదివి యెన్ని నేర్చినగాని**
**హీనుడవగుణంబు మానలేడు**
**బొగ్గు పాలగడుగ బోవునా మలినంబు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఎన్ని విద్యలు నేర్చినా, హీనుడైనవాడు దుర్గుణాన్ని వదులుకోడు. బొగ్గును పాలతో కడిగినంత మాత్రాన, దాని మాలిన్యం పోదు గదా.

**నీతి :** ఎన్ని విద్యలు నేర్చినా, అల్పుడు తన దుర్గుణాన్ని వదలడు.

**Meaning:** No amount of education can change an evil man to become good and noble. Cleaning coal with milk is of no use as it will remain black.

**Moral:** An evil man cannot change for the better, however much we may try.



**107.** **నీతిలేనివాని నిందింత్రు లోకులు**
**ఇతరగుణములవ్వియెట్టులున్న,**
**కాన మానవుండు పూనిక, నయవిద్య**
**గడనసేయ మొదల గడగవలయు.**

**– నీతిచంద్రిక**

**భావం :** తక్కిన గుణాల మాట ఎట్లున్నా, నీతిలేనివానిని లోకం తప్పక నిందిస్తుంది. అందువల్ల పట్టుదలతో మానవుడు నీతిమార్గంలో పయనించటం నేర్చుకోవాలి.

**నీతి :** అన్నింట్లోకి నీతి మార్గం గొప్పది.

**Meaning:** Whatever the qualities a man may have if he has no morals and ethics, the world is bound to criticize him. Thus a man should take the path of right conduct with determination, to win respect in society.

**Moral:** The best of all paths is that of the right and true.



**108.** **కొంచెపునరుసంగతిచే**
**అంచితముగ కీడు వచ్చు నది యెట్లన్నన్**
**కించిత్తు నల్లి కుట్టిన**
**మంచమునకు చేటు వచ్చు మహిలో సుమతీ.**

**భావం :** ఒక నల్లి చేరినందువల్ల మంచాన్ని వేడి నీళ్లతో కడగడం, కర్రతో కొట్టడం జరుగుతుంది. అలాగే ఒక అల్పుడు నీవు చేసే సత్కార్యంలో జేరితే ఆ సత్కార్యానికి భంగం కల్గుతుంది.

**నీతి :** ఇంత నిప్పురవ్వ చాలు, ఇల్లు తగలబెట్టడానికి.

**Meaning:** One bed bug alone can drive people to wash their cots with hot water. The beds are thoroughly beaten and shaken with sticks. If one evil man has a part to play in any good project, it is bound to fail.

**Moral:** One spark is enough to set fire to, and destroy a house.



**109.** **ఎప్పుడు దప్పులు వెదకెడు**
**అప్పురుషుని గొల్వ గూడదది యెట్లన్నన్**
**సర్పంబు పడగనీడను**
**గప్ప వసించిన విధంబు గదరా సుమతీ.**

**భావం :** ఎప్పుడును తప్పులు పట్టేవాని క్రింద పనిచేయడం, పాము పడగ నీడలో కప్ప నివసించినట్లుంటుంది. ఆ పాము ఏదో సాకు పెట్టి కప్పను మ్రింగవచ్చు. కాబట్టి అట్టివాని వద్ద కొలువు చేయగూడదు.

**నీతి :** పిల్లితో ఎలుక చెలగాట మాడగూడదు.

**Meaning:** Working with a man who is forever finding fault with one's service, is like a frog living in the shade of a cobras' hood. The snake is sure to find an excuse any moment to swallow the frog. One should never work under such a man.

**Moral:** Never play a cat and mouse game.



**110.** **దగ్గర కొండెము చెప్పెడు**
**ప్రెగ్గడపలుకులకు రాజు ప్రియుడై మరి తా**
**నెగ్గు ప్రజకాచరించుట**
**బొగ్గులకై కల్పతరువు బొడుచుట సుమతీ.**

**భావం :** రాజైనవాడు తన దగ్గర చేరి, కొండెములు చెప్పే మంత్రి మాటల్ని నమ్మి, తన ప్రజలకు కీడు చేయకూడదు. అట్లా కీడు చేయడం, కోరికలన్నింటిని తీర్చే కల్పవృక్షాన్ని బొగ్గుల కోసం కొట్టివేసినట్లవుతుంది.

**నీతి :** కొండెములు చెప్పేవాణ్ణి దగ్గరకు రానీయకూడదు.

**Meaning:** A king should never believe his minister who carries tales about his subjects to harm them. Such attitudes are like cutting down the sacred "Kalpataru" or the wishing tree to get coal.

**Moral:** Never allow a tale bearing mischievous person to come near and cause trouble.



**111.** **ఎడ్డె మనుష్యుడే మెరుగు నెన్ని దినంబులు కూడి యుండినన్**
**దొడ్డ గుణాఢ్యునందుగల తోరపు వర్తనలెల్ల, ప్రజ్ఞ బే**
**ర్వడ్డ వివేకరీతి, రుచిపాకము నాలుకగా కెరుంగునే**
**తెడ్డది కూరలో, గలయ ద్రిమ్మరు చుండిన నైన భాస్కరా!**

**భావం :** దొడ్డ గుణాలు కల్గిన మనుష్యుని వద్ద, ఎడ్డె మనుష్యుడెంతకాలం కూడి వుండినా, దొడ్డ గుణాలను పొందలేడు. వివేకం గలవాడే పొందగలడు. రుచితో కూడిన కూరలో, తెడ్డు ఎన్నిసార్లు తిరిగినా, అందలి రుచిని గ్రహించలేదు. నాలుక మాత్రమే గ్రహించగలదు.

**నీతి :** మూర్ఖుడు మంచివారితో ఎంతకాలమున్నా మంచిని గ్రహించలేడు.

**Meaning:** A stupid person can never imbibe great qualities, however long he lives, with a man who has great qualities. Only an intelligent man can benefit and learn from a great man. A wooden ladle will never know the taste of a dish, no matter however many times it is used to stir. It is only the tongue which can know the taste.

Imbibe = absorb, గ్రహించు

**Moral:** A stupid man can never learn good things from great people, however long he may have been in their company.



**112.** **అతి గుణహీన లోభికి, పదార్థము గల్గిన, లేక యుండినన్**
**మితముగగాని కల్మిగలమీదటనైన భుజింపడింపుగా**
**సతమని నమ్ము దేహమును సంపద, నేరులు నిండి పారినన్**
**గతుకగ జూచు గుక్క తన కట్టడ మీరక యెందు, భాస్కరా!**

**భావం :** తన వద్ద సంపద యెంతవున్నా, లోభియైనవాడు తృప్తిగా భోజనం చేయడు. తన దేహం, సంపద తన వద్ద స్థిరంగా వుంటాయని భావిస్తాడు. అతని బ్రదుకు ఎట్టిదంటే, ఏరు పొంగి పొరలి ప్రవహిస్తున్నా, నీళ్లను గతికి త్రాగే కుక్క బ్రదుకులాంటిది.

**నీతి :** ఏరు వరదై పారినా, కుక్కకు గతుకు నీళ్లేగతి.

**Meaning:** A hopeless miser can never enjoy a good meal, however much wealth he has. He believes that his body and wealth are going to remain with him forever. His life is so miserable, that his life is like that of a dog, which can only lap and drink water, even if there is a flood around him.

**Moral:** Even if a stream swells in flood, the fate of a dog is such, that it can only lap the water with its tongue.



**113. బలము గలవాని బలువురు బలవిహీను**
**లొక్కటై గూడి నిర్జింతురుత్సహించి**
**మధువుగొన నుత్సహించిన మనుజుబట్టి**
**కుట్టి నిర్జించు మధుకర కులమునట్లు**

**భావం :** ఇది ఐకమత్యాన్ని తెలిపే పద్యం. బలం కలిగిన వానిని అనేకమంది బలహీనులు ఐకమత్యంతో ఓడించగలరు. తేనె తీసుకోవాలని ప్రయత్నించిన మనిషిని తేనెటీగలు కుట్టి చంపుతాయి కదా!

**నీతి :** ఐకమత్యమే మహా బలం.

**అర్థాలు :** మధువు = తేనె; మధుకరకులము = తేనెటీగల గుంపు;

**వ్యాఖ్యానం :** ఈ పద్యం ఉపమాలంకారంలో చెప్పబడింది. మహాభారతంలో పాండవులు అరణ్యవాసం చేసే సందర్భంలో భీముడు ధర్మరాజుతో చెప్పిన మాటలివి. బలహీనులు కూడా ఐకమత్యంతో బలవంతుని జయించవచ్చు. కౌరవులు నూరు మంది ఉన్నా పాండవులం మనం ఐదుగురే అయినా ఐకమత్యంతో వారిని జయించగలం అనే ఆత్మవిశ్వాసాన్ని భీముడు ప్రకటించాడు.

**Meaning:** This Stanza is about the strength of unity. A strong man can be overcome and be defeated when many far weaker opponents stand together united to fight. Small bees can kill a man who tries to take away honey from their honeycomb, by stinging him to death.

**Moral:** There is great strength in unity.



**114.** **ఊరక సజ్జనుండొదిగి యుండినవైన దురాత్మకుండు ని**
**ష్కారణ మోర్వలేక, యపకారము చేయుట వాని విద్యగా**
**చీరలు నూరు టంకములు చేసెడివైనను బెట్టెనుండగా**
**చేరి చినింగిపో గొరుకు చిమ్మటకేమి ఫలంబు భాస్కరా!**

**భావం :** విలువగల వస్త్రాలు పెట్టెలో వుంటే, తనకేమి ప్రయోజనం లేకపోయినా, చిమట కొట్టేస్తుంది. అలాగే, నిష్కారణంగా సజ్జనునికి దుర్జనుడు అపకారం చేస్తాడు.

**నీతి :** కారణం లేకపోయినా పరులను హింసిస్తాడు దుర్జనుడు.

**Meaning:** Moths eat away precious silks, though carefully stored in a box. Similarly an evil man often harms a good man, for no valid reason at all.

**Moral:** An evil man often harms others though he has no reason to do so.



**115.** **తివిరి, యిసుమున దైలంబు దీయవచ్చు**
**దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చు**
**దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు**
**జేరి మూర్ఖుని మనసు రంజింపరాదు.**

**– భర్తృహరి**

**భావం :** ఇసుకను పిండి తైలాన్ని తీయవచ్చు. ఎండమావులలోని నీళ్ళను త్రాగవచ్చు. అన్ని చోట్ల తిరిగి, కుందేటి కొమ్మును తేవచ్చు. కాని మూర్ఖుని సంతోషపెట్టలేము.

**నీతి :** ఏమైనా సాధించవచ్చు. కాని మూర్ఖుని సంతోషపెట్టలేము.

**Meaning:** It is possible to squeeze oil from sand, drink water from a mirage, or search far and wide and bring a rabbits' horn, but it is impossible to please a stupid man.

**Moral:** Anything is possible except satisfying a foolish man.



**116.** **కోపము నుబ్బును గర్వము**
**నాపోవక యునికియును దురభిమానము ని**
**ర్వ్యాపారత్వము నను నివి**
**కాపురుష గుణంబు లండ్రు కౌరవనాథా!**

**– ఆంధ్రమహాభారతం**

**భావం :** ప్రతిదానికి కోపగించడం, అల్పసంతోషంతో పొంగిపోవడం, గర్వాన్ని ప్రదర్శించడం, దేనికిని తృప్తిచెందకుండడం, దురభిమానం చూపించడం, పనిపాట లేకుండ తిరగడం ఇవి దుష్టుని యొక్క లక్షణాలు.

**నీతి :** తుమ్మచెట్టుకు ముండ్లులాగా, దుర్మార్గునికి దుర్గుణాలుంటాయి.

**అర్థం :** ఆపోవకయునికి = తృప్తిలేక పోవడం

**Meaning:** The qualities of an unpleasant man of low character are, to lose his temper often, be wildly happy for minor things, be very proud, be dissatisfied all the time, be vain and arrogant and drifts around doing nothing of importance.

**Moral:** An evil man's bad qualities are like the thorns of a babul tree.



# 12. లోక స్వభావ పద్ధతి

**117. కుళ్ళుబోతునొద్ద గూడి మాటాడిన**
**గొప్ప మర్మములను జెప్పరాదు**
**పేరు తీరు దెల్ప నూరెల్ల ముట్టించు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** అసూయాపరునితో మాట్లాడేటప్పుడు, వ్యక్తిగతమైన రహస్యాలను చెప్పకూడదు. అతడా రహస్యాలను ఊరంతా చాటిస్తాడు. కాబట్టి నీవు ఎవరితో ఏమి మాట్లాడాలో ముందుగా ఆలోచించుకోవాలి.

**నీతి :** నీ వ్యక్తిగత రహస్యాలను, అసూయాపరులకు తెలియనీకు.

**వ్యాఖ్యానం :** సంసారం గుట్టు విప్పగూడదని యిచ్చట తెలియచేయబడింది. ప్రతి మనిషికి ఏవో రహస్యాలుంటాయి. అవి జన్మకు సంబంధించినవో, ధనం ఇచ్చి పుచ్చుకోవడానికి సంబంధించినవో, ప్రేమకు సంబంధించినవో, అయి వుండవచ్చు. వాటిని బైట పెడితే సంఘంలో నీ పరువు మర్యాదలకు భంగం కలుగవచ్చు. అటువంటి రహస్యాలను, అసూయాపరునికి నీవు చెప్పకూడదు. అతడు వాటిని, ఊరు, వాడకు తెలిసేటట్లు టాంటాం చేస్తాడు. నీవు తలయెత్తుకొని సంఘంలో తిరగకుండా చేస్తాడు.

**Meaning:** Never give away personal secrets to a man who is jealous. He is bound to spread these secrets to the whole town. One should always give careful thought to what should be spoken and to whom.

Envy=jealousy

**Moral:** Never reveal personal secrets to an envious man.



**118. చెప్పులోన రాయి, చెవిలోన జోరీగ**
**కంటిలోని నలుసు, కాలిముల్లు**
**ఇంటిలోని పోరు, నింతంత గాదయా!**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** చెప్పులో రాయి పడితే, చెవిలో జోరీగ దూరితే, కంట్లో నలుసు పడితే, కాలిలో ముల్లు గుచ్చుకొంటే ఎంత బాధ కలుగుతుందో ఇంట్లో పోరు అంత బాధ కల్గిస్తుంది. కాబట్టి ఇంట్లో పోరు జరుగకుండా జాగ్రత్త పడాలి.

**నీతి :** ఎట్టి పరిస్థితుల్లోను, యింట్లో తగవులు పెట్టుకోరాదు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ, ఇంటిపోరును భరించడం ఎంత కష్టమో చెప్పబడింది. ఇంటిలో పోరు అంటే సంసారంలో పోరు అని చెప్పుకోవాలి. పిల్లల పెంపకం, విద్య నేర్పించడం, వివాహాలు చెయ్యడం ఇట్టి విషయాల్లో ఇంటికి పెద్దలైన తల్లిదండ్రుల మధ్యనే పొరపొచ్చాలు రావచ్చు. ఇంటికి వచ్చిన కోడళ్లకు, అత్తమామలకు, ఒద్దిక, సామరస్యం వుండకపోవచ్చు. అన్నదమ్ముల మధ్య ఆస్తి పంపకంలో తగాదాలు రావచ్చు. ఇవి మొదట్లో చిన్నవిగా వుండి కాలం గడిచే కొలది పెద్దవై, యింట్లో చిచ్చు పెడతాయి. అమితమైన బాధ కల్గిస్తాయి. ఉదాహరణకు, చెప్పులో పడే రాయి చాల చిన్నది, చెవిలో దూరే జోరీగ కూడా చిన్నదే. కంట్లో పడే నలుసు కంటికి కనపడనంత చిన్నది. కాలిలో గుచ్చుకొనే ముల్లు కూడ స్వల్పమైనదే. కాని అవి కల్గించే బాధ అంతింతా కాదు. కాబట్టి యింట్లో ఎటువంటి పరిస్థితులలో కూడ, తగవులు రాకుండ జాగ్రత్త పడాలి.

**Meaning:** Quarrelling and squabbling in a home is troublesome, very like a stone in a shoe, a bee in the ear, a particle in the eye, and a thorn in the leg. These cause much pain and suffering. Care has always to be taken to have a happy home.

Squabbling = జగడమాడు

**Moral:** It is wise to never have quarrels in a home for it to remain a truly happy home.



**119. తల్లిదండ్రులందు దయలేని పుత్రుండు**
**పుట్టనేమి! వాడు గిట్టనేమి!**
**పుట్టలోన చెదలు పుట్టదా! గిట్టదా!**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** తల్లిదండ్రుల మీద దయ చూపించి సేవచేయని కుమారుడు పుట్టినా ఒక్కటే చచ్చినా ఒక్కటే. పుట్టలో చెదలు పుడుతుంది చచ్చిపోతుంది. దానినెవరు గమనించరు. కుమారుడు కూడ ఆ చెదల వంటి వాడే. ఇది సంస్కారహీనత్వాన్ని తెలియచేస్తుంది.

**నీతి :** తల్లిదండ్రులను ప్రేమించాలి. అలా చేయని వారు జీవించడం వ్యర్థం.

**వ్యాఖ్యానం :** ఇక్కడ తల్లిదండ్రులు, పిల్లల మధ్య వుండవలసిన ప్రేమను గూర్చి చెప్పబడింది. ఈ సృష్టిలో ఎన్నో జీవులు పుట్టి గిట్టుతూ వుంటాయి. ఆ జీవుల్ని కన్న జీవులు కొంత వయస్సు వచ్చేదాకా వాటిని ప్రేమతో పెంచి పోషించి వదలేస్తాయి. పిల్ల జీవులు తమంత తాము బ్రతకడం నేర్చుకొంటాయి. కాని తల్లితండ్రులను అవి మరచిపోతాయి. ఇది వాటి సహజ లక్షణం. మానవుడట్లా కాదు, తనను ప్రేమతో పెంచి పోషించిన తల్లిదండ్రులను తిరిగి ప్రేమిస్తాడు. ఇది మానవ లక్షణం. ఇట్లా ప్రేమించలేని పుత్రుడు గాని, పుత్రిక గాని, పశుపక్ష్యాదులతో సమానం. ఒక పుట్టలో పుట్టి, గిట్టుతున్న చెదలు పురుగులకు వారికి భేదం లేదు. ఇందువల్ల మానవత్వం పశుత్వానికి దిగజారినట్లౌతుంది.

**Meaning:** A son who does not take care of his parents in their old age is of no use. It makes no difference whether he is alive or dead. Termites are born in mounds of earth and die. No one is ever aware of them. A son who fails in his duty is like these termites.

**Moral:** One should love and care for his parents. One who does not do so lives a wasted life.



**120.** **పాలపిట్ట శకున ఫలమిచ్చునందురు;**
**పాలపిట్టకేమి ఫలము దెలియు?**
**తనదు మేలు కీళ్లు తనతోడ నుండగ**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** పాలపిట్టను చూడడం మంచి శకునం. అందువల్ల అదృష్టం లభిస్తుందని అంటారు. ఎవరి అదృష్టం వారి వద్ద వుంటుంది. కాని పాలపిట్టకు అదృష్టం గూర్చి ఏమి తెలుస్తుంది? విశ్వంలో జరిగే అనూహ్య సంఘటనల్ని అర్థం చేసుకోలేని కొందరు, ఇలా నమ్మకాలు ఏర్పరచుకొంటారు.

**నీతి :** శకునాలు కాదు, స్వయంకృషిని నమ్ముకోవాలి.

**వ్యాఖ్యానం :** శకునాలకు మనిషి అదృష్టానికి గల సంబంధమేమిటని యిక్కడ ప్రశ్నించడం జరిగింది. ఒక వ్యక్తి కార్యార్థమై బయలుదేరి బైటకు వెళ్తుంటే, దారిలో పాలపిట్ట కనిపించింది. అది మంచి శకునమని, అందువల్ల అతని పని సఫలమౌతుందని జ్యోతిష్కులు అన్నారు. ఇట్టి శకున ఫలాలు ఒకే దేశంలోనే ప్రాంతాన్ని బట్టి మారుతుంటాయి. కొన్ని దేశాలలో శకునాలు చూడడమే వుండదు. అయినా వారి పనులు నెరవేరుతున్నాయి. ఎవరికి జరిగే కీడు గాని, మేలు గాని వారి వారి కృషి మీద ఆధారపడి వుంటుంది కాని, శకునాల మీద కాదని అర్థం.

**Meaning:** It is considered a good omen to see a blue jay (a bird). People believe it brings them luck. Each one's luck is his own and the bird does not know anything about what people believe in. Those who are unable to understand certain happenings beyond their comprehension believe in these superstitions.

**Moral:** One should always depend on one's own ability and not in omens of luck or ill-luck.



**121.** **రామ నామ జపముచే మున్ను వాల్మీకి**
**పాపి బోయడయ్యు బాపడయ్యె!**
**కులము ఘనము గాదు గుణమే ఘనమ్ము రా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** వాల్మీకి పుట్టుకతో బోయవాడు. రామాయణ మహాకావ్యాన్ని రచించి, రామ నామ జపం వల్ల మహర్షి యైనాడు. కులం కంటే గుణం ప్రధానమైనదని నిరూపించాడు.

**నీతి :** కులం కంటె గుణమే ప్రధానం.

**వ్యాఖ్యానం :** కులం కాదు గుణం ప్రధానమని యిక్కడ చెప్పబడింది. హిందూ సంఘంలో పూర్వం వృత్తిపై ఆధారపడి కుల వ్యవస్థ ఏర్పడింది. వృత్తిని బట్టి ఒక వ్యక్తికి సమాజంలో గౌరవమివ్వడం జరిగేది. అది సరియైన పద్ధతి గాదని క్రింద ఉదాహరణ తెలియచేస్తుంది. శ్రీమద్రామాయణాన్ని సంస్కృతంలో రచించిన వాల్మీకి మహర్షి వృత్తిలో బోయవాడు. జంతువులను వేటాడి జీవించేవాడు. అతడు అరణ్యంలో మునీశ్వరుల ద్వారా జ్ఞానోదయాన్ని పొంది, తపస్సు చేసి, విద్యావిజ్ఞానాల నార్జించి రామాయణాన్ని కావ్యంగా రచించి, అత్యుత్తమమైన మహర్షి పదవిని పొందగలిగినాడు. కులం కంటె గుణం ఘనమైనదని నిరూపించాడు.

**Meaning:** The poet Valmiki was a tribal hunter. He was able to compose the great epic of the Ramayana, and with the chanting of the sacred name of Rama, he was transformed into a great sage. It is character which is far more relevant than caste. This is proved in his case.

**Moral:** Character is far more important than caste.



**122.** **నుతజలపూరితంబులగు నూతులు నూటిటికంటె సూనృత**
**వ్రత! యొక బావి మేలు మరి బావులు నూటిటికంటె నొక్క స**
**త్క్రతువది మేలు తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు త**
**త్సుత శతకంబు కంటె నొక సూనృత వాక్యము మేలు సూడగన్**

**భావం :** మంచి చేద బావులు తవ్వించటం కంటె నూరు దిగుడు బావులు తవ్వించడం మేలు. నూరు దిగుడు బావులు తవ్వించటం కంటే ఒక మంచి యజ్ఞం చేయటం మేలు. నూరు యజ్ఞాల కంటే ఒక మంచి పుత్రుడు కలగటం మేలు. మంచి పుత్రులు నూరుగురు కంటే ఒక సత్య వాక్యం మేలు.

**నీతి :** వందమంది సుపుత్రుల కంటే ఒక సత్యవాక్యం గొప్పది.

**అర్థాలు :** సూనృతవ్రత! = ఎల్లప్పుడూ సత్యాన్నే మాట్లాడుతాననే నియమం కలిగినవాడా!

**వ్యాఖ్యానం :** ఒకదాని తర్వాత మరొకదానికి ఉత్కర్ష చెప్తూ వర్ణిస్తే సారాలంకారం అవుతుంది. అంటే ఒకదాని కంటే మరొకటి గొప్ప అని చెప్పటమని అర్థం. ఈ పద్యం మహాభారతంలో శకుంతల దుష్యంతుల కథలోనిది. శకుంతలను దుష్యంతుడు గాంధర్వ వివాహం చేసుకొని ఒక కుమారుని జన్మకు కారకుడై ఆమెను ఎరుగనట్లు మాట్లాడుతాడు. అలాంటి అతనిని ఆమె సున్నృతవత! అని సంబోధించడంలో ఎత్తిపొడుపు ఉంది. సత్యం జ్యోతి లాంటిది, అది మనలను మన చుట్టూ ఉన్న వాళ్ళను అధర్మం అనే గోతిలో పడి నాశనం కాకుండా కాపాడి మేలు చేస్తుంది. ఏదైనా కొందరికి మేలు చేయగలదు కాని సత్యం మాత్రం అందరికి మేలు చేస్తుంది. అందుకే ఎల్లప్పుడూ అందరూ సత్యాన్నే పలకాలి.

**Meaning:** It is always better to dig one communal well instead of a hundred ordinary wells. It is better to perform one "Yagya" with sacrificial offering instead of digging a hundred communal wells. It is better to have one noble and a virtuous son than performing a hundred yagyas. One single statement of truth is even better than having a hundred noble sons.

Communal well = a large well with steps leading to the water used by the whole community.

**Moral:** A single statement of truth surpasses all good actions, prayers and even having a hundred noble sons.

Surpass = overtake



**123.** **ఔనటంచు నొక్కడాడిన మాటకు**
**కాదటంచు బలుక క్షణము పట్టు,**
**దాని నిలువదీయ ధాతయె దిగవలె**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఒకరు 'ఔను' అన్న మాటను 'కాదు' అనడానికి ఒక క్షణం పట్టుతుంది. కాని దానిని నిరూపించడానికి బ్రహ్మదేవుడు దిగిరావాలి. సత్యాన్ని నిరూపించడం ఎంత కష్టమో దీనివల్ల అర్థమౌతుంది.

**నీతి :** సత్య నిరూపణ కష్టం అయినా దాన్ని విడువకూడదు.

**వ్యాఖ్యానం :** ఒక సమస్య యెదురైతే, దాని పరిష్కారానికి విజ్ఞులైనవారు ఎన్నో పరిష్కారాలను సూచిస్తూ వాదాలు చేస్తుంటారు. ఒకరు 'ఔను' అన్నదానిని, ఇంకొకరు 'కాదు' అనడం చాలా సులభం. కాని దానిని అనుభవాలతో, సాక్ష్యాధారాలు జోడించి ఋజువు చేయడం చాలా కష్టం. ఉదాహరణకు, వరకట్నపు దురాచారాన్ని, చట్టాల ద్వారా నివారించగలమని ఒకరంటారు. కాదని వేరొకరంటారు. ఇంతవరకు ఆ విషయంలో చట్టాలు చేయబడ్డాయి. కాని సమస్యకు పరిష్కారం దొరకలేదు. పరస్పర వాదాలు మాత్రం జరగుతున్నాయి.

**Meaning:** It takes but a moment to say 'no' to what someone else says 'yes'. To prove that a statement is right or wrong the Lord Brahma himself has to come down to earth. From this it is understood how difficult it is to prove that something is true or otherwise.

**Moral:** Never give up the attempt to prove the truth, however difficult it may be to do so.



**124.** **ఆత్మశుద్ధిలేని యాచార మదియేల?**
**భాండశుద్ధిలేని పాక మేల?**
**చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఆత్మ పరిశుద్ధంగా లేకుండ ఆచారాన్ని పాటించడం నిష్ప్రయోజనం. శుభ్రంగా లేని కుండలో అన్నం వండడం ఆరోగ్యానికి హానికరం. మనసులో కల్మషం పెట్టుకొని చేసే దైవపూజ నిష్ఫలం. నిర్మల చిత్తం దైవత్వానికి ప్రతీక. కాబట్టి మానవులు అన్ని విషయాలలో చిత్తశుద్ధి కలిగి వుండాలి.

**నీతి :** భక్తికి చిత్తశుద్ధి ముఖ్యం.

**వ్యాఖ్యానం :** ఇక్కడ, మొక్కుబడిగా చేసే ఆచారాలను గూర్చి చెప్పబడింది. దైవ పూజలు, వ్రతాలు, వివాహం, జన్మదినం వంటి శుభకార్యాలలో సంప్రదాయంగా కొన్ని ఆచారాలను పాటిస్తుంటారు ప్రజలు. కాలక్రమేణ ఆ ఆచారాలు ఎందుకు ప్రారంభమైనాయో, వాటి ప్రయోజనమేమిటో వారికి తెలియకుండా పోతుంది. ఆత్మ శుద్ధి, చిత్తశుద్ధి కొరవడతాయి. మొక్కుబడిగా ఆచారాలు, ఇరుగుపొరుగువారి మెప్పుకోసం ఆచరిస్తుంటారు. ఇదే విధంగా, కుండ శుభ్రం లేకుంటే, అందులో వండిన అన్నం కలుషితమౌతుంది. అది ఆరోగ్యానికి హాని కల్గిస్తుంది. శుభ్రత లేదా శుద్ధి అనేది దైవత్వానికి ప్రతీక. అట్టి శుద్ధి లేకుండా ఆచరించే ఆచారం కాని, కార్యం కాని నిష్ఫలం.

**Meaning:** It is of no use if rituals and traditions are observed without sincerity. It is harmful to health if food is cooked in an unclean utensil. Prayers to the Lord Shiva are wasted if they are done with an impure heart. A pure heart is divine. So all human beings should take care to keep their mind and heart pure.

**Moral:** Faith in God has to come from a pure heart and mind.



**125.** **ఉప్పుకప్పురంబు నొక్క పోలికనుండు**
**చూడజూడ రుచుల జాడ వేరు;**
**పురుషులందు పుణ్య పురుషులు వేరయా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఉప్పు, కర్పూరం పైకి ఒకే విధంగా కన్పిస్తాయి. తరచి చూస్తే రుచులు వేరుగా వుంటాయి. అదే విధంగా పురుషుల్లో, పుణ్యం చేసుకొన్న పురుషులు వేరుగా వుంటారు. కాబట్టి పైపై వేషాలు చూచి, ఎవరు ఎటువంటి వారో తెలుసుకోవడం కష్టం.

**నీతి :** పుణ్య పురుషులను గుర్తించి వారిని ఆదర్శంగా తీసుకోవాలి.

**వ్యాఖ్యానం :** మంచివారిని గుర్తించడం ఎలాగో యిచ్చట చెప్పబడింది. లోకంలో అనేక విధాలైన మనుష్యులున్నారు. వారి రూపాలు ఒక్కటిగానే కన్పిస్తూ వుంటాయి. వారిలో మంచివారెవరో, వారి పుట్టు పూర్వోత్తరాలను, ప్రవర్తనను లోతుగా పరిశీలించినప్పుడే తెలుస్తుంది. ఉదాహరణకు ఉప్పు, కర్పూరం రెండు తెల్లగా ఒకే రంగులో వుంటాయి. రుచి చూచినప్పుడే ఏది వుప్పో, ఏది కర్పూరమో తెలుస్తుంది. కాబట్టి మంచి, చెడ్డలను విడమరిచి చెప్పడానికి లోతైన పరిశీలన అవసరం.

**Meaning:** Salt and camphor look alike. When examined closely, their tastes differ. In the same manner, good, pious people are different from others. It is very difficult to recognize who is good and who is not, by their outward appearances.

**Moral:** Pious people have to be identified and they should be the role models to all.



**126. బంధుజనులజూడు, బాధల సమయాన,**
**భయమువేళ జూడు, బంటుతనము,**
**పేదపడ్డ వెనుక, పెండ్లాము మతి జూడు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** నీవు బాధల్లో వున్నప్పుడు ఆదుకొన్నవాడే నిజమైన బంధువు. నీవు కష్టాలనెదుర్కోలేక, భయంతో వున్నప్పుడు నీకు తోడుగా వుండి సేవలు చేయువాడే నిజమైన బంటు. నీవు ఆర్థికంగా చితికిపోయి, సంసార భారాన్ని మోయలేక అవస్థపడుతున్న వేళ, నిన్ను ప్రేమతో చూచునదే నిజమైన ఇల్లాలు.

**నీతి :** ఆపదలు వచ్చినప్పుడే ఆప్తులెవరో తెలుస్తారు.

**వ్యాఖ్యానం :** నిజమైన ఆత్మీయుల్ని ఎలా గుర్తించాలో ఇచ్చట చెప్పబడింది. ప్రతి వారికి బంధువులుంటారు. సేవకులు ఉంటారు. కుటుంబం ఉంటుంది. నిజమైన బంధువులెవరో, విశ్వాసం గల సేవకులెవరో, ప్రేమ గల కుటుంబ సభ్యులెవరో తాను ఆపదలో వున్నప్పుడే ఆ వ్యక్తికి తెలుస్తుంది. ఒక మనిషి నష్టాలపాలై బాధలో వున్నప్పుడు, అతనికి తోడుగా నిల్చి సానుభూతి చూపి, కాపాడేవాడే నిజమైన బంధువు. ఇంట్లో కాని బైట గాని దొంగల వల్ల, ప్రమాదాల వల్ల మనిషికి భయం కల్గినప్పుడు అతని ముందు నిల్చి, తన ప్రాణాలను సైతం వొడ్డి రక్షణ కల్పించేవాడే విశ్వాసపాత్రుడైన సేవకుడు. మనిషి ఆర్థికంగా చితికిపోయి, సంసార భారం మోయలేక అవస్థలు పడుతున్న సమయంలో, కష్టాలను పంచుకోవడానికి సిద్ధమై, నీడలాగా వెన్నంటి యుండే భార్య మాత్రమే నిజమైన అర్ధాంగి.

**Meaning:** A true relative is one who comes to help, when one is in trouble. A true servant is one who stays with one, in times of fear or trouble. He supports and serves in both bad times and good times. A truly good wife is one who supports and loves her husband even when his wealth is gone and finds life very difficult to bear.

**Moral:** Only when one is deep in trouble, does a man realize who his true well wishers are?



**127.** **ఇనుము విరిగెనేని యిమ్మారు ముమ్మారు**
**కాచి యతుకనేర్చు కమ్మరీడు**
**మనసు విరిగెనేని మరియంట నేర్చునా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఇనుము విరిగితే కొలిమిలో కాచి రెండు మూడు పర్యాయాలు ప్రయత్నించి అతుకవచ్చు. మనసు విరిగితే ఎంత ప్రయత్నించినా అతుకు వేయడం సాధ్యమవుతుందా? కాబట్టి యితరుల మనస్సును నొప్పించే పనులు చేయకూడదు.

**నీతి :** మనసు విరిగితే అతుక్కోదు, కావున ఇతరులతో సున్నితంగా మెలగాలి.

**వ్యాఖ్యానం :** మనస్సు గతిని గూర్చి యిక్కడ తెలియచేయబడింది. పల్లెటూళ్ళలో వ్యవసాయపు పనిముట్లైన నాగేలుకు ఎడ్ల బండికి ఇనుప సామాను వాడుతారు. ఇనుము విరిగినపుడు కమ్మరి కొలిమిలో దానిని కాల్చి అతికిస్తాడు. ఇద్దరు వ్యక్తుల మధ్య విభేదాలు వచ్చి, కఠినోక్తులతో ఒకరినొకరు నిందించుకొంటే మనస్సులు విరిగిపోతాయి. ఆ మనస్సులను అతికించడం సాధ్యం కాదు.

**Meaning:** If an iron article is broken, the blacksmith heats it and mends it after two or three attempts. But if a heart breaks it is impossible to mend it. So, one has to be careful not to do things which can hurt or harm others.

mend = బాగు చేయు, మరమ్మత్తు చేయు

**Moral:** Move carefully with others, never hurting them, as a broken heart can never mend.



**128.** **తప్పులెన్నువారు తండోపతండంబు**
**లుర్వి జనులకెల్ల నుండుతప్పు**
**తప్పులెన్నువారు తమ తప్పు లెరుగరు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** తప్పులు పట్టేవారు లోకంలో కొల్లలుగా వుంటారు. ప్రపంచంలో అందరికి తప్పులుంటాయి. తప్పులు పట్టేవారు తమ తప్పుల్ని తెలిసికోరు. కాబట్టి, యితరుల తప్పులు పట్టడం మంచి పని కాదు.

**నీతి :** ఎవరి తప్పును వారే తెలుసుకోవాలి.

**వ్యాఖ్యానం :** ఒకరిని తప్పుపట్టేముందు, తన తప్పును తెలుసుకోవాలని యిక్కడ చెప్పబడింది. ఒక వ్యక్తిపై మరొక వ్యక్తి, ఒక సంస్థపై మరొక సంస్థ, ఒక ప్రభుత్వం పై మరొక ప్రభుత్వం, ఒక దేశంపై మరొక దేశం తప్పులు పడుతుంటారు. తప్పులు లేని వారీ ప్రపంచంలోనే లేరు. తప్పులు పట్టుకొనేవారు తమ తప్పుల్ని గుర్తించలేరు. అందువల్లనే, యీనాడు ప్రపంచమంతట వివాదాలు చెలరేగి అశాంతి నెలకొన్నది. ఉదాహరణకు ప్రతి దేశంలోను ప్రభుత్వ పక్షం, ప్రతి పక్షం వుంటాయి. ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకోవడమే పనిగా వారు ప్రవర్తించడం మనము చూస్తున్నాం. ఎదుటివాని తప్పు చూపించడానికి, ఒక వ్రేలిని ముందుకు చాపితే, మూడు వ్రేళ్లు మనవైపు చూపిస్తుంటాయి. ఒకరిని తప్పు పట్టేముందు, మనమిది గుర్తుంచుకోవాలి.

**Meaning:** There are many people in the world who can find fault with others. There is no man without a flaw. Those who criticize are unaware of their own shortcomings. Hence it is not wise to find fault with others.

**Moral:** One should first know one's own faults before pointing a finger at others.



**129.** **నీళ్ళలోన మొసలి, నిగిడి యేనుగుబట్టు**
**బైట కుక్క చేత భంగపడును,**
**స్థానబల్మికాని తనబల్మి కాదయా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మొసలి, నీళ్ళల్లో వున్నప్పుడు పెద్ద యేనుగును సునాయాసంగా పట్టుకోగలదు. అదే నీళ్ళ బయట వుంటే, కుక్క చేతిలో భంగపడి పోతుంది. అది మొసలి యొక్క అసలు బలం కాదు, స్థానబలం మాత్రమే. కాబట్టి, ఎవ్వరును తమ స్థానబలాన్ని పోగొట్టుకోకూడదు.

**నీతి :** స్థానబలాన్ని బట్టి నడుచుకోవాలి.

**వ్యాఖ్యానం :** ఇక్కడ, స్థానబలాన్ని గూర్చి చెప్పడం జరిగింది. మొసలి, నీళ్లలో వున్నప్పుడు ఏనుగును పట్టుకోగలదు. బైట వున్నప్పుడు, కుక్క చేతిలో ఓడిపోతుంది. ఇది మొసలి యొక్క స్థానబలమే కాని నిజమైన బలం కాదు. దేశంలో మనం నాయకుల్ని చూస్తున్నాం. వారికి స్వస్థానంలో ఆస్తులుంటాయి. బంధువులు సహచరులు, స్నేహితులు వుంటారు. వారి అండదండలతో వారు సమాజంలోను, ప్రభుత్వం లోను, అధికార పదవులకు ఎన్నిక అవుతారు. వేరొక స్థానానికి వెళ్ళినప్పుడు, అచ్చట వారికి అట్టి గుర్తింపు వుండదు.

**Meaning:** A crocodile can attack an elephant easily when it is in water. The same crocodile can be easily overcome by a dog when it is on land. The strength of a crocodile is effective only in its natural home ground, that is water. Man has to learn that his greatest advantage in a situation is, when he fights from his familiar home ground.

**Moral:** One's strength is far greater on one's own home ground. A person should be careful outside his familiar surroundings. His weakness lies in his being an outsider.



**130.** **వెన్న చేతబట్టి వివరంబు తెలియక**
**ఘృతము కోరునట్టి యతని భంగి**
**తాను దైవమయ్యు దైవంబు దలచును,**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** వెన్న కరిగిస్తే నెయ్యి అవుతుంది. అది తెలియక వెన్న చేత పట్టుకొని నెయ్యి కోసం వెదకడం అజ్ఞానమవుతుంది. తానే దైవమైన మానవుడు దైవం కోసం వెదకడం కూడా అజ్ఞానమే.

**నీతి :** కళ్లు విశ్వాన్నంతగా చూడగలవు, కాని తమను తాము చూచుకోలేవు. అలాగే మానవుడు తనలో ఉన్న దైవాన్ని చూడలేకున్నాడు. అంటే ప్రతిమనిషిలోను దైవం ఉన్నాడని అర్థం.

**వ్యాఖ్యానం :** ఇక్కడ 'అహం బ్రహ్మోస్మి' అంటే 'నేనే దేవుణ్ణి' అనే సూక్తికి అర్థం తెలుసుకోమని చెప్పబడింది. జీవుడే దైవమని ఆధ్యాత్మిక వేత్తలు చెప్తారు. ఐనప్పటికి, దానిని గుర్తించలేని మానవుడు దైవం కోసం, దేవాలయాలలో, పుణ్యక్షేత్రాలలో వెదకుతుంటాడు. తన చేతిలోని వెన్న కరిగిస్తే అందులో నుంచే నెయ్యి వస్తుందన్న విషయం తెలియక, నెయ్యి కోసం వెదికే మనిషి అజ్ఞానాన్ని యిది తెలియచేస్తుంది.

**Meaning:** When butter melts, it becomes ghee. When one is ignorant of that fact, even when he has butter with him, he searches for ghee. Similarly, man himself being divine, it is only sheer ignorance that he searches for God elsewhere.

**Moral:** Eyes can see the whole world. But they cannot see themselves. A man is unable to see the divinity within himself. There is God in every human being.



**131.** **ధర్మజ్ఞులైన పురుషులు**
**ధర్మవునకు బాధసేయు ధర్మవునైనన్**
**ధర్మముగా మదిదలపరు**
**ధర్మవు సర్వంబునకు హితంబుగ వలయున్.**

**భావం :** ధర్మస్వరూపం తెలిసిన జ్ఞానులు ధర్మానికి ఏ మాత్రం కీడు కలిగించే పనినైనా ధర్మంగా భావించరు. అసలు ధర్మం అంటే అది లోకంలో అందరికీ మేలు చేకూర్చేదిగా ఉండాలి.

**నీతి :** ధర్మం అనేది అందరికీ సమానంగా మేలు చేకూర్చేదిగా ఉంటుంది.

**అర్థాలు :** ధర్మజ్ఞులు = ధర్మం తెలిసినవారు; హితంబుగా = మేలు చేకూర్చేదిగా; విప్రతిపత్తి = అభిప్రాయభేదం

**వ్యాఖ్యానం :** మహాభారతంలో ధర్మ స్వరూపాన్ని తెలిపే సందర్భాలు అనేకం ఉన్నాయి. అందులోను ధర్మ సూక్ష్మం తెలిపే పద్యమిది. ఈ పద్యం శిబి చక్రవర్తి కథకు సంబంధించినది. ధర్మం, పరమధర్మం అనే ఈ రెండింటికీ విప్రతిపత్తి కలిగినపుడు ధర్మనిర్ణయం ఎలా చేయాలి అంటే ఒక ధర్మానికి హాని కలిగించే మరొక

ధర్మం విశ్వజనీనం కాదు. శిబి చక్రవర్తి శరణార్థి అయిన పావురాన్ని కాపాడితే డేగ, దాని కుటుంబం అంతా ఆకలితో చావవలసి వస్తుంది. అందుకని శరణార్థిని కాపాడడం ధర్మమే కాని ఆ ధర్మాచరణలో ఇంకొకరికి హాని జరుగకూడదు. అందరికీ మేలు కలిగించేదే పరమ ధర్మం అని డేగ శిబిచక్రవర్తితో ధర్మ సూక్ష్మాన్ని గురించి చెప్తుంది. శిబిచక్రవర్తి కథ ప్రసిద్ధమైనదే. అహింసో పరమధర్మః, పరోపకారార్థమిదం శరీరం అనే సూక్తులతో పాటు అందరికి మేలు చేకూర్చేదే పరమ ధర్మమనే ధర్మసూక్ష్మం ఈ పద్యం ద్వారా తెలుస్తుంది.

**Meaning:** Learned men who are well-versed in the rules of righteous living, will not consider any act as just and good, if it causes the slightest harm or pain to anyone. What is considered as right and good has to offer justice to all.

విప్రతిపత్తి = అభిప్రాయభేదం

**Moral:** True justice causes no harm to anyone and is fair and equal to all.



**132. మేడిపండు జూడ మేలిమై యుండును**
**పొట్ట విచ్చి చూడ పురుగు లుండు**
**పిరికి వాని మదిని బింక మీ లాగురా,**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** అత్తిపండు పైన చూస్తే నిగ నిగ మెరుస్తూ వుంటుంది. దాని పొట్ట విప్పి చూస్తే పురుగులు కన్పిస్తాయి. పిరికివాడు పైకి ఎంతో బింకంగా కన్పిస్తాడు. కాని వాని గుండె దడదడ కొట్టుకుంటూ వుంటుంది. అట్టి వారిని గుర్తించి జాగ్రత్తగా మసలుకోవాలి.

**నీతి :** మెరిసేదంతా బంగారం కాదు. పై మెరుగులు చూచి మోసపోకూడదు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ పైకి బింకాలు పలికే పిరికివాళ్లను గూర్చి చెప్పబడింది. అత్తి పండుపైన చూస్తే నిగనిగలాడుతూ, మెరుస్తూ వుంటుంది. దాని పొట్ట విప్పి చూస్తే అసహ్యంగా వుండే పురుగులు కన్పిస్తాయి. అదే విధంగా పైకి డంబాలు పలికే కపట వేషధారులు పిరికివారై వుంటారు. సమయం వచ్చినపుడు, సమస్యలను ఎదుర్కోలేక పారిపోతారు. ఉదాహరణకు, మహాభారతంలో విరాటరాజు యొక్క గోవులమందను బలవంతంగా తోలుకొనిపోవడానికి వచ్చిన కౌరవులను, ఎదుర్కొనగలనని ఉత్తర కుమారుడు ప్రతిజ్ఞ చేస్తాడు. బృహన్నల వేషంలో వున్న అర్జునుణ్ణి రథసారథిగా చేసుకొని యుద్ధ రంగానికి వెళ్తాడు. అక్కడ కౌరవ సైన్యాన్ని చూచి భయపడి, రథం దూకి పారిపోతాడు. అర్జునుడు నిజ వేషం ధరించి యుద్ధంలో గెలుస్తాడు.

**Meaning:** The fruit of the fig tree has a beautiful bloom on the outer side. When the fruit is opened it is full of worms. A coward appears brave outwardly. But in his heart he may be shivering with fright. One has to deal with them with care.

**Moral:** All that shines is not gold. Never get carried away by outward glow and appearances.



**133. అధరము కదలియు గదలక**
**మధురములగు మాటలుడిగి, మౌనవ్రతుడౌ**
**నధికారరోగపూరిత**
**బధిరాంధకశవము జూడ బాపము సుమతీ.**

**భావం :** కార్యార్థులై సామాన్య ప్రజలు తనను దర్శించడానికి వచ్చినప్పుడు అధికార గర్వంతో చెవులున్నా వినకుండ, కండ్లున్నా చూడకుండ వుండే అధికారిని ఒక పాపిగా భావించాలి. అట్టి వారు అధికారులు కాకుండా చూడాలి.

**నీతి :** అధికార గర్వాంధుడు కళ్ళున్నా చూడలేడు. చెవులున్నా వినలేడు.

**అర్థాలు :** అధరము = పెదవి; బధిరాంధకవశము = చెవుడు, గ్రుడ్డితనము గల పీనుగు

**వ్యాఖ్యానం :** రాజ్యపాలనలో అధికారుల పాత్రను గూర్చి యిక్కడ తెలియచేయబడింది. ప్రజలను రంజింపచేయువాడు రాజు. రాజు తన బాధ్యతలను క్రింది అధికారులకు ఒప్పచెప్పుతాడు. ఆ అధికారులు సత్ప్రవర్తన కలవారైతే, ప్రజాజీవనం సుఖమయంగా వుంటుంది. అధికారులకు గర్వంతో కళ్లు మూసుకుపోతే, ప్రజలు వేధింపులకు గురి అవుతారు. గర్వాంధుడైన అధికారి ఎలా ప్రవర్తిస్తాడో యిక్కడ చెప్పబడింది. ప్రజలు తమ గోడు వినిపించుకోడానికి పోతే, అతడు వారిని సరిగా చూడడు. వినిపించుకోడు. పెదవి విప్పి ఒక మాట మాట్లాడడు. కళ్లున్నా చూడలేని, చెవులున్నా వినలేని, చైతన్యం లేని శవంలాగా ప్రవర్తిస్తాడు. అటువంటి అధికారిని చూడడం పాపమంటున్నాడు కవి. అట్టి అధికారులకు రాజ్యంలోస్థానం లేకుండ చేయడం మన కర్తవ్యం.

**Meaning:** Common people approach a powerful official and go to him with their complaints and requests. If he remains deaf to what they say, and remains silent, he is full of arrogance and pride. He should be regarded as a sinner. Such people should never be entrusted with power.

**Moral:** A man, who is blinded with his power and pride, can neither see nor hear.



**134. అప్పిచ్చువాడు, వైద్యుడు,**
**నెప్పుడు నెడతెగక పారు నేరును, ద్విజుడున్**
**చొప్పడిన యూర నుండుము,**
**చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ.**

**భావం :** అవసరమైనప్పుడు అప్పిచ్చే వ్యాపారి, వ్యాధికి చికిత్స చేసే వైద్యుడు, వివాహాది కార్యాలు జరిపించే పురోహితుడు వున్నట్టి గ్రామంలో నివాస మేర్పరుచుకోవాలి. ఆ వసతులు లేని చోటికి పోరాదు.

**నీతి :** అవసరానికి తగిన వసతులు లేనిచోట నివసించడం మంచిదికాదు.

**అర్థాలు :** ద్విజుడు = బ్రాహ్మణుడు

**వ్యాఖ్యానం :** నివాసయోగ్యమైన గ్రామాన్ని ఎలా ఎంచుకోవాలో యిక్కడ వివరించబడింది. అవసరానికి అప్పిచ్చే సంస్థ వుండాలి. అప్పుడే స్వల్పాదాయం వున్న వారు సరియైన ఉపాధిని ఏర్పాటు చేసుకోగలుగుతారు. ప్రతి చిన్న జబ్బుకు పట్టణాలకు వెళ్లడం వ్యయ ప్రయాసలతో కూడినపని. అంతేకాక సమయం వ్యర్థమౌతుంది. కాబట్టి వైద్య సదుపాయాలు అందుబాటులో వుండాలి. త్రాగు నీరు లేకుండ జీవనం గడవదు. అందువల్ల మంచినీటిని అందించే జీవనది ప్రక్కనే ప్రవహిస్తుండాలి. ప్రతి బాలుడు, బాలిక విద్య నేర్చుకోవాలి. అప్పుడే వారు సంఘంలో సముచిత స్థానాన్ని పొందగలరు. కాబట్టి పాఠశాల స్థాపించబడి వుండాలి. ఇన్ని వసతులున్న చోటనే నివాసం ఏర్పాటు చేసుకోవాలి. ఇవి లేని చోటికి పోకూడదు.

**Meaning:** People should choose to reside in a town which has a pawnbroker from whom one can borrow money, a doctor who can treat in case of ill-health, and a priest who can conduct religious rites. Never stay in a place which does not offer these facilities.

**Moral:** A place is worth living in only if it offers safeguards for help in dire necessity.

dire = చాలా అవసరమైన



**135. ఉపకారికి నుపకారము**
**విపరీతము గాదు సేయ వివరింపంగా**
**నపకారికి నుపకారము**
**నెపమెన్నక చేయువాడు నేర్పరి సుమతీ.**

**భావం :** తనకు ఉపకారం చేసిన వారికి తిరిగి ఉపకారం చేయడం మామూలే. తనకు అపకారం చేసిన వారికి ఎటువంటి నెపం చూపకుండ ఉపకారం చేయడంలోనే వివేకం వుంది. ఇందువల్ల అపకారం చేసినవాడు పశ్చాత్తాపపడి, నీకు దగ్గరౌతాడు.

**నీతి :** శత్రుత్వాన్ని ప్రేమతో జయించాలి.

**వ్యాఖ్యానం :** ఇక్కడ పరోపకారం వల్ల ప్రయోజనమేమిటో తెలియచేయబడింది. ఉపకారం చేసినవారికి ఉపకారం చేయడం కృతజ్ఞతను చాటడమే. అది సామాన్య విషయం. అపకారం చేసిన వారికి ఉపకారం చేయడం విశేషం. అందువల్ల అపకారం చేసిన వాని హృదయం నుండి శత్రుత్వాన్ని దూరం చేసినట్లవుతుంది. అతడు పశ్చాత్తాపపడి మిత్రుడౌతాడు. మిత్రుత్వం వల్ల మనఃశాంతి వస్తుంది. ఇందువల్ల కలతలు లేని సమాజం ఏర్పడుతుంది.

**Meaning:** There is nothing strange about a person helping in return, his benefactor. What is unusual is, a person helping a man who has done him harm. It is wise to help a

person who has harmed him earlier so that he may repent. He is sure to draw closer with no enmity in his heart.

Benefactor = one who does good; Repent = feel sorry for having done something wrong; Hostility = enmity

**Moral:** Conquer enmity with love.



**136.** **ఎప్పటి కెయ్యది ప్రస్తుత**
**మప్పటికా మాటలాడి యన్యుల మనముల్**
**నొప్పింపక తా నొవ్వక**
**తప్పించుక తిరుగువాడె ధన్యుడు సుమతీ.**

**భావం :** ఏ సమయంలో ఏ మాటలు చెప్పాలో ఆ మాటలు చెప్తూ, తనకు గాని, యితరులకు గాని, నొప్పి తగలకుండా ప్రవర్తిస్తూ, సమస్యలలో పడకుండా తప్పించుకొని తిరిగే వ్యక్తి నిజంగా ధన్యుడు.

**నీతి :** సమయానుకూలంగా మాట్లాడటం అలవర్చుకోవాలి.

**వ్యాఖ్యానం :** పుర్రెకొక బుద్ధి, జిహ్వాకొక మాట అంటారు పెద్దలు. లోకం భిన్న రుచులు గలది. అందువల్ల భిన్న వర్గాల మధ్య, వ్యక్తుల మధ్య చిన్న చిన్న గొడవలు, జగడాలు ప్రతి చోట జరగడం మనం చూస్తున్నాం. కొట్లాడుకొనే ఇరువర్గాలలో ఎవరికేది ప్రస్తుతమో ఆ మాటలే మాట్లాడి, వారి మనస్సు నొవ్వకుండ, తాను నొవ్వకుండ ప్రవర్తించాలి. ఈ పద్ధతినే లౌక్యం అని కూడా అంటారు.

**Meaning:** One who is able to speak pleasantly and tactfully at any given time to suit the situation, and does not cause hurt to himself or others, is always able to avoid unpleasantness. He is a truly blessed man.

**Moral:** Practice speaking correctly and tactfully.



**137.** **ఎప్పుడు సంపద గలిగిన**
**నప్పుడు బంధువులు వత్తు, రది యెట్లన్నన్**
**దెప్పలుగ చెరువు నిండిన**
**గప్పలు పదివేలు చేరు గదరా సుమతీ.**

**భావం :** చెరువు నీళ్లతో నిండినప్పుడు కప్పల గుంపులు పరుగెత్తుకొనివచ్చి అందులో చేరిపోతాయి. అదే విధంగా, నీ యింట్లో సంపద చేరిన విషయం తెలిసిన వెంటనే, బంధువులు నీ యింటికి చెప్పకుండ వస్తారు కాబట్టి నిజమైన బంధువులెవరో గుర్తించి వారిని ఆహ్వానించాలి.

**నీతి :** సంపన్నులకు అందరు చుట్టాలే.

**వ్యాఖ్యానం :** ఈనాడు లోకంలో ప్రేమానుబంధాలకంటే, ధనానుబంధాలు పై చేయిగా వున్నాయని యిక్కడ చెప్పబడింది. ఎంత దగ్గరివాడైనా ధనం లేని వాని యింటికి చుట్టాలు వెళ్లరు. ధనం కూడిందని తెలిసిన వెంటనే చెప్పకుండ అతని యింటికి వెళ్లి బంధుత్వం కలుపుకొంటారు. అది లోకనైజం. ఉదాహరణకు ఒక చెరువు ఎండిపోయి వున్నప్పుడు ఒక్క కప్ప కూడ అక్కడికి చేరదు. చెరువు నీళ్లతో నిండిందని తెలియగానే, కప్పలు కుప్పలుగా వచ్చి చేరుతాయి. సంపద చూచి వచ్చే చుట్టాలు కూడ కప్పలవంటివారే.

**Meaning:** Frogs crowd in large numbers to a full lake. Similarly, when it is known that someone has acquired wealth, relatives rush to his house even without invitation. Hence one should identify relatives who are true well wishers and those who are not.

**Moral:** Everyone claims to be connected to a wealthy man.



**138.** **కనకపు సింహాసనమున**
**శునకము గూర్చుండ బెట్టి శుభలగ్నమునం**
**దొనరగ బట్టము గట్టిన**
**వెనుకటి గుణమేల మాను, వినురా సుమతీ.**

**భావం :** ఒక కుక్కను బంగారు సింహాసనం మీద కూర్చుండబెట్టి, పట్టాభిషేకం జరిపి, రాజ్యాధికారం అప్పగిస్తే, ఆ కుక్క తన వెనకటి గుణాలను మానుకొంటుందా? కాబట్టి, అనర్హుణ్ణి అధికార పీఠంపై కూర్చోబెట్టకూడదు.

**నీతి :** అనర్హునికి అధికారమివ్వకూడదు.

**అర్థాలు :** ఒనరగ = తగిన రీతిగా

**వ్యాఖ్యానం :** అనర్హుడికి అధికారం ఇస్తే ఏమౌతుందో యిందులో చెప్పబడింది. కుక్క మాంసం రుచి మరిగి, చర్మంతో చేసిన చెప్పును గూడ వదలిపెట్టకుండ తింటుంది. అటువంటి కుక్కను బంగారు సింహాసనం మీద కూర్చుండబెట్టితే, అక్కడ దానికి దిక్కుతోచదు. అది క్రిందికి దూకి అక్కడ వున్న సందర్శకుల చెప్పుల్ని కొరికి తినడానికి ప్రయత్నిస్తుంది. అదే విధంగా సత్ప్రవర్తన లేని, అల్పునికి అధికారపదవి యిచ్చి, అందలం ఎక్కిస్తే, అతడు నడమంత్రపు అధికారంతో అక్రమార్జనకు పాల్పడతాడు. అంటే తన దుష్ప్రవర్తన వైపు మొగ్గు చూపుతాడు.

**Meaning:** If a dog is crowned, made to sit on the throne and given the power to rule, can it forget its earlier habits natural to a dog? Thus a person, who does not deserve the honour, should never be placed in a position of power.

**Moral:** An undeserving person should never be given power.



**139.** **కులకాంత తోడ నెప్పుడు**
**కలహింపకు, వట్టి తప్పు ఘటియింపకుమీ**
**కలకంఠికంటకన్నీ**
**రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ.**

**భావం :** ధర్మబద్ధంగా వివాహమాడిన యిల్లాలుతో ఎప్పుడూ కలహం పెట్టుకోకూడదు. లేనిపోని తప్పుల్ని ఆమె మీద రుద్దకూడదు. స్త్రీ కంట నీరు పెట్టకూడదు. అది జరిగితే ఆ యింట్లో లక్ష్మి నిలువదు.

**నీతి :** స్త్రీని బాధపెట్టిన చోట సంపద నిలవదు.

**అర్థాలు :** కలకంఠి = స్త్రీ

**వ్యాఖ్యానం :** ఇక్కడ భార్యాభర్తల సంబంధాన్ని గూర్చి చెప్పబడింది. భారతీయ సంప్రదాయంలో వివాహం కేవలం ఇద్దరి మనుషుల కలయిక కాదు. రెండు మనస్సుల కలయిక. రెండు ఆత్మల కలయిక. ఈ బంధం చాల పవిత్రమైనది. ధర్మబద్ధంగా కట్టుకొన్న ధర్మపత్ని ఆరు ధర్మాలను నెరవేరుస్తుంది. కార్యాచరణలో దాసిగా, వ్యవహారాలలో మంత్రిగా, భోజనం వడ్డించేటప్పుడు తల్లిగా, రూపంలో లక్ష్మిగా, శయనంలో రంభగా, ఓర్పులో భూదేవిగా ఆమె భర్త జీవితాన్ని పంచుకొంటుంది. అటువంటి కులకాంతతో కలహించకూడదు. ఆమెపై వట్టి నిందలు మోపకూడదు. ఆమె కంట తడిపెడితే, లక్ష్మి యింటి నుంచి వెడలిపోతుందని పెద్దలంటారు.

**Meaning:** One should never quarrel with one's lawfully wedded wife. She should never be blamed with false accusations. The woman should never have occasion to shed tears. If that happens, that home can never be prosperous.

**Moral:** Where a woman is unhappy there is no prosperity.



**140.** **కూరిమి గల దినములలో**
**నేరము లెన్నడును కలుగనేరవు మరి యా**
**కూరిమి విరసంబైనను**
**నేరములే తోచుచుండు నిక్కము సుమతీ.**

**భావం :** ఇద్దరు స్నేహభావంతో వున్నప్పుడు, ఒకరి తప్పులు మరొకరికి కన్పించవు. ఆ స్నేహం విరసమైనప్పుడు, ఒకరి మీద మరొకరికి తప్పులే కన్పిస్తుంటాయి. ఇది లోకానుభవంతో తేలిన సత్యం. అందువల్ల అందరు స్నేహభావంతో వుండాలి. శత్రుత్వానికి తావీయగూడదు.

**నీతి :** ఏటి నిండ నీళ్లున్నపుడు, అడుగున వున్న గుంటలు, రాళ్లు ఏమీ కనిపించవు. ఏరు ఎండిపోతే, అందులో గుంటలు, రాళ్లే కనిపిస్తాయి.

**వ్యాఖ్యానం :** ఇక్కడ స్నేహం యెంత విలువైనదో చెప్పబడింది. సృష్టిలో తీయనిది స్నేహమేనోయ్ అన్నాడొక కవి. ప్రతి వారికి స్నేహితులుంటారు. నిజమైన స్నేహితుల మధ్య అపార్థాలుండవు. ఒకరి మీద, ఒకరికి తప్పులు కనపడవు. ఆ స్నేహం విరసమైనప్పుడు, స్నేహితులు ఒకరికొకరు ఊరకే అపార్థం చేసుకుంటారు. ఒకరి మీద, ఒకరికి తప్పులే కనిపిస్తుంటాయి. ఉదాహరణకు, ఒక నది వరదలో నిండుగా ప్రవహిస్తున్నపుడు సమతలంగా చక్కగా సాగిపోయే ప్రవాహం కనిపిస్తుంది. నది అడుగున వున్నరాళ్లు, రప్పలు, గుంటలు కన్పించవు. ఆ ప్రవాహం ఆగిపోయి, నీళ్లు లేనప్పుడు, నదిలోని రాళ్లు రప్పలు, గుంటలు మాత్రమే కన్పిస్తాయి.

**Meaning:** In friendship, both the friends are not aware of each other's shortcomings. When their friendship breaks up, they become aware of only each other's flaws. This is a universal truth. Thus there should be no place for hostility and all should learn to live as friends.

hostility = enmity, పగ, విరోధం

**Moral:** When the stream has plenty of water, no stones or ditches are visible. When the stream dries up, only the rocks and pits are visible.



**141.** **తనవారు లేని చోటును**
**జనవించుక లేనిచోట, జగడము చోటన్**
**అనుమానమైన చోటును**
**మనుజునకట నిలువదగదు మహిలో సుమతీ.**

**భావం :** ఎక్కడ తనవారనుకొన్న వారుండరో, ఎక్కడ తనకు చనువు లభించదో, ఎక్కడ జగడాలు నిత్యం జరుగుతుంటాయో, ఎక్కడ ప్రతివారు తనను అనుమానిస్తారో అక్కడ బుద్ధిమంతుడైన వాడెవ్వడును నివసింపకూడదు. ఇది అనుభవం వల్ల తెలుసుకొన్న విషయం. అట్టి చోట నివసించేవానికి శాంతి భద్రతలుండవు.

**నీతి :** భద్రత లేని చోట ఉండరాదు.

**వ్యాఖ్యానం :** మనిషి వుండదగని చోట్లను గూర్చి యిచ్చట చెప్పబడింది. ఎంత కలిమి వున్నా, అవసరమైనపుడు అండదండలు అందించే హితులు, సన్నిహితులు లేని చోట నివసించకూడదు. ఎంత పలుకుబడి వున్నా, తన వ్యక్తిగత సమస్యలను చర్చించుకొనే చనువు, స్వాతంత్ర్యం లేని చోటు నివాసయోగ్యం కాదు. కారణమున్నా, లేకున్నా ఒకరితో ఒకరు జగడాలు పెట్టుకొనే తగువుల మారి జనం వున్న చోట నివాసం ఏర్పరుచుకోకూడదు. తనను ఊరక అనుమానించే నిత్యశంకితులున్న చోట వుండగూడదు.

**Meaning:** A wise man will never live in a place where he has no close friends or relatives, where he is unable to interact freely, where there is unrest and disturbance often and where people do not trust him. This is a fact. When one continues to live in such a place, he cannot have safety or security.

**Moral:** Never stay at an unsafe, friendless place.



**142. పుత్రోత్సాహము తండ్రికి**
**పుత్రుడు జన్మించినపుడె పుట్టదు, జనులా**
**పుత్రుని గనుగొని పొగడగ**
**బుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ.**

**భావం :** పుత్రుడు జన్మించినప్పుడు కాదు. ఆ పుత్రుని చూచి అందరు మెచ్చుకొన్నప్పుడు తండ్రికి ఆనందం కలుగుతుంది. ప్రతి పుత్రుడు, తండ్రికి అట్టి ఆనందాన్ని కల్గించాలి. అప్పుడే అతని జన్మ సార్ధకమౌతుంది.

**నీతి :** కొడుకు ప్రయోజకుడై తల్లిదండ్రులకు ఆనందం కలిగించాలి.

**వ్యాఖ్యానం :** పుత్రుని వల్ల కన్నవారికి కలిగే ఆనందాన్ని గూర్చి యిచ్చట చెప్పబడింది. పుత్రుడంటే పరలోకగతుడైన తండ్రిని పున్నామ నరకం నుంచి రక్షించేవాడని అర్థం. పుత్రునికి మరొక పేరు నందనుడు. అంటే ఆనందం కలిగించేవాడని అర్థం. అట్టి పుత్రుడు జన్మించడం తండ్రికి ఆనందదాయకం. అయితే పుత్రుడు జన్మించినప్పుడే తండ్రి సంతోషాన్ని ప్రదర్శించడు. ఆ పుత్రుడు పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధుల్ని నేర్చుకొని, సత్కార్యాలను ఆచరిస్తుంటే అది చూచి ప్రజలు ప్రశంసిస్తుంటే, అప్పుడు తండ్రి మహదానందాన్ని పొందుతాడు.

**Meaning:** A father should be proud and happy, not just when a son is born. He should be so when everyone showers praise on his son. It is the duty of every son to make his father proud of him. Only then can he be called a true son who has fulfilled his duty.

**Moral:** A son should grow up to be a worthy son of whom the parents are proud of.



**143. సిరిగలవాని కెయ్యెడల జేసిన మేలది నిష్ఫలంబగున్
నెరిగురి గాదు, పేదలకు నేర్పున జేసిన సత్ఫలంబగున్
వరపున వచ్చి మేఘుడొక వర్షము వాడిన చేల మీదటం
గురిసిన గాక, యంబుధుల గుర్వగ నేమి ఫలంబు, భాస్కరా!**

**భావం :** ధనం గల వాడికి నీవు చేసే మేలు వల్ల ప్రయోజనం వుండదు. ఆ మేలు నీవు చేయకపోయినా, అతడు క్షేమంగా వుంటాడు. సాయం కోసం ఎదురుచూచే పేదవానికి నీవు మేలు చేస్తే అతడు సుఖపడతాడు. మేఘుడు సముద్రంలో వర్షిస్తే కలిగే ప్రయోజనమేమిటి? అదే వాడిన చేల మీద వర్షిస్తే పంటలు పండుతాయి. ప్రజలకు మేలు కలుగుతుంది. ఇది గుర్తుంచుకొని, నీవు అవసరమున్న వానికే మేలు చేయాలి.

**నీతి :** సహాయం అవసరమున్న వారికే చేయాలి.

**అర్థాలు :** అంబుధి = సముద్రం; నెరిగురిగాదు = సరైన లక్ష్యం కాదు.

**వ్యాఖ్యానం :** సాధారణంగా లోకులు ధనవంతులైనవారికే కానుకలు ఇస్తుంటారు. సన్మానాలు చేస్తుంటారు. అందువల్ల వారు ధనవంతులను మెప్పించి వారి నుండి తిరిగి సాయం ఏదో రూపంలో రాబట్టుకొనవచ్చునని ఆలోచిస్తుంటారు. కాని ధనవంతునికి ఆ కానుకలు, సన్మానాల వల్ల జరిగే ప్రయోజనమేమి వుండదు. వాటిని ధనహీనునికిస్తే అతని జీవితం సుఖంగా గడుస్తుంది. అతడు కృతజ్ఞత చూపిస్తాడు. పరోపకారం చేసిన ఫలం దాతలకు దక్కుతుంది. ఉదాహరణకు, మేఘం సముద్రం మీద వర్షిస్తే సముద్రానికి కలిగే ప్రయోజనమేమి వుండదు. అదే వాడిన చేల మీద వర్షం కురిస్తే, పైరు పెరిగి పంటలనందిస్తుంది. దేశం సుభిక్షంగా వుంటుంది. కాబట్టి, మనం ఎవరికి అవసరం వుంటుందో వారికే సాయం చేయాలి. అప్పుడే ఆ సాయం సఫలమౌతుంది.

**Meaning:** There is not much use in helping a wealthy man. Even if that help is not given he can take care of himself. If help is given to a poor man, he is happy as he accepts it with gratitude. What is the use of rain when the cloud rains on the ocean? If the same rain falls on dry land, crops will grow and it will help the farmers. Keeping this in mind, one should offer help to one who really needs it.

**Moral:** Help only the needy.



**144. సుగుణవంతురాలు, సుదతియైయుండిన
బుద్ధి మంతులైన పుత్రులొప్ప,
స్వర్గమేటికయ్య సంసారికింకను!
విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మంచి గుణాలు గల భార్య, బుద్ధిమంతులైన పుత్రులుంటే, సంసారికి అదే స్వర్గం. ప్రతి మానవుడు అట్టి స్వర్గాన్ని కోరుకోవాలి.

**నీతి :** సుఖ సంసారమే స్వర్గం.

**వ్యాఖ్యానం :** ఇక్కడ గృహస్థాశ్రమాన్ని గూర్చి చెప్పబడింది. మనిషి జీవితంలో మూడు ప్రధానమైన ఘట్టాలున్నవి. మొదటిది బ్రహ్మచర్యాశ్రమం. అందులో బ్రహ్మచారిగా వుండి విద్యాబుద్ధులు నేర్చుకోవాలి. రెండవది గృహస్థాశ్రమం. అందులో వివాహం చేసుకొని సంసారం చేసి సంతానాన్ని కని, పెంచి వారిని మంచి పౌరులుగా తీర్చిదిద్దాలి. సహగృహస్థులతో కలిసి సమాజం యొక్క సంక్షేమానికి, సుఖ సంతోషాలకు కృషి చేయాలి. మూడవది వానప్రస్థాశ్రమం. ఇందులో విశ్రాంత జీవితాన్ని ప్రశాంతంగా గడపాలి. తక్కిన ప్రజలకు అవసరాన్ని బట్టి ధర్మబోధన చేయాలి. ఈ మూడు ఆశ్రమాల్లో శ్రేష్ఠమైనది గృహస్థాశ్రమం. ఈ ఆశ్రమంలో ఆనందం కూర్చేవాళ్లు, సుగుణవతియైన ఇల్లాలు, బుద్ధిమంతులైన పిల్లలు. వారున్న సంసారం స్వర్గంతో సమానం. ఆ స్వర్గాన్నే అందరు కోరుకోవాలి.

**Meaning:** If a man has a virtuous wife and good sons, he has truly found heaven. Every man has to wish for such a heaven.

**Moral:** True heaven is found in a happy family.



**145. పుణ్యమంతగూడి, పురుషుడై జన్మింప**
**పాపమంతగూడి పడతి యగునె?**
**స్త్రీలు పురుషులనుచు ఏలయీ భేదమ్ము?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** సృష్టిలో పుణ్యమంత కలిసి పురుషుడుగా జన్మింపలేదు. పాపమంతా కలిసి స్త్రీగా జన్మింపలేదు. జన్మలో ఇద్దరు ఒకే రీతిగా జన్మించారు. అయినప్పుడు స్త్రీ పురుషుల మధ్య భేదాలు పాటించుట ధర్మం కాదు.

**నీతి :** స్త్రీ పురుషులలో రక్త మాంసాలొక్కటే, ఆత్మ ఒక్కటే.

**వ్యాఖ్యానం :** ఇక్కడ స్త్రీ పురుష వివక్షను గూర్చి చెప్పబడింది. పూర్వ కాలం నుండి మానవ సమాజం పురుషాధిక్యంతో కూడియున్నది. చాల సమాజాలలో స్త్రీని వంటింటి కుందేలుగా, బిడ్డల్ని కనే యంత్రంగా చూడడం జరిగింది. ఆ పరిస్థితి యిప్పుడు మారింది. స్త్రీలు ఉన్నత విద్యల్ని అభ్యసించి అన్ని రంగాలలో ముందంజ వేసి, పురుషుని కంటే తాము తక్కువ కాదని నిరూపిస్తున్నారు. దీనిని మనం స్వాగతించాలి.

**Meaning:** No man is born because of merit, or a woman, of sin. Then why should there be any discrimination between them when they both have been born of the same creation?

**Moral:** Flesh, blood and soul remain the same whether it is a man or a woman.



**146.** **మ్రొక్కినంత చెరకు చక్కెర కాబోదు,**
**పిండి చేసి రసము పిండకున్న,**
**కష్టపడక కలిమి కౌగిట వాలదు**
**మహిత వినయశీల! మల్లెమాల!!**

**భావం :** చెరకు గడకు దండం పెడితే అది చక్కెరగా మారదు. దాన్ని యంత్రంలో వేసి, పిండి చేసినపుడే, రసం రూపంలో చక్కెర బైటికి వస్తుంది. కష్ట పడకుండా ధనం నీ చేతికి రాదు. కాబట్టి శ్రమ చేసి ధనం అర్జించాలి.

**నీతి :** కష్టపడితేనే ఫలితం వుంటుంది.

**వ్యాఖ్యానం :** ఇక్కడ 'కష్టే ఫలి' అనే సూక్తిని గూర్చి చెప్పబడింది. చెరకుగడలో చక్కెర వుంది. దానికి మ్రొక్కితే ఆ చక్కెర మన చేతికి రాదు. చెరకును గానుగలో వేసి తిప్పి, రసాన్ని పిండితే, అందులో నుంచి చక్కెర లభిస్తుంది. అదే విధంగా కష్టపడకుండ, విద్యను గాని, ధనాన్ని గాని మనం సంపాదించలేము.

**Meaning:** Praying to sugarcane will not give sugar. The cane has to be fed into a machine and the juice has to be extracted. Money cannot be earned without working hard for it. Hence only hard work will earn wealth.

**Moral:** Only hard work gives rewards.



**147.** **ఏది ఎందుకన్న వాదమే తల్లియై**
**సకల శాస్త్రములకు జన్మ నొసగె;**
**ప్రశ్న లేకయున్న ప్రగతి శూన్యము సుమా!**
**మహిత వినయశీల! మల్లెమాల!!**

**భావం :** ఏది, ఎందుకు అని ప్రశ్నించుట వల్లనే శాస్త్రం అభివృద్ధి చెందింది. ప్రశ్న లేకుంటే ప్రగతి వుండదు. అందువలన నీవు ప్రశ్నించడం నేర్చుకోవాలి.

**నీతి :** ప్రశ్నతోనే ప్రజ్ఞ వస్తుంది.

**వ్యాఖ్యానం :** 'ఎందుకు' అన్న ప్రశ్న నుండే శాస్త్ర విజ్ఞానం ఉద్భవించింది. చెట్టు నుండి యాపిల్ పండు క్రిందపడడం చూచిన, శాస్త్రజ్ఞుడు న్యూటన్ భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఒక గిన్నెలో

మరుగుతున్న నీరు ఆవిరిగా మారి గిన్నె మూతను పైకి యెత్తడం చూచిన శాస్త్రజ్ఞుడు, ఆవిరి యంత్రాన్ని రూపొందించి, రైలుబండిని నడిపించాడు.

**Meaning:** Science and knowledge have progressed only because the questions 'what' and 'why' have often been asked. There can be no progress without curiosity and questioning. So all should learn to ask questions.

**Moral:** Only questioning helps man to progress.



**148.** **మండుటెండలోన మాడుచున్నావని**
**నిన్ను వెదకు కొనుచు నీడరాదు;**
**చెట్టు దరికి నీవె చేరుకో వలయును**
**మహిత వినయశీల! మల్లెమాల!!**

**భావం :** నీవు ఎండలో వున్నావని చెట్టు నీడ నిన్ను వెదుక్కుంటూ నీ దగ్గరకు రాదు. నీవే చెట్టు దగ్గరకు వెళ్లాలి. నీకు సాయం అవసరమైనప్పుడు సాయం చేసేవారిని నీవే ఆశ్రయించాలి.

**నీతి :** సాయం నిన్ను వెదుక్కొంటూ రాదు. దేనికైనా ప్రయత్నం అవసరం.

**వ్యాఖ్యానం :** అడగకుండ అమ్మైనా పెట్టదని యిక్కడ చెప్పబడింది. ప్రతివారికి కష్టాలు వస్తాయి. అందులో నుంచి బైటపడడానికి, ఇతరుల సాయం అవసరం అవుతుంది. అందుకు నీవు, ఇతరులను ఆశ్రయించవలసి వస్తుంది. ఆశ్రయించకుంటే, సాయం నిన్ను వెదుకు కొంటూ రాదు. ఉదాహరణకు, ఎండలో వున్నవాడికి నీడ అవసరం. నీడ కోసం అతడు చెట్టు దగ్గరకు వెళ్లవలసిందే కాని, చెట్టు అతని దగ్గరకు రాదు.

**Meaning:** No shade will come to you and protect you. You will have to go searching for shade if you want to protect yourself from the scorching sun. If you need help you have to seek it with your own effort.

**Moral:** Help does not come to your aid when you need it. You have to find the sources of help yourself.



**149.** **మట్టి పిసుకు కొనుట మర్యాద గాదను**
**మనిషికేమి తెలుసు మట్టి విలువ,**
**మనిషి అల్పజీవి, మట్టి చిరంజీవి**
**మహిత వినయశీల! మల్లెమాల!!**

**భావం :** మట్టి పిసుకు కొని బ్రదికే వ్యవసాయ దారుల వంటి వారిని చులకనగా చూసేవారికి మట్టి విలువ తెలియదు. మట్టి చిరంజీవి. అంటే చావులేనిది. మనిషి పుట్టి, చస్తూ వుంటాడు. ఈ భేదాన్ని తెలిసికొని, మనిషి, మట్టిని గౌరవించాలి.

**నీతి :** మట్టి నిన్ను సృష్టిస్తుంది. మట్టిని నీవు సృష్టించలేవు. అందుకే మట్టిని గౌరవించు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ మట్టి విలువను గూర్చి చెప్పబడింది. మట్టి దైవసృష్టి. నాశనం లేనిది. మట్టి నుండి ఎన్నో వస్తువులను సృష్టించగలం. కాని మట్టిని సృష్టించలేము. మట్టిలో పనిచేసే రైతు, మట్టి నుండి పంటల్ని పండించి, మనకు ఆహారాన్ని యిస్తున్నాడు. ఆ మట్టి మనిషికి మనం తగిన మర్యాద యివ్వాలి.

**Meaning:** Anyone who feels that the work of a farmer, who works with clay, is demeaning work, does not know the value of mud and clay. Man has a very short span of life. The earth remains forever. It is deathless. Realizing this truth, a human being must have immense respect for mother earth.

Demeaning=low

**Moral:** The earth gives birth to man. Man cannot create earth so he has to learn to treat it with respect.



**150. చెమట కంపుగొట్టు సెంటు వాసన గొట్టు**
**అంతమాత్రముననె అధికమౌనె**
**సిరులు గూర్చిపెట్టు చెమటకన్నను సెంటు?**
**మహిత వినయశీల! మల్లెమాల!!**

**భావం :** చెమట కంపుగొడ్తుంది. కాని దానిని నేల మీద చిందించినప్పుడు నేల సస్యశ్యామలమై జీవనాధారమైన పంటనందిస్తుంది. సెంటు మంచి సువాసనను అప్పటికప్పుడే యిస్తుంది. సౌఖ్యం ఇస్తుంది. మనిషి తన జీవితంలో ఈ రెండింటిలో దేనికి ఎక్కువ విలువ యివ్వాలో తన వివేకంతో తెలుసుకోవాలి.

**నీతి :** కష్ట జీవికి గౌరవం ఎక్కువ.

**వ్యాఖ్యానం :** చెమట దుర్గంధాన్నిస్తుంది. కాని అది కృషికి చిహ్నం. కాయ కష్టం చేసి చెమటోడ్చినప్పుడే సంపద లభిస్తుంది. ఆ సంపద జీవిత కాలానికంతా అన్ని సుఖాలనిస్తుంది. సెంటు సుగంధాన్నిస్తుంది. ఆ సుగంధం తాత్కాలికంగా ఘ్రాణేంద్రియ సుఖాన్నిస్తుంది. ఈ రెండింటిలో దేనికి యెక్కువ విలువ నివ్వాలి అనేది ప్రశ్న. ఇక్కడ చెమట శ్రమకు, సెంటు ఆడంబరానికి ప్రతీకలు.

**Meaning:** Sweat gives a bad smell. But sweat of hard labour also gives golden harvests. Perfumes give out a pleasant fragrance which disappears after a little while. One has to decide which of them has greater value and which merits greater respect.

**Moral:** An industrious worker always commands great respect for the wealth he creates.



**151.** **నీరము తప్త లోహమున నిల్చి యనామకమై నశించు, నా**
**నీరమె ముత్యమట్లు నళినీదళ సంస్థితమై తనర్చు, నా**
**నీరమె శుక్తిలోబడి మణిత్వముగాంచు సమంచిత ప్రభం,**
**బౌరుషవృత్తు లిట్లధము, మధ్యము, నుత్తము, గొల్చువారికిన్.**

**– భర్తృహరి**

**భావం :** నీరు, వేడి పెనం మీద పడితే ఆవిరై పోతుంది. తామరాకుపై పడితే, ముత్యంలా మెరుస్తుంది. ఆలిచిప్పలో పడితే నిజమైన ముత్యంగా మారుతుంది. ప్రతి మనిషి యొక్క భవిష్యత్తు, అతనికి లభించిన ఆశ్రయాన్ని బట్టి వుంటుంది. అధములను ఆశ్రయించినవారు సర్వనాశనాన్ని, మధ్యములనాశ్రయించినవారు సౌఖ్యాభ్యాసాన్ని, ఉత్తముల నాశ్రయించినవారు వాస్తవ సౌఖ్యాన్ని పొందుతారు.

**నీతి :** నీ భవిష్యత్తు నీవాశ్రయించిన వారిని బట్టి వుంటుంది.

**అర్థాలు :** తప్తలోహము = వేడిగానున్న యినుము; నళినీదళము = తామరాకు; శుక్తి = ఆల్చిప్ప;
సౌఖ్యాభాసం = సౌఖ్యం కలిగిందనే భ్రమ.

**వ్యాఖ్యానం :** ఒక మనిషి యొక్క వికాసం, భవిష్యత్తు అతనికి లభించిన ఆశ్రయం, సహవాసంపై ఆధారపడి వుంటుంది. ఉదాహరణకు ఒక నీటి చుక్క, కాలే పెనం పైన పడితే ఆవిరైపోతుంది. పద్మ దళం మీద పడితే ముత్యంలా మెరుస్తుంది. ఆలిచిప్పలో పడితే నిజమైన ముత్యంగా మారుతుంది. కాబట్టి ఉజ్వల భవిష్యత్తు కోసం, అందరు ఉత్తములను ఆశ్రయించి వారితో సహవాసం చేయాలి.

**Meaning:** Water evaporates on a hot pan. It glows like a pearl when it rests on a lotus leaf. It turns into a real pearl in an oyster. Every man's fortune is shaped by the company, support and environment he finds himself in.

**Moral:** One's future is determined by the environment he has.



**152.** **సంపదలు గల్గుతరి మహాజనుల హృదయ**
**మభినవోత్పల కోమలం బగుచు వెలయు**
**నాపదలు వొందునపుడు మహామహీధ్ర**
**రాశ్మసంఘాత కర్కశంబై తనర్చు.**

**– భర్తృహరి**

**భావం :** సంపదలు వచ్చినప్పుడు అప్పుడే వికసించిన కలువ పూవులాగా సజ్జనులు హృదయం కోమలంగా వుండి ఔదార్యాన్ని ప్రదర్శిస్తుంది. ఆపదలు వచ్చినప్పుడు పెద్ద కొండలోని బండరాయిలాగా కర్కశంగా వుండి ధైర్యాన్ని ప్రదర్శిస్తుంది. చలి ఎక్కువైతే, మంచినీరు మంచుగడ్డగా మారుతుంది.

**నీతి :** సంపద కలిగినపుడు ఔదార్యాన్ని, ఆపదలు కలిగినపుడు ధైర్యాన్ని కలిగి ఉండాలి.

**వ్యాఖ్యానం :** ఇక్కడ కలిమిలేములలో సజ్జనుల ప్రవర్తనను గూర్చి చెప్పబడింది. సంపదలు కల్గినప్పుడు సజ్జనుల హృదయం అప్పుడే వికసించిన కలువపువ్వులాగా కోమలంగా వుండి, ఔదార్యాన్ని ప్రదర్శిస్తుంది. ఆపదలు వచ్చినప్పుడు వారి హృదయం కొండలోని బండరాయిగా మారిపోయి ధైర్యాన్ని ప్రదర్శిస్తుంది. ఆ గుణాలు మనకు ఆదర్శంగా వుండాలి.

**Meaning:** When a good man prospers, his heart is gentle and beautiful like a lily that has just bloomed. He is kind and generous. When misfortune overtakes him, his heart is like a huge rock on the mountain side, brave, hard and unyielding.

Unyielding= immovable

**Moral:** Generosity in prosperity and courage in adversity are the qualities of great men.

Adversity=misfortune



**153.** **ఉరుబలాఢ్యుడైన యుద్యోగి పరుడైన**
**తగిన విత్తమున్న తరుణమందె**
**పరులకుపకరించి పాలింపగల్గును**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఎంత బలవంతుడైనా, పెద్ద ఉద్యోగంలో ఉన్నా, దగ్గర ధనమున్నవాడే యితరులకు సాయం చేయగలడు. వట్టి చేతుల్తో మూరలువేస్తే ఏం లాభం?

**నీతి :** ధనం కలిగినవారు ఎవరైనా ఏమైనా చేయగలరు.

**Meaning:** However mighty a man may be, however high a position he may hold, he can be successful only if he has money power to be able help others. What can empty hands measure?

**Moral:** There is nothing impossible for a man with enough money power.



**154.** **చీమలు పెట్టిన పుట్టలు**
**పాములకిరవైనయట్లు పామరుడు తగన్**
**హేమంబు కూడ బెట్టిన**
**భూమీశులపాల జేరు భువిలో సుమతీ.**

**భావం :** చీమలు శ్రమపడి పుట్టలు పెడ్తాయి. అందులోకి పాములు చేరి నివసిస్తుంటాయి. అలాగే, లోకజ్ఞానం లేనివాడు, ధనం కూడబెడితే, అది రాజుల పాలైపోతుంది.

**నీతి :** ధనం కేవలం కూడబెట్టడమే కాదు దాన్ని సద్వినియోగం చేయాలి.

**Meaning:** Ants build their ant hills with great effort. Snakes occupy them and make their homes. Similarly if a man without much wisdom were to hoard money, it is bound to find its way into the hands of the rulers.

Hoard = save, gather, store

**Moral:** It is not enough to hoard money. It is important to know how to put it to the best use.



**155.** **ఓర్పు లేని భార్య యున్న ఫలంబేమి?**
**బుద్ధిలేని బిడ్డ పుట్టి యేమి?**
**సద్గుణంబులేని చదువది యేలరా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఓర్పులేని భార్యతో సుఖం వుండదు. బుద్ధిలేని సంతానం పుట్టి ప్రయోజనం లేదు. సద్గుణం లేని విద్య లోకానికి వుపయోగపడదు. అందుకే ప్రతివారికి బాల్యం నుండే, సత్ప్రవర్తన నేర్పాలి. అప్పుడే సమాజంలో సుఖశాంతులుంటాయి. మొక్కై వంగనిది మానై వంగుతుందా?

**నీతి :** చదువుకు సద్గుణాలు తోడు కావాలి.

**Meaning:** A man cannot be happy with a wife who has no patience. A bad son is of no use to him. Education without good character does no good to the world. It is very important that every child has to be trained in good conduct from a very tender age. Then there will be peace and happiness in the world. If a young sapling cannot be bent and trained, is it possible to bend a full grown tree?

**Moral:** Education needs to build good character. It helps to keep the world a happy place live in.



**156.** **కానివాని చేత కాసు వీసములుంచి**
**వెంట దిరుగువాడు వె[్రివాడు**
**పిల్లి తిన్న కోడి పిలిచిన పలుకునా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** యోగ్యుడు కానివానికి, న్యాయం లేని వానికి ధనం యిచ్చి, అది తిరిగి తీసుకోడానికి, అతని వెంట తిరిగేవాడు వె[్రివాడు. పిల్లి తిన్న కోడిని రమ్మని పిలిస్తే వస్తుందా? కాబట్టి, ఒకరి నడవడిని పూర్తిగా తెలుసుకొన్న తర్వాతనే, అతనితో వ్యవహారాలు నడపాలి.

**నీతి :** పూర్తిగా తెలుసుకోకుండ, ఎవరితోను వ్యవహారాలు పెట్టుకోరాదు.

**Meaning:** Only a fool will chase a man who is untrustworthy and has no ethics, to recover the money he has entrusted to him. Can a chicken gobbled up by a cat be called back to life? Only after a person's character has been tested should one entrust any responsibility to him.

Gobbled = eat hastily without proper chewing

**Moral:** Never entrust any responsibility to someone till they have been tried and tested, and are proved trustworthy.



**157.** **కానివాని తోడ కలసి మెలగువాడు**
**కాని వాని గానె కానబడును,**
**తాటి క్రింద పాలు త్రాగిన చందమౌ**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** యోగ్యతలేని వానితో కలిసి తిరిగేవాణ్ణి, యోగ్యత లేనివాని లాగే లోకం పరిగణిస్తుంది. తాటిచెట్టు నుండి కల్లు గీచి తయారు చేస్తారు. ఆ చెట్టు క్రింద పాలు త్రాగినా కల్లు త్రాగినట్లుగానే చూసేవారు భావిస్తారు. అందుకే, యెప్పుడూ సజ్జన సాంగత్యమే చేయాలి.

**నీతి :** అయోగ్యునితో కలిసి తిరిగేవాణ్ణి, అయోగ్యునిగానే భావిస్తుందీ లోకం.

**Meaning:** A person found is in the company of evil men, is bound to be judged as an evil man by others. Toddy is collected from Palmyra trees. If one were to drink milk standing under that tree, people are bound to believe it is not milk but it is toddy. Hence one should always be seen in good company.

**Moral:** If one were to choose bad company, the world will judge him as a bad man too.



**158.** **కోతిబట్టి దెచ్చి కొత్త పుట్టము గట్టి**
**కొండముచ్చు లెల్ల గొల్చినట్టు,**
**నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** కోతికి మంచి వేషం వేసి, కొండముచ్చులు కొలిచినట్లుగా నీతిలేని వాని వద్ద నిర్భాగ్యులు చేరుతుంటారు.

**నీతి :** నీతిమంతులను ఆశ్రయిస్తే ఫలితం ఉంటుంది.

**Meaning:** A monkey may be dressed up as a leader and baboons may worship it. Those who gather around persons without good character would appear the same as the baboons. The whole show would seem absurd and purposeless.

**Moral :** The company of noble people is rewarding.



**159.** **గొర్రెలు పదివేలు కూడియుండిన చోట**
**తల్లినెరిగి వచ్చుదాని కొదమ,**
**పరమయోగి నెరిగి భక్తుండు వచ్చురా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** పదివేల గొర్రెలున్నా మందలో గొర్రెపిల్ల దాని తల్లిని గుర్తించి వస్తుంది. అదే విధంగా భక్తుడు పరమయోగిని గుర్తిస్తాడు. ఇది సహజ ప్రేమశక్తిని, బుద్ధి కౌశల్యాన్ని తెలియచేస్తుంది.

**నీతి :** బుద్ధిమంతుడు తన ఆత్మీయులెవరో సులభంగా గుర్తిస్తాడు.

**Meaning:** A lamb recognizes its mother in a flock of ten thousand sheep. A devotee will be able to recognize his teacher and guide in the same way. His natural power of love and sharp intelligence will help him to find the great wise teacher to guide him.

**Moral:** A good pious man will be able to recognize his venerable master without any difficulty.

Venerable = to be respected



**160.** **చిక్కియున్న వేళ సింహంబునైనను**
**బక్క కుక్కయైన బాధపెట్టు,**
**బలిమిలేని వేళ పంతముల్ చెల్లవు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** చిక్కిపోయి బలహీనంగా వున్న సింహాన్ని, బక్క కుక్క కూడా బాధపెట్టగలదు. కాబట్టి బలం లేనప్పుడు, పంతాలకు పోకూడదు. ఎదుటివారి బలాబలాల్ని అంచనా వేసుకొని మనిషి ముందుకు సాగాలి.

**నీతి :** బలం లేనప్పుడు పంతాలకు పోకూడదు.

**Meaning:** When a lion is weak and helpless, even a lean sick dog may trouble it. Thus, when one is weak and has no power, there should be no attempt to oppose anyone. Always weigh with wisdom, the power and strength of the opponent before taking the next step.

**Moral:** Without enough power there is no use opposing anyone.



**161.** **తనువులస్థిరమని ధనములస్థిరమని**
**తెలుపగలడు తాను తెలియలేడు,**
**చెప్పవచ్చు పనులు చేయుట కష్టమౌ!**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** శరీరం క్షణభంగురమని, సంపదలు ఒక చోట స్థిరంగా వుండవని యితరులకు బోధించడం సులభం. కాని తాను తెలిసికోవడం చాలా కష్టం. అందుకే చెప్పడం సులభం చేయడం కష్టం అన్నారు పెద్దలు. ఏది ఆచరణ సాధ్యమో, అదే మనం ఇతరులకు బోధించాలి.

**నీతి :** ఏది మనం ఆచరించలేమో, అది యితరులకు బోధించతగదు.

**Meaning:** It is easy to tell others that a body’s existence is temporary in nature and wealth never stays too long at the same place. It is very difficult for the very same person who preaches, to understand the meaning of what he preaches to others. That is why wise men have always said that it is easy to preach but difficult to practise. Thus people should preach what can be practised by themselves and not ask others to practise what they themselves do not follow.

**Moral:** No one should preach to others what they themselves do not practise.



**162.** **తామసించి చేయ దగదెట్టి కార్యంబు**
**వేగిరింపనదియు విషమగును,**
**పచ్చికాయ దెచ్చి పడవేయ ఫలమౌనె**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** కోపంతో వేగిరంగా ఏ పని చేయకూడదు. అది విషమ పరిస్థితుల్ని సృష్టిస్తుంది. ఫలితం వుండదు. పచ్చికాయను కోసి క్రింద పడవేస్తే పండు అవుతుందా?

**నీతి :** తొందరపడి యే కార్యం చేయరాదు.

**Meaning:** Never try to carry out any work in haste and anger. It can have very dangerous consequences and will not have good results. Will a raw fruit ever ripen if it has dropped on to the ground before it is ripe?

**Moral:** Never try to take on any work in haste without prior thought.



**163.** **కల్లుకుండకెన్ని ఘనభూషణము లిడ్డ**
**అందులోని కంపు చిందులిడదె?**
**తులువ పదవిగొన్న తొలి గుణమేమగు?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** దుర్మార్గుడు మంచివాడుగా మారాలని భావించి, గౌరవం కల్పించి, పదవిలో కూర్చుండబెడితే, తన వెనుకటి గుణమైన దుర్మార్గాన్నే ప్రదర్శిస్తాడు. కల్లుకుండకు మంచి భూషణాలు కట్టినా, దానిలోని కంపు చిందులేస్తూనే వుంటుంది కదా.

**నీతి :** దుర్మార్గునికి పదవి యిస్తే దుర్మార్గంగానే ప్రవర్తిస్తాడు.

**Meaning:** If an evil man is given a position of power and respect with the hope that he will become a good man, he will soon show his innate bad qualities, which he had shown earlier, and will do a great deal of harm. A toddy pot will give out the stench of what it had been used for earlier. Even if it is beautifully decorated, the foul smell continues to linger on.

Innate = inborn, natural

**Moral:** An evil man, if given respect, position and power, will go back to his evil ways and cause harm sooner or later.



**164.** **కసవు తినును గాదె పసరంబు లెప్పుడు**
**చెప్పినట్లు వినుచుజేయు బనులు,**
**వానిసాటియైన మానవుడొప్పదా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** గడ్డి తినే పశువులకు, శిక్షణ యిస్తే అవి మనం చెప్పిన పనులు చేస్తాయి. అన్నం తినే మనిషి అలా ప్రవర్తించడం లేదే! పశువులు స్వయంగా ఆలోచించలేవు. అందువల్ల మనకు విధేయంగా వుంటాయి. స్వయంగా ఆలోచించే శక్తి గల మనిషి, ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తాడో వూహించడం కష్టం.

**నీతి :** గడ్డిదినే గొడ్డు మాట వింటుంది కాని, అన్నం తినే మనిషి వినడం లేదు.

**Meaning:** Animals that eat grass can be trained to obey man and he can get his work done. A man who eats good food does not do the same. Animals cannot think for themselves. Hence they obey man. Man, who can reason for himself and think, behaves as he chooses, and no one can predict his actions. Thus an animal which eats only grass can be disciplined to obey, while man who eats far better food, does not know how to impose a sense of discipline on himself.

Predict=foretell

**Moral:** An animal that feeds on grass obeys orders, while man who eats for better food does not.



**165.** **గాడ్దెమేను మీద గంధంబు పూసిన**
**బూదిలోన పడుచు, పొరలు మరల,**
**మోటువాని సొగసు మోస్తరియ్యది సుమీ**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** బూడిదలో పొరలాడే గాడిదకు సుగంధం పూస్తే, అది మరలా బూడిదలో పడి పొరలుతుంది. మోటు వానికి చేసే సొగసు ఇలాగే వుంటుంది. పాత్రుడౌనో కాదో తెలుసుకోకుండ ఎవ్వరికి ఏమీ చేయకూడదు.

**నీతి :** మొరటువానికి చేసే సొగసు, బురదలో పోసే పన్నీరు.

**Meaning:** The donkey which rolls in ash will do it again even after perfume is applied to it. Though an uncultured man is made to dress well, he will not behave in a cultured manner, and will not change his behavior at all. Never offer anything to anyone without making sure that they deserve it.

**Moral:** Trying to make a rough man cultured is like pouring perfume in ash.



**166.** **తన్ను జూచి యొరులు తగమెచ్చవలెనని**
**సొమ్ము లరవు దెచ్చి నెమ్మి మీర,**
**యొరుల కొరకు తానె యుబ్బును, మూర్ఖుడు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఇతరులు తనను మెచ్చుకోవాలని, సొమ్ములు ఎరవు తెచ్చుకొని అలంకరించుకొంటాడు మూర్ఖుడు. తననెవ్వరు పట్టించుకోలేదని తెలిసి, తనకు తానే మురిసిపోతాడు. ఇది ఆత్మనూన్యతాభావం. దీనిని దగ్గరకు రానీయకూడదు. రానిస్తే వ్యక్తిత్వ వికాసానికి అడ్డు తగుల్తుంది.

**నీతి :** అరువు సొమ్ము బరువు చేటు.

**Meaning:** A person who borrows ornaments, wears them, and hopes to win the admiration of others, is very stupid. When no one notices him, he admires himself. This is because of a complex that he has, of being inferior to others. One should never be encouraged to behave like this.

**Moral:** Borrowed things are harmful heavy weights, which can bring great trouble.



**167.** **తల్లియున్నయపుడె తనకు గారాబము**
**ఆమె పోవ, తన్ను నరయ రెవరు,**
**మంచికాలమపుడె మర్యాద నార్జింపు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఇది తల్లి ప్రాధాన్యాన్ని చూపే పద్యం. తల్లి బ్రతికి వున్నప్పుడు బిడ్డనెంతో గారాబంగా చూస్తుంది. ఆమె పోయిన తర్వాత బిడ్డను పట్టించుకొనేవారు ఎవరూ ఉండరు. కాబట్టి తల్లి విలువను అందరూ గ్రహించాలి.

**నీతి :** పిల్లలకు తల్లిని మించి ఆదరించేవారు వేరెవ్వరూ ఉండరు.

**Meaning:-** This is a verse that describes the worth of a mother. A mother loves, pampers and takes the utmost care of a child. No one else cares so much after a mother is gone. Hence everyone should know the value of mother.

**Moral :** No one cares and loves a person more than his mother.



**168.** **వెలయగ నశ్వమేధం**
**బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం**
**దుననిడి తూపగ సత్యము**
**వలనన ములుసూపు గౌరవంబున పేర్మిన్**

**భావం :** ఒక త్రాసులో వేయి అశ్వమేధ యజ్ఞాల ఫలితాన్ని ఒక వైపు ఇంకొక వైపు ఒక్క సత్యవాక్కును ఉంచితే ముల్లు బరువుతో సత్యం వైపు మొగ్గు చూపుతుంది.

**వ్యాఖ్యానం :** అశ్వమేధ యాగం చేయటం ఘనకార్యంగా, సామాన్యులు చేయలేని పనిగా అత్యంత పుణ్యప్రదంగా భావిస్తారు. కాని సత్యం పలకడమే అంతకంటే గొప్ప విషయం. దీనితో లభించే మంచి ఫలితం మరి దేనితోను పొందలేము. ఇది శకుంతల దుష్యంతునితో చెప్పిన మాట.

వెలయగ : ప్రకటించగ

**నీతి :** సత్యవాక్యానికి ఉన్న శక్తి ఏ పుణ్యకార్యానికి ఉండదు.

**Meaning:** If the benefits of a hundred ‘Aswamedha yagyas’ were to be weighed against a statement of truth, the balance would undoubtedly swing in favour of truth!

**Moral:** Truth has greater power than all prayers and rituals.



**169.** **నీళ్ళ మునుగనేల? నిధుల బెట్టగనేల?**
**మొనసి వేల్పులకును మ్రొక్కనేల?**
**కల్మషమ్ములెన్నో కడుపులోనుండగా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** కడుపులో కల్మషం పెట్టుకొని వున్న మనుషులు, పుణ్యతీర్థాలలో మునిగినంత మాత్రాన, ముడుపులు చెల్లించినంత మాత్రాన, దేవతలకు మ్రొక్కినంత మాత్రాన పవిత్రులౌతారా? ఏ పనినైనా నిష్కల్మష హృదయంతో చేయాలి. అప్పుడే ఫలితం లభిస్తుంది.

**నీతి :** కడుపులో కల్మషం కడిగితే పోదు.

**Meaning:** What is the use of having ritual baths in holy rivers, or making offerings to the gods or praying to them when one’s heart is impure? Anything that is done with a pure heart alone will bring in rewards.

**Moral:** The impurity in one's heart cannot be washed away easily.



**170. రాతి బొమ్మలకేల రంగైన వలువలు?**
**గుళ్లు గోపురములు కుంభములును,**
**కూడు గుడ్డ తాను కోరునా దేవుడు?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** తమ కోర్కెలు తీర్చమని ప్రార్థిస్తూ, రాతి బొమ్మను దేవునిగా భావించి, రంగు రంగుల వస్త్రాలతో అలంకరిస్తారు, కుంభం పేరుతో అన్నాన్ని అర్పిస్తారు. గుళ్ళు, గోపురాలు కట్టిస్తారు. తనకు కూడు, గుడ్డ కావాలని దేవుడు కోరినాడా? అడక్కుండానే అందరి అవసరాలు తీర్చేవాడు దేవుడు. ఏ ప్రతిఫలం ఆశించని దేవుడు ముడుపులిస్తే, కోర్కెలను తీరుస్తాడా?

**నీతి :** దేవుడు లంచగొండి అని భావించడం అవివేకం.

**Meaning:** Why are stone idols of gods dressed up in colourful splendid clothes? Why are temples and towers built? Why are delicious offerings of food made to them? Has the Lord ever asked for any of these?

**Moral:** It is foolish to believe that the Lord can be appeased with bribes and offerings.



**171. ఉప్పులేని కూర యొప్పదు రుచులకు**
**పప్పులేని తిండి ఫలము లేదు**
**అప్పులేనివాడె యధిక సంపన్నుడు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఉప్పులేని కూర చప్పగా వుండి జిహ్వాకు రుచించదు. పప్పులేనట్టి అన్నం తిన్నా ఫలితం ఉండదు. అప్పులేనట్టివాడే, నిజంగా సంపదగలవాడు. ఎందుకంటే ఇతరులపై ఆధారపడకుండ హాయిగా జీవితం జరుపుకోగలవాడు. కాబట్టి అప్పులేని వాడే గొప్పవాడు.

**నీతి :** అప్పు చేసి పప్పు కూడా తినకూడదు.

**Meaning:** Food without salt is tasteless. Food without cereal is not satisfying. The truly rich man is the man who does not owe anybody anything. He is a man who can survive in life without depending on anyone.

owe = బాకీ పడియుండు

**Moral:** No one should ever try to live on borrowed money.



**172.** **అనువుగాని చోట నధికుల మనరాదు**
**కొంచెముండుటెల్ల కొదువకాదు**
**కొండ యద్దమందు గొంచెమై యుండదా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** పరిస్థితులు అనుకూలించనప్పుడు, అధికులమని చెప్పుకోరాదు. అణిగివుండడమే మంచిది. అద్దంలో కొండ చిన్నదిగ కన్పిస్తుంది. అంతమాత్రాన కొండ గొప్పతనం తగ్గిపోదు. దీనిని పాటించేవారు తుది విజయం పొందుతారు.

**నీతి :** తగ్గితేనే నెగ్గుతారు. గొప్పలకు పోయి భంగపడకూడదు.

**Meaning:** When circumstances are not favorable, one should lie low and not project himself. A mountain looks small in a mirror. In no way does it mean that the mountain has lost its might.

**Moral:** Victory is certain if one keeps a low profile at times. Rushing in haste to project oneself could prove to be harmful.



**173.** **మైల కోక తోడ మాసిన తల తోడ**
**యొదలి మురికి తోడ నుండెనేని,**
**అధిక కులజునైన అట్టిట్టు పిలువరు,**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఈ పద్యం పరిశుభ్రతను గూర్చి తెలియచేస్తుంది. ఎంత పెద్ద వంశంలో జన్మించినవాడైనా, మాసిన వస్త్రాలతో, చింపిరి జుట్టుతో, మురికి చేరిన శరీరంతో వుంటే అతణ్ణి ఎవ్వరు చూదరు పల్కరించరు. కాబట్టి పరిశుభ్రత, మంచి వస్త్రధారణ ప్రతివారికి అవసరం.

**నీతి :** ఉచిత వస్త్రధారణ, పరిశుభ్రత మనిషికి గౌరవాన్ని కలిగిస్తాయి.

**Meaning:** This stanza stresses the importance of cleanliness. However high-born a person may be, if he is dressed in soiled clothes, his hair is unkempt and his body unwashed no one would pay any attention to him. Hence, personal cleanliness and decent clothes are important for everyone to make a good impression.

unkempt = untidy, తైల సంస్కారం లేని

**Moral:** A well-dressed person, who looks neat and clean, is bound to command respect.



**174.** **ఇహము విడువ ఫలము లింపుగ గలవని**
**మహిని బల్కు వారి మాటకల్ల,**
**ఇహములోనె పరము నెరుగుట కానరా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఇహలోకాన్ని విడిచి, పరలోకానికి పోయినప్పుడే, నీకు సుఖాలు లభిస్తాయనే వారి మాటలు అబద్ధాలు. ఇహలోకంలోనే పరలోక సుఖాల్ని అనుభవించడం నీవు నేర్చుకోవాలి.

**నీతి :** ఇహ పరాలు రెండు మానవుని జీవితనదికి రెండు గట్లు.

**Meaning:** People who convince others that happiness can be found not on this earth but only in heaven, are not speaking the truth. One has to learn to find the joy of heaven on earth itself.

**Moral:** Earth and heaven are like the banks of a river on either side.



**175.** **వంపుకర్రగాచి వంపు తీర్చగవచ్చు**
**కొండలన్ని పిండి గొట్టవచ్చు**
**కఠిన చిత్తు మనసు కరగింపగారాదు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** వంకరగా వున్న కర్రను పొయ్యిలో పెట్టి వేడిచేసి గాని, వేరే విధంగా గాని చక్కగా వుండేటట్లు చేయవచ్చు. కొండలను గూడ పిండిగా గొట్టవచ్చు. కాని కఠినాత్ముని మనస్సుని కరిగించడం సాధ్యం కాదు.

**నీతి :** కఠినాత్ముని మనస్సును కరిగించడం కష్టం.

**Meaning:** A crooked stick can be bent and shaped over a fire. It can be fashioned into the required shape. It may be possible perhaps to pound mountains flat, but it is impossible to melt the heart of a cruel man.

**Moral:** It is not easy to soften the heart of a cruel man.



**176.** **ఆలివంక వార లాత్మబంధువులైరి**
**తల్లివంక వారు తగినపాటి**
**తండ్రివంక వారు దాయాది తగవులౌ**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మధ్యలో వచ్చిన భార్యవైపు వారు ఆత్మబంధువులైపోతారు. తనను కని ప్రేమతో పెంచిన తల్లివైపు వారి బంధుత్వం అంతంత మాత్రమే. తనను వ్రేలు పట్టుకొని నడిపించి, ప్రయోజకుణ్ణి చేసిన తండ్రి వైపు వారు దాయాదులు శత్రువులౌతారు. దీని కంత కారణం ముఖ్యంగా ఆస్తి పంపకాలలో వచ్చే వివాదాలే. అట్టి వివాదాలు రాకుండా జాగ్రత్తపడాలి. ముందుగా వచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడి. ఇదీ లోకరీతి.

**నీతి :** బంధుత్వం సున్నితమైంది. ఎవరికి ఎంత ప్రాధాన్యమివ్వాలో గ్రహించడం మంచిది.

**Meaning:** The relatives from the wife's side, who come later into one's life, become very close. The relatives from the mother's side hardly matter, though a mother is the closest and has brings one up from childhood. The relatives on the fathers' side become very hostile, though the father lovingly guides one in life. The reason often lies in property disputes. One has to be careful to avoid such situations. The principle on which the world moves is like that of horns that come much later in life are sharper, than the ear that one is born with.

**Moral:** Relationships are delicate and fragile. One should deal with them tactfully.

Fragile= easily breakable

Tact= careful thought



**177. అక్కరకు రాని చుట్టము**
**మ్రొక్కిన వరమీని వేల్పు మోహరమున, దా**
**నెక్కిన బారని గుర్రము**
**గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ.**

**భావం :** అవసరమైనప్పుడు అండగా నిలవని చుట్టాన్ని, ఎంత మ్రొక్కినా వరం ప్రసాదించని దైవాన్ని, యుద్ధ సమయంలో తానెక్కితే పరుగు తీయని గుర్రాన్ని వదిలివేయడం మంచిది. అనుభవంతో పెద్దలు చెప్పే మాటయిది. దీనిని అందరు అనుసరించాలి.

**నీతి :** అవసరానికి పనికిరానిదాన్ని వెంటనే విడిచిపెట్టాలి.

**Meaning:** The kin who do not stand by one, in times of trouble, the God who does not grant the wishes to whom one prays earnestly, and a horse that does not run fast enough on the battle field are better discarded. Wise elders have often given this advice and it is worth following.

Kin= relation

Earnest=sincere

Discard=leave

**Moral:** Anything that is not useful when needed should be discarded.



**178.** **అప్పుగొని చేయు విభవము**
**ముప్పున బ్రాయంపుటాలు, మూర్ఖుని తపమున్**
**తప్పరయని నృపురాజ్యము**
**దెప్పరమై మీద గీడు దెచ్చుర సుమతీ.**

**భావం :** అప్పు చేసి పప్పుకూడు తినడం, ముసలితనంలో కుర్ర పెండ్లామును కలిగి వుండడం, మూర్ఖుడు చేసే కార్యసాధనను నమ్మడం, న్యాయాన్యాయ విచక్షణ లేని రాజు యొక్క రాజ్యంలో నివసించడం ఎప్పటికైనా ప్రమాదం కల్గిస్తాయి. అందుచేత, వాటికి దూరంగా వుండడం శ్రేయస్కరం.

**వ్యాఖ్యానం :** కొన్ని ప్రాంతాల్లో కొన్ని జాతుల్లో, కొన్ని మతాలవాళ్లలో డబ్బు తీసుకొని ముసలివాళ్ళకి ఆడపిల్లల్ని పెళ్లి చేస్తుంటారు. కన్యాశుల్కం నాటకం ఆ సమస్యనే ప్రదర్శించింది. ముసలి వానికి చిన్నపిల్లనిచ్చి పెళ్ళిచేయటం వల్ల సమాజంలో ఎన్నో అనర్థాలు జరుగుతాయి. ఈ విషయాన్ని తెలియచేసేదే ఈ పద్యం.

**నీతి :** ముసలివాడికి కుర్ర పెండ్లాం, కోతికి కొబ్బరికాయ లాంటిది.

**Meaning:** Living off borrowed money, having a young wife in old age, depending on the efficiency of a fool, and living in a country where the king does not differentiate between the just and the unjust, are dangerous, and one should keep a distance from these situations as they can cause trouble later.

**Moral:** A person should be wise enough to judge a situation and act accordingly.



**179.** **కమలములు నీటబాసిన**
**కమలాప్తునిరశ్మి సోకి కమలినభంగిన్**
**తమ తమ నెలవులు తప్పిన,**
**తమ మిత్రులె శత్రులగుట తథ్యము సుమతీ.**

**భావం :** పద్మాలు నీళ్లలో వున్నప్పుడు సూర్యకాంతి సోకితే వికసిస్తాయి. అవే పద్మాలు నీటిలో లేనప్పుడు, సూర్యరశ్మి సోకితే మాడిపోతాయి. ఎవరైనా తమతమ స్థానాల్ని వదలిపెట్టి, బైటికి వస్తే వారి మిత్రులే శత్రువులుగా మారిపోతారు. కాబట్టి ఎవరి స్థానంలో వారు భద్రంగా వుండాలి.

**నీతి :** చెట్టుతో వున్నప్పుడే పువ్వు వికసిస్తుంది. వేరుచేస్తే ఎండిపోతుంది.

**Meaning:** Water lilies bloom in water only when sunlight is on them. The same flowers wilt and die when they are taken out of water and the hot sun shines on them. To anyone who moves away from their natural place in life, they find even friends turn into enemies. All should wisely remain in the place life has allotted to them.

**Moral:** A flower blooms only when it is on the tree. If the flower is plucked away from the tree, it fades and dies.



**180. తనయూరి తపసితపమును**
**తన పుత్రుని విద్య పెంపు, తనసతిరూపున్**
**తన పెరటిచెట్టు మందును**
**మనసున వర్ణింపరెట్టి మనుజులు సుమతీ.**

**భావం :** తన గ్రామం వారి కార్యసాధకత్వాన్ని, తన కుమారుని విద్యా సంపదను, తన భార్య రూపలావణ్యాలను, తన పెరటి తోటలోని చెట్టు యొక్క మందు విలువను, ఎవరును, వర్ణించడానికి యిష్టపడరు. ఎందుకంటే అది ఆత్మస్తుతి క్రిందికి వస్తుంది. ఆత్మస్తుతి సజ్జనుని లక్షణం కాదు.

**నీతి :** ఎవరి డబ్బా వాళ్ళు కొట్టుకోకూడదు.

**Meaning:** A person usually hesitates to talk about the achievements of a man of his town, the excellence of his son's education, the beauty of his wife and the benefits of the plants in his garden. It is because it would sound like boasting. Boasting is certainly not the quality of a modest, cultured man.

**Moral:** Never boast of what is one's own.



**181. తన కలిమి, యింద్ర భోగము**
**తన లేమియె సర్వలోకదారిద్ర్యంబున్**
**తన చావు జగత్ప్రళయము**
**తన వలచినయదియె రంభ, తథ్యము సుమతీ.**

**భావం :** అహంకారంతో కండ్లు మూసుకపోయినవాడు, ఊహాలోకంలో విహరిస్తూ తన యింట్లో సంపద యింద్రభోగమనుకొంటాడు. తన యింటి దారిద్ర్యమే లోకానికంతా దారిద్ర్యమనుకొంటాడు. తాను చనిపోతే జగత్తు కంతా ప్రళయం అనుకొంటాడు. తాను ప్రేమించిన స్త్రీయే దేవకాంతయైన రంభ అనుకొంటాడు. అహంకారం దిగినప్పుడు ఇవన్నీ తారుమారౌతాయి. కాబట్టి మనిషికి అహంకారం ఉండరాదు.

నీతి : ఈ ప్రపంచంలోని సంపదలన్నీ తన కోసమే సృష్టింపబడ్డాయనుకొంటాడు అహంకారి.

**Meaning:** A vain, arrogant man truly imagines that his home is a divine palace, his poverty is the misery of the whole world, and his death would herald the end of the world. He believes that the woman he loves is as beautiful as the divine nymphs in heaven. When his vanity and arrogance come down everything changes. It is never wise to be proud and arrogant and live in a world of illusion.

nymphs = అప్సరస

**Moral:** An arrogant man is under the illusion that all the good things in life have been created for him alone.

Illusion = deceptive appearance



**182.** **విదిలింపనురుకు, సింగపు**
**గొదమయు, మదమలిన గండకుంజరములపై**
**నిది బలశాలికి నైజము**
**గద, తేజోనిధికి వయసు కారణమగునే?**

**– భర్తృహరి**

**భావం :** ఒక సింహం పిల్ల, మదించిన యేనుగును చూస్తే, దాని మీదికి వురికి చంపడానికి ప్రయత్నిస్తుంది. ఇది బలశాలికి సహజమైన లక్షణం. వయస్సుతో సంబంధం లేనిది శౌర్యం.

**నీతి :** వయస్సుకు శౌర్యానికి సంబంధం లేదు.

**Meaning:** A lion cub will not hesitate to attack an elephant, without any fear. This is a natural instinctive action of a brave mighty creature. Heroic, valiant acts have nothing to do with age.

**Moral:** Courage and age have nothing to do with one another.



**183.** **క్షమకవచంబు, క్రోధ మదిశత్రువు, జ్ఞాతి హుతాశనుండు, మి**
**త్రము దగుమందు, దుర్జనులు దారుణ పన్నగముల్, సువిద్య వి**
**త్త, ముచితలజ్జ భూషణ, ముదాత్త కవిత్వము రాజ్య మీ, క్షమా**
**ప్రముఖ పదార్థముల్ గలుగు పట్టున తత్కవచాదు లేటికిన్.**

**– భర్తృహరి**

**భావం :** ఓర్పు కవచం లాంటిది, కోపం శత్రువు, దాయాది నిప్పులాంటివాడు. మిత్రుడు మంచి ఔషధం. దుర్జనులు సర్పము లాంటివారు. మంచి విద్య, చేతిలో వున్న ధనం వంటిది. వినయం భూషణం. సుకవిత్వం రాజ్యం ఇన్ని సంపదలు కలవానికి వేరే రక్షణ కవచం అక్కరలేదు.

**నీతి :** సజ్జనునికి, అతని సద్గుణాలే రక్షణ కల్గిస్తాయి. వేరే రక్షణ అవసరం లేదు.

**Meaning:** Patience is like an armour that protects. Anger is an enemy that destroys. A rival to inheritance is like a spark of fire. A friend is like a balm. Evil men are like snakes. Good education is a treasure in hand. Modesty is an ornament. Good poetry is like a kingdom. One who possesses these does not need any other protective shields.

**Moral:** Virtues give a good man full protection. He does not need any other armour.



**184.** **రాకొమరుల్ రసజ్ఞని దిరంబుగ మన్నన నుంచినట్లు భూ**
**లోకమునందు మూఢు, దమ లోపల నుంపరు నిక్కమే కదా!**
**చేకొని ముద్దుగా జదువు చిల్కను బెంతురు గాక పెంతురే**
**కాకము నెవ్వరైన, శుభకారణ, సన్ముని సేవ్య భాస్కరా!**

**భావం :** రాజసభలో రాజకుమారులు రసజ్ఞులైన వారినే గౌరవిస్తారు కాని మూఢులను దగ్గరకు రానీయరు. ఎవ్వరైనా ముద్దు మాటలు పలికే రామచిలుకను పంజరంలో వుంచి పెంచుకొంటారు కాని, కాకిని పెంచరు కదా!

**నీతి :** కనకాన్ని యింట్లో వుంచుకొంటారు గాని కసువును వుంచుకోరు.

**Meaning:** In a royal court, kings patronize, only scholars and people with merit. They do not allow ignorant foolish people to come close to be favoured. One may wish to keep a parrot in a cage to enjoy its delightful chatter. No one would wish to have a crow for a pet.

**Moral:** One would like to keep gold at home but not rubbish.



**185.** **దానము భోగము నాశము**
**పూనికతో మూడుగతులు భువి ధనమునకున్,**
**దానము భోగము నెరుగని**
**దీనుని ధనమునకు గతి తృతీయమె తలపన్.**

**– భర్తృహరి**

**భావం :** ధనానికి దానం చేయడమో, అనుభవించడమో లేదా పోగొట్టుకోవడమో అనే మూడు అవస్థలు ఉంటాయి. దానం చేయక, అనుభవించక వుండేవాడు ధనాన్ని పోగొట్టుకొంటాడు.

**నీతి :** ధనాన్ని అనుభవించాలి; దానం చేయాలి.

**Meaning:** The three ways money can be used are to give it away in charity, enjoy it or lose it. One who does not give it away in charity or enjoy it is bound to lose it.

**Moral:** Money is meant to be either enjoyed or given away in charity.



**186.** **చెలిమియు పగయును, తెలివియు**
**కలకయు, ధర్మంబు పాపగతియును, పెంపుం**
**తులువతనంబును వచ్చును**
**పలుకుబడిన కాన, పొసగ పలుకగ వలయున్.**

**– ఆంధ్ర మహాభారతం**

**భావం :** స్నేహం గాని, విరోధం గాని, సామరస్యం గాని, వివాదం గాని, ధర్మం గాని, పాపం గాని, సత్ప్రవర్తన గాని, దుష్ప్రవర్తన గాని, మాట్లాడే తీరును బట్టి ఏర్పడుతాయి. అందువల్ల చక్కగా మాట్లాడడం అందరు అలవరచుకోవాలి.

**నీతి :** నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది.

**Meaning:** The manner of speech can determine the way to promote a good bond of friendship or cause enmity, promote amicable co-operation or raise a dispute, can give a fair solution, wound feelings, or show good conduct or bad behavior. All will have to adopt a pleasing way of speaking to keep everyone happy.

**Moral:** If one has pleasant speech, all the people in the world are good to him as he is liked by all



# 13. అహింసా పద్ధతి

**187. హింసతోడ ఎన్నడు సాధింపలేరు విజయం**
**అహింసయే స్థిరశాంతికి అంతిమ శరణం.**

**– మానవగీత**

**భావం :** చరిత్రను పరిశీలిస్తే మనకు కొన్ని నిజాలు తెలుస్తాయి. రాజుల మధ్య ఎన్నో యుద్ధాలు జరిగాయి. తాత్కాలికంగా విజయాలు పొందారు. కాని శాంతిని స్థాపింపలేకపోయారు. కాబట్టి హింసతో ఎన్నడును విజయాన్ని సాధించలేరు. అహింసతోనే స్థిరశాంతి లభిస్తుంది.

**నీతి :** అహింసయే స్థిరశాంతికి అంతిమ శరణం.

**వ్యాఖ్యానం :** నరజాతి చరిత్ర మొత్తం హింసాయుతమైన యుద్ధాలతో నడిచింది. రెండు యుద్ధాల మధ్య నున్న స్వల్పకాలమే శాంతి కాలం అయింది. హింస వల్ల, శాంతిని నెలకొల్పడం సాధ్యం కాని పని. అందుకే గౌతమబుద్ధుడు అహింసా సిద్ధాంతాన్ని లోకానికి బోధించాడు. స్థిరశాంతి కావాలంటే అహింసా మార్గమొకటే శరణ్యం.

**Meaning:** A study of history reveals some truths to us. There have been many battles fought among kings. Some were able to win temporary victories. Yet they were unable to establish peace. It is certain that violence can never earn a true victory. It is only non-violence that can bring permanent peace.

**Moral:** The last refuge for permanent peace can be found only in non-violence.



**188. కత్తితోడ సాధించిన ఘనజయమ్ము**
**మెరయు నొకసారి మేఘాన మెరపువోలె**
**శాంతితోడ పండించిన జయఫలమ్ము**
**నిలిచి వెలుగును మణిదీప కళికవోలె.**

**– మానవ గీత**

**భావం :** కత్తులతో హింసించి సాధించిన విజయం, మేఘంలో మెరుపులాగా క్షణికమైనది. శాంతి మార్గంలో సాధించిన విజయం మణిదీపంలాగా శాశ్వతంగా వెలుగునిస్తుంది.

**నీతి :** హింసతో సాధించే విజయం తాత్కాలికం. శాంతితో సాధించే విజయం శాశ్వతం.

**వ్యాఖ్యానం :** శాంతిని స్థాపించాలనే ఉద్దేశ్యంతో ప్రత్యర్థులపై కత్తులు దూసి యుద్ధం చేసి విజయం సాధించిన వారున్నారు. అట్టి విజయం మేఘంలో మెరుపులాగా క్షణికమైనది. అలా కాకుండా, ప్రత్యర్థులతో శాంతి చర్చలు జరిపి, విజయాన్ని పొందగల్గితే అది శాశ్వతంగా వుంటుంది. అట్టి విజయం మణిదీపం వలె ఎల్లప్పుడు వెలుగును ప్రసరింపచేస్తుంది.

**Meaning:** Any victory won with the sword is like a momentary flash of lightning in the clouds. Victory won through non-violence is peace which is permanent like the light given out by the lustre of a precious gem.

**Moral:** Victory won with violence is temporary whereas victory won with peace and methods of non-violence is permanent.

Lustre = shine



**189.** **కాగినట్టి పాలు మీగడయై తేలు**
**పొంగినట్టి పాలు పొయ్యి పాలు**
**ఆగ్రహమ్ము తెచ్చు అన్ని అనర్థాలు**
**సహనశక్తి యిచ్చు సత్ఫలాలు.**

**– మానవగీత**

**భావం :** పొంగిన పాలు పొయ్యిలో పడిమాడిపోయినట్లు, ఆగ్రహం అనర్థాలను తెస్తుంది. సహనం, కాగిన పాల మీద మీగడ లాగా సత్ఫలితాలనిస్తుంది. కాబట్టి ఆగ్రహం వదిలి, సహనాన్ని ప్రదర్శించి, కార్యాన్ని సాధించుకోవాలి.

**నీతి :** సహనం సర్వ కార్య సాధనం.

**వ్యాఖ్యానం :** ఆగ్రహం పొంగిన పాలవంటిది. పొంగిన పాలు పొయ్యి పాలై వ్యర్థమై పోయినట్లు ఆగ్రహం అనర్థాలకు దారితీస్తుంది. దాని వల్ల ఫలితం వుండదు. ఓర్పు కాగిన పాలపై పేరుకొన్న మీగడ వంటిది. అది యెదుటివారి మెప్పును పొందగల్గుతుంది. సత్ఫలితాలనిస్తుంది. కాబట్టి ఆగ్రహాన్ని అణుచుకొని, సహనంతో ప్రవర్తించి, కార్యాలు సాధించుకోవాలి.

**Meaning:** Milk that boils over into the flame is burnt. Anger is just like that, and brings about a great deal of harm. Patience gives rewards like the cream that spreads over boiled milk. Hence anger and haste should be given up, patience shown, and whatever has to be done can be achieved with ease.

**Moral:** Patience has the ability to win over and achieve anything in this world.



**190.** **కత్తి జూపనెట్లు కమలంబు వికసించు!**
**అరుణకాంతి సోకినపుడు తప్ప,**
**మమత జూపినపుడె మనసు మారును తప్ప,**
**భయము జూపనేమి ఫలము కలుగు.**

**– మానవ గీత**

**భావం :** ఒక వ్యక్తి యొక్క మనసును మార్చాలంటే, మమతను, ప్రేమను చూపాలి కాని భయపెట్టి లాభం లేదు. సూర్యకాంతి సోకినపుడే కాని, కత్తి జూపినపుడు పద్మం వికసించదు కదా!

**నీతి :** మనసును మార్చడం, ప్రేమతోనే సాధ్యం.

**వ్యాఖ్యానం :** మనుషుల మనస్సును మార్చాలంటే వారిపై మమతానురాగాలు చూపాలి. కాని భయం చూపినందువల్ల ఫలితం వుండదు. ఒక సరస్సులో వున్న పద్మం ఉదయించే సూర్యుని కాంతి సోకినప్పుడే వికసిస్తుంది. కాని కత్తి చూపి, భయపెడితే వికసించదు. సమాజంలో పరివర్తన తేవాలనుకొనేవారు, దీనిని గుర్తుంచుకొని ప్రవర్తించాలి.

**Meaning:** To bring about a change of heart one should show love and affection and not use force and intimidation. Only when sunlight falls on the lotus does it bloom. A sword cannot force it to bloom, only sunlight can.

Intimidation = frighten

**Moral:** Only love can bring about a change of heart.



# 14. వేదాంత పద్ధతి

**191.** **ఏమి కొనుచు వచ్చు, నేమి తాగొనిపోవు**
**బుట్టువేళ నరుడు గిట్టువేళ**
**ధనము లెచటికేగు తానేగు నెచటికి?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మనిషి జన్మించినపుడు ఏమి తీసుకొనిరాడు. చనిపోయేటప్పుడు కూడ ఏమి తీసుకొని పోలేడు. ధనం ఎక్కడికి పోతుందో మనిషి యెక్కడికి పోతాడో తెలియదు.

**నీతి :** పుట్టినప్పుడు తెచ్చేది లేదు. చనిపోయేటప్పుడు తీసుకపోయేది లేదు.

**వ్యాఖ్యానం :** మనిషి జీవితకాలంలో తాను సంపాదించిన సంపదలపై వ్యామోహం పెంచుకొంటాడు. తనకు అవసాన కాలం సమీపించినప్పుడు, ఆ సంపదలను వదలిపెట్టి పోవలసివస్తుందని దిగులు పడతాడు. దీనినే భవబంధం అంటారు. మనిషి, తాను జన్మించి, భూమి మీదికి వచ్చినప్పుడు ఏమీ తీసుకొని రాలేదు., తాను మరణించి, భూమిని వదలిపోయేటప్పుడు ఏమీ తీసుకొని పోలేడు. మరణం తర్వాత తాను ఏమౌతాడో తన సంపద యేమౌతుందో అతనికి తెలియదు. ఈ సత్యాన్ని తెలిసికొన్న మనిషి, భవబంధం నుండి మోక్షం పొంది ఆనందంగా వుంటాడు.

**Meaning:** A man brings nothing with him when he is born. He takes nothing with him when he dies. No one knows where he goes from here or where his wealth finally goes.

**Moral:** None brings anything when born nor takes anything while dying.



**192.** **కనగ, సొమ్ము లెన్నొ కనకంబ దొక్కటె**
**పసుల వన్నె లెన్నొ పాలొకటియె**
**పుష్పజాతులెన్నొ పూజ యొక్కటెసుమీ**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** బంగారం ఒకటే. కాని దానితో ఎన్నో సొమ్ముల్ని తయారు చేయవచ్చు. పశువులు ఎన్నో రంగుల్లో వుంటాయి. కాని అవి యిచ్చే పాల రంగు మాత్రం ఒక్కటే. అలాగే పుష్పజాతులెన్నో వున్నాయి. కాని ఆ పూలతో మనం దైవానికి చేసే పూజ ఒక్కటే. దీనిని బట్టి భిన్నత్వంలో వున్న ఏకత్వాన్ని మనం గ్రహించాలి.

**నీతి :** భిన్నత్వంలో, ఏకత్వం వున్నది తెలుసుకో.

**అర్థాలు :** కనగ = చూడగ; పసులు = పశువులు

**Meaning:** Gold remains the same, whatever jewellery is made from it. Cows may be of many colours, black, white, brown or mixed, but the colour of milk is the same. Similarly a variety of flowers are gathered for worship, but no matter whatever flowers are used, worship remains the same. This unity in diversity should be clearly understood.

Unity = of one

Diversity = of many, varied

**Moral:** There is unity in diversity.



**193.** **చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యంబు**
**కొంచెమైన నదియు గొదువ కాదు**
**విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** చిత్తశుద్ధితో మనం చేసిన పుణ్యకార్యం ఎంత చిన్నదైనా, అది పెద్దదానితో సమానం. మఱ్ఱి విత్తనం చాలా చిన్నది. కాని దానిలో మహా వృక్షం ఇమిడి వుంది కదా!

**నీతి :** చిత్తశుద్ధితో చేసే కార్యం, ఎంత చిన్నదైనా పెద్ద ఫలితాన్నిస్తుంది.

**వ్యాఖ్యానం :** ఏ కార్యాన్ని చేసినా, దానిని చిత్తశుద్ధితో చేయాలి. చిత్తశుద్ధితో చేసిన ఎంత చిన్న పనియైనా పెద్ద ఫలితాన్ని యిస్తుంది. ఉదాహరణకు, మఱ్ఱి విత్తనం చాలా చిన్నదిగా వుంటుంది. కాని అందులో మహా వృక్షం ఇమిడి వుంది.

**Meaning:** Even a small action done with a pure heart, is equal to a very important action. The seed of the banyan may be very small, but in it is dormant, a huge banyan tree of the future.

**Moral:** However minor an action, if done with a pure and a sincere heart, will give huge rewards.



**194.** **భూమి నాది యనిన భూమి ఫక్కున నవ్వు**
**దానహీను జూచి ధనము నవ్వు,**
**కదన భీతు జూచి కాలుడు నవ్వును,**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మనిషి చచ్చిపోతే భూమిలో పూడ్చి పెడతారు. అందువల్ల మనిషి, భూమికి సొంతమైపోతాడు. అటువంటప్పుడు, మనిషి భూమి నాదని అంటే భూమి నవ్వకుండా వుంటుందా? ధనం చాల చంచలమైనది. అది యీ దినం నీ దగ్గర వుంటుంది. రేపటికి, యింకొకరి దగ్గరకు చేరుతుంది. అటువంటప్పుడు ధనం నాదని మనిషి చెప్పడం నగుబాటు అవుతుంది. యుద్ధంలో శత్రువులు చంపుతారని భయపడి పారిపోయిన ఒక సైనికుడు ఏదో ఒక రోజు మరణిస్తాడు. మరణాన్ని తప్పించుకోవాలని ప్రయత్నించిన అతన్ని చూచి యముడు నవ్వుతాడు. దీనిని బట్టి, ఈ ప్రపంచంలో ఏ వస్తువు కూడ తన సొంతం కాదని తెలుసుకోవాలి.

**నీతి :** ఈ ప్రపంచంలో ఏదీ నీది కాదు. నీవు వచ్చిపోయే యాత్రికుడవు మాత్రమే.

**అర్థాలు :** కదనభీతుడు = యుద్ధంలో భయపడ్డవాడు; కాలుడు = యముడు

**Meaning:** When a man dies he is buried in the earth. He becomes one with it. When man says "This land is mine" will the earth not be amused at his foolishness? Wealth never stays steady at a single place for too long. Today it is with one man and tomorrow with another. Thus when a man says "This wealth is mine" it is very amusing as he has to leave it one day, ironically, too. A soldier afraid to die in battle deserts the army in the midst of fighting and perhaps dies later. The Lord of Death is certainly amused at a man trying to flee from certain death. This shows there is nothing in this world that really belongs to man.

Desert (verb) = బాధ్యత నుండి పారిపోవుట; Desert (nown) = ఎడారి

**Moral:** Nothing belongs to a man on this earth. He is only a traveller, who comes stays for a while, and leaves after a short sojourn.

Sojourn = temporary stay at a place



**195.** **కలిసి ఆర్జించుకొందము జ్ఞానశక్తి**
**కలిసి జీవింత, మెవరిపై కక్షలేక,**
**కలిసి సాధించుదము, వీర కార్యములను**
**కలిసి, రక్షించుకొందమక్రమము నుండి.**

**– ఈశావాస్య ఉపనిషత్తు**

**భావం :** మనమందరం కలిసి జ్ఞానాన్ని సంపాదించుకొందాం. ఎవ్వరి మీద ద్వేషం లేకుండ కలిసి జీవిద్దాం. ఐకమత్యంతో మహత్కార్యాలను సాధిద్దాం. అక్రమాలనుండి మనల్ని మనం రక్షించుకొందాం. ఇది ఈశావాస్య ఉపనిషత్తు ప్రబోధం.

**నీతి :** అందరూ కలిసి జీవిద్దాం. మనల్ని మనం రక్షించుకొందాం.

**Meaning:** All men should work and earn together. All should live in harmony with no ill-will towards one another. United, they can achieve great things. All should protect themselves from injustice. This is the wisdom of the Isavasya Upanishad.

**Moral:** All should live together and protect one another.



**196.** **పొంగిపోవడు సుఖములు పొందినపుడు**
**క్రుంగిపోడు దుఃఖమ్ము పైకొన్న యపుడు**
**భయము, రాగము క్రోధమ్ము వదలువాడు**
**అవనిలోన స్థితప్రజ్ఞుడనగబరగు.**

**– భగవద్గీత సూక్తి**

**భావం :** సుఖాల్ని పొందినప్పుడు పొంగిపోరాదు. కష్టాలు వచ్చినపుడు క్రుంగిపోరాదు. భయాన్ని, రాగాన్ని, కోపాన్ని వదలిపెట్టాలి. అట్టి గుణాలు కలిగిన వానిని స్థితప్రజ్ఞుడంటారు. ఇది భగవద్గీతా వాక్యం.

**నీతి :** కష్టసుఖాలు, కావడి కుండలు. వాటికి ఎప్పుడూ చలించకూడదు.

**Meaning:** One who is never overjoyed with the good things in life, never loses heart, when troubles overwhelm him. Fear, attachment and anger are discarded by him. Such a one is called a truly steady man. This is a precept of the Bhagavat Gita.

**Moral:** Joy and sorrow should never distrub a steady, enlightened man.



**197.** **పునుగుపిల్లికేల పుట్టించె వాసనల్**
**కనకము తనకేమి కల్లజేసి**
**ఎవరికర్థమౌను ఈ బ్రహ్మచేతలు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** ఒక స్వల్పజీవియైన పునుగు పిల్లిని సువాసనతో సృష్టించినాడు బ్రహ్మదేవుడు. అందరు కోరుకొని భూషణములుగా ధరించే బంగారానికి సువాసన కల్పించలేదు. బ్రహ్మదేవుని చేతలు ఎవ్వరికి అర్థం కానివి.

**నీతి :** సృష్టి రహస్యాలు అర్థం కావు.

**Meaning:** The Lord Brahma has created the small civet cat with its fragrance. Gold which is desired by one and all, to wear as ornaments, has no fragrance. No one can delve deep and understand the acts of the Creator Brahma.

Delve = dig

**Moral:** It is impossible to understand the mysteries of creation.



**198.** **భూమి పేరు వల్ల, పుణ్యక్షేత్రము లాయె**
**వెలయ రాళ్ల వల్ల, వేల్పులాయె**
**నీళ్ల పేరు వల్ల, నిఖిల తీర్థము లాయె,**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** భూమి యొక్క మహత్త్వం వల్ల పుణ్యక్షేత్రాలకు, రాళ్ల శిల్ప వైభవం వల్ల విగ్రహ రూపంలో వున్న దేవతామూర్తులకు, నీళ్ల వల్ల పుణ్యతీర్థాలకు విలువలేర్పడినాయి గాని, వాటికి స్వయంగా విలువలు లేవు.

**నీతి :** భూమి వల్ల పుణ్యక్షేత్రాలు, రాళ్ళ వల్ల దేవతామూర్తులు, నీళ్ళవల్ల పుణ్యతీర్థాలు ఏర్పడ్డాయి అంటే మూల పదార్థమే ముఖ్యమని అర్థం.

**Meaning:** Holy places of pilgrimage are flourishing because of the sanctity and the power of the place, because of the sacred idols of the deities, and the sacred waters of the rivers.

Sacred = holy

**Moral:** Holy places arose because of the place; sculpted idols of divinities have come from the stones and centres of pilgrimages have arisen along the banks of the rivers. The reason why all these have gained importance has to be understood.



**199.** **నియత తపమును నింద్రియ నిగ్రహంబు**
**భూరి విద్యయు శాంతికి కారణములు**
**వాని యన్నింటికంటె మేలైన శాంతి**
**కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర!**

**– ఆంధ్రమహాభారతం**

**భావం :** నిష్ఠతో తపస్సు చేయడం, ఇంద్రియాలను నిగ్రహించడం, ఉన్నత విద్య, శాంతికి కారణాలు. శాంతికి, వాని అన్నింటికంటె మేలైన కారణం లోభాన్ని విసర్జించడం. కాబట్టి శాంతికాముకులు, లోభగుణాన్ని వదలుకోవాలి.

**నీతి :** లోభత్వం వదలుకొంటే శాంతి లభిస్తుంది.

**Meaning:** Performing penance with great devotion, acquiring perfect control over the senses, and deep learning are all for the peace of mind. Above all it is overcoming selfishness that is a must to have peace. Hence those who desire peace must overcome selfishness and engage themselves in selfless service.

**Moral:** If selfishness is overcome, one can enjoy peace of mind.



**200.** **ఎవరి కంటబడక, యెల్లరచేదైవ**
**మన్న పేర పూజలందుకొనుచు**
**అలరుచున్న వాని అద్భుతలీలకా**
**శ్చర్యమందు చుండె సర్వజగతి.**

**– సత్యం శివం సుందరం**

**భావం :** ఎవ్వరికీ కనబడకుండా వుంటూ, అందరిచే పూజలందుకొంటున్న దైవం యొక్క అద్భుత లీలలు చూసి లోకం ఆశ్చర్యపోతున్నది.

**నీతి :** ఎవ్వరికీ కన్పడకుండా, ఎల్లరిచే పూజలందుకొనే దైవం, ఒక మహాద్భుతం.

**Meaning:** Never seen by anyone, but worshipped by all, the Lord remains the ultimate wonder.

**Moral:** God is an enigma and can not be understood by man.

enigma = అర్థం కాని



# 15. సంపూర్ణ నీతిచంద్రిక - నీతి సూక్తులు

**1. గుణవంతులలో ప్రథమగణ్యుడు గాని కొడుకును గన్న తల్లికంటె వేరు గొడ్రాలు గలదా? గుణవంతుడయిన పుత్రుడొకడు చాలును. మూర్ఖులు నూరుగురవలన ఫలమేమి? ఒక రత్నముతో గులకరాలు గంపెడయినను సరిగావు.**

**భావం :** గుణవంతులలో అగ్రగణ్యుడు కాని కొడుకును కన్న తల్లి గొడ్రాలుతో సమానం. గుణవంతుడైన కుమారుడు ఒక్కడైనా చాలు. నూర్గురు మూర్ఖుల వలన ప్రయోజనం లేదు. గులకరాళ్లు గంపెడైనా, ఒక రత్నంతో సమానం కావు.

**నీతి :** బుద్ధిమంతుడైన ఒక బిడ్డ చాలు.

**వ్యాఖ్యానం :** అయోగ్యులైన పుత్రులను గూర్చి తండ్రి పడే బాధను గూర్చి యిక్కడ చెప్పబడింది. పాటలీ పుత్ర నగరాన్ని పాలించే సుదర్శనుడనే రాజు, తన కుమారులు, మూర్ఖులై, విద్యాబుద్ధులు నేర్చుకొనక, ఆటపాటల్లో కాలం వెళ్ళబుచ్చుతూ సోమరులుగా వున్న సమయంలో, వారిని తలంచుకొని, విచారంతో యిలా అంటాడు. గుణవంతులలో ప్రథముడుగాని పుత్రుని కన్నతల్లి గొడ్రాలుతో సమానం. గుణవంతుడైన ఒక పుత్రుడు చాలు అతడు వంశానికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చి పెడ్తాడు. మూర్ఖులు నూరుగురుండి ఫలం లేదు. ఎన్ని గులకరాళ్లైన, ఒక రత్నంతో సమానం కావు.

**Meaning:** A woman can be considered as a barren woman, if her son is not good and honest, and a man of good character. A good son, if he is a man of integrity and honour, it matters very little if he is an only son. It is useless to have a hundred foolish sons. How can a basketful of pebbles be compared in worth, to one precious gem?

**Moral:** It is worth having a single son, if he is good and honourable rather than having a hundred worthless sons.



**2. బిడ్డలకు విద్యాభ్యాసము చేయింపమి తల్లిదండ్రుల దోషము. తల్లిదండ్రులచేత శిక్షితుండయి బాలుడు విద్వాంసుడగును గాని, పుట్టగానే విద్వాంసుడు గాడు. పురుషకారము చేత గార్యములు సిద్ధించును. రిత్త కోరికలచేత సిద్ధింపవు. నిద్రించు సింహము నోర మృగములు తమంత వచ్చి చొరవు.**

**భావం :** నిద్రించే సింహం ఆహారాన్ని సంపాదించుకోలేదు. ఆ సింహం నోటి దగ్గరకు జంతువులు తమంత తాము వచ్చి చేరవు. పురుష ప్రయత్నం లేకుండా కార్యాలు సిద్ధింపవు. బిడ్డ పుట్టగానే విద్వాంసుడు కాలేడు. తల్లిదండ్రులు ఆ బిడ్డకు విద్యాభ్యాసం చేయించాలి. చేయించకుండా వుండటం తల్లిదండ్రుల తప్పవుతుంది.

**నీతి :** ప్రయత్నం లేకుండా, ఏ పనీ సాగదు.

**వ్యాఖ్యానం :** తమ పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పించడానికి తల్లిదండ్రులు శ్రద్ధ వహించక పోవడం వారి తప్పవుతుందని యిచ్చట తెలియచేయబడింది. పిల్లలు అప్రయోజకులవుతున్నారని తల్లిదండ్రులు, ఊరక చింతించి ఉపయోగం లేదు. వారిని మంచి గురువు దగ్గర చేర్పించి విద్యాబుద్ధులు నేర్పించడం తల్లిదండ్రుల బాధ్యత. ప్రయత్నం లేకుండ, ఏ పని సాగదు. ఉదాహరణకు నిద్రించే సింహం నోటి దగ్గరకు, మృగాలు తమంత వచ్చి ఆహారం కావు గదా. ఈ విధంగా చింతించిన సుదర్శనుడనే రాజు, తన కుమారులకు నీతి బోధ చేయమని విష్ణుశర్మను ప్రార్థిస్తాడు. విష్ణుశర్మ, మిత్రలాభం, మిత్రభేదం, విగ్రహం, సంధి అనే విషయాలను, పక్షుల్ని, జంతువుల్ని పాత్రలుగా చేసి, వినోదపూరితంగా కథల ద్వారా వినిపించి, నీతిని బోధిస్తాడు.

**Meaning:** A sleeping lion cannot hope to get its food. Animals cannot, and will not walk into its mouth. No man can earn or achieve without effort. A child cannot straight away become a scholar, right at birth. The parents have to educate the child with care. Imparting education to a growing child is the prime duty of the parents. They fail in their duty if they do not do so.

**Moral:** Nothing can be achieved without effort



### 3. ఈర్ష్యాళువు, జుగుప్సావంతుడు, నిస్సంతోషి, క్రోధనుడు, నిత్యశంకితుడు పరభాగ్యోప జీవియు ననువా రారుగురు దుఃఖబాగులని నీతికోవిదులు చెప్పుదురు.

**భావం :** ఒకరు బాగుంటే చూడలేని ఈర్ష్యాపరుడు, వేషంలో భాషలో రోతగా వుండి, యితరులకు అసహ్యం కల్గించే జగుప్సావంతుడు, ఏమిచ్చినా, ఎంత యిచ్చినా తృప్తి లేకుండా వుండే నిస్సంతోషి, ఎప్పుడును కోపంతో వుండే క్రోధనుడు, అన్ని విషయాలలో ఎల్లప్పుడు సందేహం వెలిబుచ్చే నిత్యశంకితుడు, ఒకరి సాయం మీద ఆధారపడి బ్రదికే పరభాగ్యోపజీవి. ఈ ఆరుగురు ఎప్పుడు దుఃఖంలో వుంటారని పెద్దలు చెబుతారు.

**నీతి :** దుర్గుణాలు వదలకపోతే దుఃఖం పాలౌతారు.

**వ్యాఖ్యానం :** ఇది మిత్రలాభంలోని కథ. ప్రయోజనం లేని సందేహాలతో నోటికందిన కూటిని మానుకొనే నిత్య శంకితుడు దుఃఖం పాలౌతాడని యిక్కడ చెప్పబడింది. కొన్ని పావురాలు అడవిలో ఎగురుతూ వుండగా క్రింద నేల మీద కొన్ని నూకలు కనపడ్డాయి. ఇందులో ఏదో మోసముందని నూకలకాశపడవద్దని పావురాల నాయకుడు చిత్రగ్రీవుడంటాడు. కాని ఒక ముసలి పావురం నవ్వి, వృద్ధుడైన నా మాట వినండి. అర్థం లేని సందేహాలకు పోయి నోటికందిన ఆహారాన్ని వదలుకోవద్దని చెపుతుంది. ఈర్ష్యాపరుడు, వేషభాషల్లో రోతగా వుండేవాడు, దేనికిని తృప్తిపడని వాడు, ముక్కుమీదనే కోపం వుండేవాడు. ఇతరులపై ఆధారపడి జీవించేవాడు, ప్రతిదానికి సందేహం వెలిబుచ్చేవాడు. దుఃఖం పాలౌతారని చెప్తుంది.

**Meaning:** A man full of jealousy, a man who is unkempt in appearance, always miserable, ill-tempered, forever doubting everything and always dependent on others for his needs, are the six types of unpleasant men can never find happiness.

**Moral:** An immoral man who has no control over himself can never be happy.



## 4. ఎవ్వడు బుద్ధిమంతుడో వాడు వృద్ధుడు గాని, యేండ్లు మీరిన వాడా వృద్ధుడు?

**భావం :** ఏండ్లు పైబడినంతమాత్రాన, ఒకణ్ణి వృద్ధుడనలేము. ఎవడైతే బుద్ధిమంతుడో, అతన్ని వృద్ధుడని పిలవాలి. వృద్ధుడంటే జ్ఞానంలో వృద్ధుడు గాని వయస్సులో కాదు.

**నీతి :** జ్ఞానవృద్ధుడే వృద్ధుడు.

**వ్యాఖ్యానం :** ముసలి పావురం మాటలు విని నూకల కోసం క్రింద వ్రాలి, అక్కడ వేటకాడు పరచివున్న వలలో పావురాలు చిక్కుకొంటాయి. అవి ముసలి పావురాన్ని చూచి, నీవు వృద్ధుడవు తెలిసినవాడవని నమ్మి నీ మాటలు విని, యీ కష్టం తెచ్చుకొన్నాం. ఎవ్వడు బుద్ధిమంతుడో వాడు వృద్ధుడు గాని, ఏండ్లు వచ్చినవాడు వృద్ధుడు కాదు అని నిందిస్తాయి.

**Meaning:** Growing in years does not always mean that a man is mature in thought. Only a wise man, is mature in his thought and behavior. It is not with age but with wisdom that a man's maturity can be determined.

**Moral:** Only a wise man is a mature in his thinking.



## 5. తన్ను మాలిన ధర్మము, మొదలుచెడ్డ బేరము.

**భావం :** తనను తాను రక్షించుకోలేని వాడు, ఇతరులను రక్షించబూనడం అసలుకే మోసం. నీటిలో మునిగిపోతున్న ఒక వ్యక్తి, నీళ్లలో మునిగిపోతున్న మరొక వ్యక్తిని కాపాడబూనడం ఇటువంటిదే.

**నీతి :** నిన్ను నీవు రక్షించుకోలేకపోతే, ఇతరులను రక్షించలేవు.

**వ్యాఖ్యానం :** ఐకమత్యంతో సమర్థమైన, నాయకత్వంతో పనిచేస్తే విజయం లభిస్తుందని యిక్కడ చెప్పబడింది. ముసలి పావురాన్ని నిందిస్తున్న పావురాలతో, పావురాల నాయకుడిలా అంటాడు. ముసలి వానిని నిందించి వుపయోగమేముంది. ప్రస్తుత కర్తవ్యం ఆలోచించండి. అందరము ఒక్కసారిగా వలయెత్తుకొని ఎగిరిపోదాం. అప్పుడు పావురాలన్ని వలయెత్తుకొని ఆకాశంలోకి ఎగిరిపోయి, పావురాల నాయకుని మిత్రుడైన హిరణ్యకుడనే ఎలుక రాజు కలుగు దగ్గర ఆగుతాయి. వలను కొరికి ముందుగా తన ఆశ్రితులైన పావురాలను విడిపించి తర్వాత తనను విడిపించమని పావురాల నాయకుడు ఎలుక రాజును అడుగుతాడు. అందుకు, తన్నుమాలిన

ధర్మం మొదలు చెడ్డబేరం గలదా అని, ఎలుకరాజు ప్రశ్నిస్తాడు. ఉత్తముడైనవాడు. తన జీవితాన్నైనా మానుకొని, మంచివారిని రక్షించవలెగదా అని చిత్రగ్రీవుడంటాడు. ఎలుకరాజు తన పండ్లతో వలను మొత్తం కొరికి అన్ని పావురాలను విడిపిస్తాడు.

**Meaning:** If a man neglects to help himself, it is foolish to presume, that he can help others.

Presume = take for granted

**Moral:** If one cannot take care of himself he cannot help others.



**6. అర్థపరిహీనునకు నిరంతరము ఖేదము సంభవించును. నిరంతర ఖేదము వలన బుద్ధి హీనత్వము ప్రాప్తించును. బుద్ధిహీనత వలన సమస్త కార్యములు నిదాఘనదీపూరము లట్లు వినాశము నొందును. ధనవంతునకే పౌరుషమును, మేధాసంపత్తియు, బంధుమిత్రులును గలుగుదురు.**

**భావం :** ధనం లేని వానికి దిగులు పట్టుకుంటుంది. దిగులు వల్ల, బుద్ధి నశిస్తుంది. బుద్ధి నశించినందువల్ల అతడు చేసే పనులన్నీ, వేసవి కాలంలో ఏట్లో ఎండిపోయిన నీళ్ల లాగా నష్టమైపోతాయి. కాబట్టి ధనమున్న వానికే పౌరుషం, బంధువులతో సహవాసం ఏర్పడుతాయి.

**నీతి :** 'ధన మూల మిదం జగత్' అని తెలుసుకోవాలి.

**వ్యాఖ్యానం :** ధనం పోగొట్టుకొన్నవాడు, ఎట్టి ఖేదానికి గురి అవుతాడో యిక్కడ చెప్పబడింది. ఉదాహరణకు, పావురాలను వల నుండి తప్పించిన ఎలుక రాజు హిరణ్యకుడు ధనం పోగొట్టుకొని ఎలా దీనస్థితికి దిగజారాడో యిక్కడ చెప్పబడింది. లఘుపతనకమనే కాకి, ఎలుక రాజైన హిరణ్యకుని, స్నేహాన్ని కోరుతుంది. కాకి, ఎలుక స్నేహితులౌతారు. వారిద్దరు మంచి ఆహారం దొరికే స్థలంలో వున్న మంథరుడనే పేరు గల తాబేలు వద్దకు చేరుకొంటారు. కాకి, ఎలుక, తాబేలు కలిసి స్నేహంతో జీవిస్తుంటాయి. తాబేలు, ఎలుక యొక్క పూర్వ వృత్తాంతాన్ని అడిగి తెలుసుకొంటుంది. ఎలుక, చూడాకర్ణుడనే సన్యాసి ఆశ్రమం దగ్గర కలుగులో నివసిస్తుండేది. ఆ కలుగులో చిరకాలంగా సంపాదించిన ఆహారాన్ని నిలువచేసు కొన్నది. చూడాకర్ణుడు తినగా మిగిలిన ఆహారాన్ని ఒక చిలుక కొయ్య మీద పెట్టేవాడు. ఎలుక చిలుక కొయ్య మీదికి ఎగిరి, ఆ ఆహారాన్ని తింటుండేది. ఎలుకకు, అంత పైకి ఎగిరే శక్తి రావడానికి కారణం అది కలుగులో కూడబెట్టుకొన్న ఆస్తి అని గ్రహించిన సన్యాసి, కలుగును త్రవ్వి ఆస్తిని తీసుకుంటాడు. దగ్గరకు వచ్చిన ఎలుకను కర్రతో కొట్టజూస్తాడు. ఈ విధంగా ఆస్తిని కోల్పోయిన ఎలుక దీనస్థితికి దిగజారుతుంది.

**Meaning:** A poor man is a worried man. His worry causes him anxiety and he cannot really think clearly. As he is unable to plan properly, whatever he undertakes ends in failure. All his attempts fail, like water in a river drying up in summer. This verse makes it clear, that only a man, who has wealth is able to win the respect of all.

**Moral:** Wealth is vital to live in this world.



**7. సంసార విష వృక్షమునకు రెండు ఫలము లమృత తుల్యములు. కావ్యామృత రసపానమొక్కటి సజ్జన సంగతి యొకటి.**

**భావం :** సంసార జీవనమనేది బహు కష్టాలతో కూడుకొన్నది. ఇది విష వృక్షం లాంటిది. అయినా దానికి అమృతంలాగా మధురమైన రెండు ఫలాలున్నాయి. మొదటిది మంచి కవితను చదివి అందలి రసాన్ని ఆస్వాదించడం, రెండవది సజ్జనులైన వారితో స్నేహం చేయడం. ఈ రెండు మనిషికి మహదానందాన్ని కల్గిస్తాయి.

**నీతి :** కవితలు చదువుకో, సజ్జనులను కలుసుకో.

**వ్యాఖ్యానం :** తాబేలు, సహవాసం వల్ల సుఖజీవనాన్ని పొందిన ఎలుక, తాబేలుకు కృతజ్ఞత తెలియచేస్తూ, సంసార విషవృక్షానికి, సత్కవితను వినడం, సజ్జనుల సాంగత్యాన్ని పొందడం రెండు అమృత ఫలాలని చెప్తుంది.

**Meaning:** Mundane existence in this world is like a tree of poison. Strangely it puts forth two wonderful fruits as sweet as nectar. One is the ability to read and enjoy beautiful poetry, and the other is the opportunity to have the company of good and great men. Both give immense happiness to any human being.

Mundane existence = worldly, earthly

Puts forth = puts forward

Nectar = sweet to taste

Immense = vast, unlimited

**Moral:** Learn to enjoy beautiful poetry and the company of great men.



**8. పురుషుడెవ్వడు క్రియావంతుడో వాడు విద్వాంసుడు.**

**రోగుల కౌషధము పేరు చెప్పిన మాత్రమున రోగశాంతి గాబోదు. వివేకహీనునికి శాస్త్రజ్ఞానము గ్రుడ్డివానికి స్వహస్త దీపమువలె నిష్ఫలము.**

**భావం :** క్రియాశీలత వల్లనే కార్యం సాధించవచ్చు. మందు పేరు చెప్పినంత మాత్రాన రోగి జబ్బు నయం కాదు. చేతిలో దీపమున్నా, గ్రుడ్డి వాడు చూడలేడు. అలాగే శాస్త్ర జ్ఞానం వున్నా, వివేకం లేనివాడు దానిని ఉపయోగించుకోలేడు.

**నీతి :** శాస్త్రజ్ఞానాన్ని సరైన విధంగా ఉపయోగించినప్పుడే ప్రయోజనం ఉంటుంది.

**వ్యాఖ్యానం :** క్రియాశీలత్వం యొక్క ప్రయోజనాన్ని గూర్చి యిచ్చట చెప్పబడింది. తాబేలు తనతో సహవాసం చేస్తున్న యెలుకకు హితాన్ని, యిలా ఉపదేశిస్తుంది. మిత్రమా! గతాన్ని త్రవ్వకొని నీవు దిగులు పడవద్దు. సదా నీవు ఉత్సాహంతో వుండాలి. శాస్త్రం చదివితే సరిపోదు. క్రియాశీలివై ప్రతికార్యంలో విజయం సాధించాలి. వివేకహీనుడికి శాస్త్రజ్ఞానం గ్రుడ్డివాని చేతిలో దీపం వలె నిష్ప్రయోజనం అంటూ క్రియాశీలత యెట్టిదో క్రింది విధంగా ఎలుక చేసి చూపిస్తుంది. తాబేలు, ఎలుక, కాకి నివసిస్తున్న ప్రదేశానికి వేటకానితో తరుమబడ్డ చిత్రాంగుడనే జింక వచ్చి వారి ఆశ్రయం కోరుతుంది. వారు జింకకు ఆశ్రయమిస్తారు. అప్పటి నుండి నలుగురు కలిసి హాయిగా వుంటారు. ఒకనాడు జింక, దూరంగా వున్న పంటచేలో మేయడానికి పోయి వేటకాని వలలో చిక్కుకుంటుంది. జింక నివాసానికి రాలేదని విచారంతో, కాకి జింకను, వెదకడానికి పోయి, వలలో చిక్కుకొన్న జింకను చూస్తుంది. వెంటనే కాకి, తమ నివాసానికి తిరిగి వచ్చి, ఎలుకను తన మీద ఎక్కించుకొనిపోయి, దానితో వలను కొరికించి, జింకను విడిపిస్తుంది. జింక, కాకి, ఎలుక, తమ నివాసానికి బయలుదేరుతాయి. జింక వల నుండి తప్పించుకొన్న సంగతి తెలిసిన వేటకాడు, జింకను పట్టుకోవడానికి వాటి వెంట వస్తుంటాడు. ఈ లోపల తన మిత్రులైన కాకి, ఎలుక, జింక నివాసానికి రాలేదని విచారంతో తాబేలు బయలుదేరి వారికి ఎదురుగా పోతుంది. మిత్రుల్ని కలుస్తుంది. ఇంతలో వేటకాడు దగ్గరకు రావడం చూచిన, కాకి ఆకాశంలోకి ఎగిరిపోతుంది. జింక పరుగెత్తిపోతుంది. ఎలుక ఒక కలుగులో దూరుతుంది. తాబేలు పరుగెత్తలేదు. కాబట్టి వేటకానికి చిక్కుతుంది. వేటకాడు తాబేలును వింటి కొనకు కట్టుకొని యింటికి బయలుదేరుతాడు. తాబేలును కాపాడడానికి, ఎలుక, కాకి, జింక కలుసుకొని ఆలోచిస్తాయి. ఎలుక ఒక ఉపాయం చెప్తుంది. జింకను జూచి, నీవు వేటకాని కంటే ముందు పోయి వాని దారిలో ఒక సరస్సు వద్ద నాల్గు కాళ్ళు చాచుకొని చచ్చినట్లు పడియుండు. కాకి, నీమీద కూర్చుండి కన్నులు పొడుస్తున్నట్లు నటిస్తూ అరుస్తూ ఉంటుంది. అప్పుడు వేటకాడు జింక చచ్చి వున్నదని భావించి, తాబేలును కట్టియుంచిన వింటిని నేల మీద పెడ్తాడు. వెంటనే నేను తాబేలును కట్టియున్న తాడును తెగ గొరుగుతాను. అంత తాబేలు సరస్సులో జొరబడుతుంది. నేను కలుగులో దూరుతాను. మీరు పారిపొండి. ఇది నాకు తోచిన ఉపాయమంటుంది. అది విన్న జింక, కాకి, తాబేలు ఆ ప్రకారం పనిచేస్తాయి. ఎలుక తన పని చేస్తుంది. ఈ విధంగా మిత్రులు నలుగురు తమ క్రియాశీలత్వంతో ఆపద నుంచి తప్పించుకొంటారు. మిత్ర లాభమంటే యిదే.

**Meaning:** Any task can be completed successfully if it is done sincerely, giving great thought to how best to do it. Just knowing the name of a medicine does not cure a sick man. A blind man cannot see, even if he holds a lamp in his hands. Similarly a man may have a good knowledge of theory. It is useless if he does not know how to apply it and put it to use.

**Moral:** One should know how to make the best use of knowledge.



## 9. సేవావృత్తిచే వచ్చు పాయసము కంటె స్వచ్ఛంద వృత్తిచే లభించు గంజి మేలు.

**భావం :** సేవకుడుగా పనిచేసి సంపాదించుకున్న పాయసం కంటే స్వతంత్రంగా జీవించి సంపాదించిన గంజి మేలు.

**నీతి :** నీ కాళ్ళపై నీవు నిలబడు.

**వ్యాఖ్యానం :** స్వచ్ఛంద వృత్తి, సేవావృత్తి కంటే గొప్పదని యిక్కడ చెప్పబడింది. ఇది మిత్రబేధంలోని కథ. పింగళకుడనే సింహం అడవికి రాజు. ఆ సింహం ఒక రోజు ఒక ఎద్దు రంకె విని, ఎవరో తనకు ప్రత్యర్థిగా వచ్చాడని భయపడుతుంది. కరటక దమనకులనే రెండు నక్కలు, సింహానికి ఆ భయం పోగొట్టి అతని కొలువులో ఉద్యోగం సంపాదించాలని ఆలోచిస్తాయి. కరటకుడు దమనకునితో 'రాజులను నమ్మకూడదు కడుపు కూటి కోసం మన శరీరాలను పరులకు అమ్ముకొనడం హేయమైన పని. పరులకు సేవ చేస్తే వచ్చే పాయసం కన్నా, స్వయంగా శ్రమించి ఆర్జించుకునే గంజి మేలు' అని చెప్తుంది.

**Meaning:** A man may earn rich delicacies to eat, by serving a master. Humble food earned with independent effort can taste much better and is to be preferred.

**Moral:** Standing on one's own feet is always a better choice.



## 10. ఉద్యోగికి దూరభూమియు, విద్వాంసునకు బరదేశమును, బ్రియవాదికి శత్రువును లేనియట్లు బుద్ధిమంతునకసాధ్య మొకటి లేదు.

**భావం :** దూరం అనకుండ ఉద్యోగం ఎక్కడ వుంటే అక్కడికి ఉద్యోగి వెళ్లి తన విధుల్ని నిర్వహించగలడు. విద్వాంసుడు ఏ దేశానికి పోయినా అక్కడ తన విద్యతో చలామణి అవుతాడు. ప్రియంగా మాట్లాడేవానికి శత్రువులుండరు. అలాగే బుద్ధిమంతునికి అసాధ్యం అనేది ఉండదు.

**నీతి :** అందరూ బుద్ధిమంతులై అన్నిటినీ సాధించుకోవాలి.

**వ్యాఖ్యానం :** బుద్ధిమంతునికి అసాధ్యం అనేది వుండదని యిక్కడ చెప్పబడింది. రాజసేవ చేయాలనుకొన్న దమనకుడు, కరటకునితో, రాజసేవకు కావలసిన అర్హతలను గూర్చి యిలా చెప్తాడు. ఉద్యోగికి దూరభూమి లేదు. విద్వాంసునికి పరదేశము లేదు. ప్రియంగా మాట్లాడేవానికి శత్రువు లేదు. బుద్ధిమంతునికి అసాధ్యమైనది ఏదీ లేదు. కాబట్టి మనం రాజు అనుగ్రహం సంపాదించి, అతని కొలువులో చేరదాం అంటాడు.

**Meaning:** A Man pursuing his duties as an employee does not mind the distance to place he has to work in, be it near, or be it far. A learned and a skilled man is happy wherever his expertise is admired and honoured, anywhere in the world. A person, who has love in his heart and speech, has no enemy anywhere. Nothing is impossible to an intelligent man.

**Moral:** All should learn and acquire sharp skills in grasping, thinking and reasoning, that is, the skills of the intellect, and achieve all that they set out to do.



**11. బహుదేశాటనంబును, బహుశ్రుతుల తోడ నిరంతర సాంగత్యంబును, గావ్య శాస్త్ర విచారంబును రాజాస్థానంబుల బహుకాలసేవనంబు బురుషున కెట్టివానికేని వివేకంబు పుట్టింప సమర్థంబులయి యుండు.**

**భావం :** బహుదేశాలలో పర్యటించుట వల్ల, సర్వజ్ఞులైన నిపుణులతో సాంగత్యం ఏర్పరుచుకొన్నందువల్ల కావ్యాలను, శాస్త్రాలను చదువుట వల్ల, రాజుల ఆస్థానాలలో చాలాకాలం సేవ చేయడం వల్ల పురుషుడెట్టి వాడైనా వివేకవంతుడౌతాడు.

**నీతి :** ఒక మేధావితో సంభాషణ, వేయి గ్రంథాల పఠనంతో సమానం.

**వ్యాఖ్యానం :** పురుషుడే విధంగా వివేకవంతుడౌతాడో యిక్కడ చెప్పబడింది. దమనకుడు అడవికి రాజైన సింహం దగ్గరకు వెళ్ళి, సింహం యొక్క రాజ్యపాలనను పొగడుతాడు. తనను తన మిత్రుని కరటకుని కొల్వులో చేర్చుకొంటే, రంకెవేసిన ఆ జంతువుకు రాజుకు స్నేహం ఏర్పరుస్తామని చెప్తాడు. ఆ సందర్భంగా దమనకుడు రాజుతో బహుదేశాలు తిరుగుట వల్ల పండితులతో సహవాసం చేయుట వల్ల, కావ్యాలను, శాస్త్రాలను చదువుట వల్ల, రాజాస్థానాలలో చాల కాలం సేవలందించుట వల్ల ఎటువంటి వానికైన వివేకం కల్గుతుంది. అది లేనివాడు బావిలోని కప్పలాంటివాడు, అని విన్నవిస్తాడు. ఈ విధంగా సింహానికి తాము వివేకవంతులమని చెప్పి మంచి చేసుకొని కరటక దమనకులు సింహం కొలువులో చేరిపోతారు.

Meaning: A man who has travelled widely and has spent much time in the company of highly educated and skilled men of fame, one who has read all the texts, scriptures and literature, or one who has served for a long time in the courts of kings, is bound to emerge as very wise and shrewd man, no matter who he is or how he has been in his early life.

Shrewd = sharp, intelligent

**Moral:** Conversation with a profound scholar is eual to reading a thousand books.



**12. కుట్టిన దేలండ్రు, కుట్టకున్న గుమ్మరపురువండ్రు గాదె?**

**భావం :** తేలు, కుమ్మరి పురుగు ఒకేలాగా కన్పిస్తాయి. ఏదైతే కుట్టుతుందో దానిని తేలంటారు. ఏదైతే కుట్టలేదో దానిని కుమ్మరి పురుగంటారు. అలాగే ఎవడైతే సమస్యను ఎదుర్కొంటాడో అతణ్ణి సమర్థుడంటారు. ఎదుర్కోలేనివాణ్ణి అసమర్థుడంటారు.

**నీతి :** బుస్సుమంటేనే పామును గుర్తిస్తారు.

**వ్యాఖ్యానం :** బలవంతుడైయుండి, బలం ప్రదర్శించని వీరుణ్ణి లోకం ఎలా చులకనగా చూస్తుందో యిక్కడ చెప్పబడింది. ఉదాహరణకు ఒక కథ చెప్పబడింది. ఒక సింహం అడవిలోని జంతువుల్ని, యిష్టానుసారంగా చంపి తింటుంది. అందుకు భయపడిన జంతువులు, సింహం దగ్గరకు వెళ్ళి, వంతుల ప్రకారం ఒక్కొక్క మృగాన్ని సింహానికి ఆహారంగా ఒక్కొక్క రోజు పంపించేందుకు ఒప్పందం చేసుకొన్నాయి. ఆ వంతు ఒకనాడు ఒక కుందేలుకు వచ్చింది. ఆ కుందేలు సింహం బారి నుండి తప్పించుకోవడానికి ఉపాయం ఆలోచించి, సింహం దగ్గరకు చాలా ఆలస్యంగా వెళ్తుంది. అప్పుడు సింహం కోపంతో మండి పడి యిలా అంటుంది. నేను మృగాల మీద దయదలచి వంతుల ప్రకారం ఆహారం పంపించేందుకు ఒప్పుకొన్నాను. అది నా బలహీనతగా తలచి నీవు ఆలస్యంగా వచ్చావు. ఇక ముందు జంతువుల్ని నా యిష్టానుసారం చంపి తింటాను, 'కుట్టితే తేలు, కుట్టకుంటే కుమ్మరిపురుగు' అని నన్ను చులకనగా చూచినందుకు మిమ్మల్ని శిక్షిస్తాను అని కుందేలుపై దూకుతుంది.

**Meaning:** A scorpion and a beetle look alike. The one that stings is known as a scorpion and the one that does not, is known as a beetle. Similarly a man who courageously solves his problems is known as an achiever and a successful man, and the one who is unable to face and solve his problems is known as a failure in life.

**Moral:** Only if a creature hisses, it can be recognized as a snake.



## 13. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధన' మ్మని ప్రాజ్ఞులు వక్కాణింతురు. భృత్యుండు స్వామి కార్య హిత ప్రాణుండయ్యేనేని నాకలోకసుఖం బనుభవించును.

**భావం :** శరీరం వున్నది ధర్మాన్ని సాధించడానికే. ఒక సేవకుడు విశ్వాసంతో యజమాని యొక్క కార్యాన్ని నిర్వహించుటలో ప్రాణాలు కోల్పోతే అతనికి స్వర్గ ప్రాప్తి లభిస్తుంది. అంటే ధర్మ సాధనకై తన శరీరాన్ని త్యాగం చేసినవాడు లోకానికి ఆరాధ్యుడౌతాడు.

**నీతి :** స్వామి కార్యానికై శరీర త్యాగం చేసినవాడు చరితార్థుడు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ రాజభక్తిని గూర్చి చెప్పబడింది. మానవుడు రాజుకు సేవ చేయుటలో, తన శరీరాన్ని ధర్మ సాధనంగా ఉపయోగించాలి. ప్రాణ త్యాగానికి సిద్ధ పడాలి. అప్పుడే అతని జన్మ సార్థకమౌతుంది.

**Meaning:** This human body has been given to man to serve the cause of the right and the just. When a man serves his master faithfully and were to lose his life in this service, he is sure to go straight to heaven. Thus a man who has sacrificed his life for the sake of duty, is a man who has died for what is right. Such a man is loved and honoured by all.

**Moral:** Any man, who sacrifices his life while serving his master, is remembered forever as a hero.



**14. అర్థంబు సకల పురుషార్థ సాధనంబు, ధనమునకు దుస్సాధ్యం బొక్కండు లేదు. లోకులు కులవిద్యా రూపగుణ విహీనునేని ధనవంతుని సర్వ సంపన్నుండని వచియింతురు. సకల దురితంబులకు దారిద్ర్యంబుంబోలె సకల దురిత క్షపణంబునకు నర్థంబు నిదానంబు.**

**భావం :** ధనం వల్ల మానవుడు ధర్మార్థ కామ మోక్షములనే నాల్గు పురుషార్థాలను సాధించగలడు. ధనానికి సాధ్యం కానిదేదీ లేదు. కులం, విద్య, రూపం, గుణం లేకపోయినా ధనం వున్నవాన్ని లోకులు గొప్పవానిగా వర్ణిస్తారు.

**నీతి :** ధనం సర్వార్థ సాధనం.

**వ్యాఖ్యానం :** ఇక్కడ ధనం యొక్క ప్రాధాన్యాన్ని గూర్చి చెప్పబడింది. ధనం వల్ల మానవుడు నాలుగు పురుషార్థాలను సాధించగలడు. కులం, విద్య, రూపం, గుణం లేకున్నా ధనం ఉంటే అతణ్ణి గొప్పవానిగా కీర్తించడం లోకరీతి.

**Meaning:** Wealth helps win everything in life. Nothing remains impossible, when one has wealth. He may have nothing else, of note like noble birth, caste, education, beauty or character, but still he is honoured by all because of his riches. Poverty remains the root cause of all misery, and wealth remains the cause of removing all misery.

**Moral:** There is nothing in life that wealth cannot achieve.



**15. సజ్జనులతోడి సఖిత్వంబు సంభాషణ మాత్రసిద్ధంబు**

**భావం :** కేవలం మాట్లాడుట వల్లనే సజ్జనులు స్నేహితులౌతారు.

**నీతి :** ఒక్క మాటతో నీవు సజ్జన సాంగత్యాన్ని పొందగలవు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ సజ్జన సాంగత్యాన్ని గూర్చి చెప్పబడింది. సజ్జనులైనవారు కల్ల కపటం లేని నిర్మల హృదయం కల్గి వుంటారు. స్నేహం కోరి వచ్చిన వారికి ఒక్క సంభాషణతో తమ సాంగత్యాన్ని అందిస్తారు.

**Meaning:** Just by speaking to good people, it is possible to strike a friendship. They extend their hand of friendship to all who seek it, with a warm heart.

**Moral:** Very little effort is needed to win the bond of friendship with a man of good character.



**16. మొగులు నీరు నమ్మి, చెరువు నీరు పార జల్లించునంతటి బుద్ధిమంతుడిందెవ్వాడును లేడు.**

**భావం :** ఆకాశంలోని మేఘంలో నీరును నమ్ముకొని, చెరువులోని నీళ్ళను బుద్ధిమంతుడైన వాడెవ్వడు పార జల్లించడు.

**నీతి :** ఊహలు ఆధారంగా నిర్ణయాలు తీసుకోకూడదు.

**వ్యాఖ్యానం :** మేఘంలో వున్న నీళ్ళను నమ్మి, చెరువులోని నీళ్ళను పారజల్లడం, లోకజ్ఞానం వున్నవాడు చేయడు.

**Meaning:** No one should let the water out of the lake to his fields, presuming that the overcast sky will rain and fill the tank.

**Moral:** Never act on presumption.



**17. 'స్పృశించుచునె ద్విపంబును, నాఘ్రాణించుచునె యురగంబును, పాలించుచునే నృపాలుండును, నవ్వుచునె దుర్జనుండును, హింసింతు'రని విచక్షణులు పలుకుదురు.**

**భావం :** కేవలం తొండంతో తాకుట వల్ల ఏనుగు, వాసన చూచుట వల్ల పాము, రాజ్యాన్ని పాలిస్తూనే రాజు, నవ్వుతూనే దుర్మార్గుడు ఇతరులను హింసిస్తారని విషయజ్ఞులు చెబుతారు. కాబట్టి పైవారికి దూరంగా వుండి మనల్ని మనం రక్షించుకోవాలి.

**నీతి :** పైకి కనిపించకుండా హింసించగలిగిన వారున్నారు.

**అర్థాలు :** ద్విపంబు = ఏనుగు; ఉరగంబు = పాము; నృపాలుడు = రాజు

**వ్యాఖ్యానం :** ఇక్కడ కుట్రదారులైన దుర్మార్గులను గూర్చి చెప్పబడింది. ఏనుగు దీర్ఘమైన తన తొండంతో దూరం నుండి ఒక చెట్టును పెకలించగలదు. విషసర్పం వాసనతో ఎదుటి ప్రాణిని గుర్తించి తన నాలుకతో విషాన్ని చల్లి చంపగలదు. అలాగే దుర్మార్గుడైన రాజు కుట్రపన్ని, రహస్యంగా తన ప్రత్యర్థులను మట్టుపెడ్తాడు.

**Meaning:** Evil men scheme and destroy those who oppose them. An elephant can use its trunk to strike. The snake can use its sense of smell and strike. A king may appear to be a benevolent ruler but remove those who oppose him ruthlessly and a sadist can torture someone with a smile on his face. Wisdom lies in keeping a distance from them.

**Moral:** There are people who can destroy without appearing to do so.



**18. పండిన వృక్షంబు చందంబున, సజ్జనుండు వంగియుండును. మూర్ఖుండు, శుష్కకాష్టంబుంబలె, భేద్యుం డగుంగాని, నమ్రుండు గానేరదు.**

**భావం :** సజ్జనుడైనవాడు పండ్ల భారంతో వంగిన చెట్టు లాగా నమ్రతతో వుంటాడు. మూర్ఖుడు ఎండుకట్టె లాగా నిగుడుకొని, గర్వంతో వుంటాడు. అతడు దెబ్బ తగిలినప్పుడు వంగడు. ఎండుకట్టెలాగా విరిగిపోతాడు.

**నీతి :** వినయం సాధు లక్షణం. గర్వం దుర్జన లక్షణం.

**వ్యాఖ్యానం :** సజ్జనులకు, దుర్జనులకు గల భేదం ఇక్కడ చెప్పబడింది. సజ్జనుడు అణకువతో వుండి సమస్యల పరిష్కారానికి పట్టువిడుపు చూపిస్తాడు. దుర్జనుడు అహంకారంతో పట్టువదలకుండా, పోరాడి, సమస్యల్లో చిక్కుపడి నాశనమైపోతాడు.

**Meaning:** A good and an honourable man is humble and gentle like a tree bent with the weight of its fruit. A foolish proud man stands erect like a dried stick. He cannot withstand a blow, and breaks easily as any dry stick would.

**Moral:** Humility is the quality of a true gentleman, while pride is the quality of a scoundrel.

Humility = modesty

Scoundrel = A man who has no good qualities



**19. 'చెలిమిమై చేదు మేపింపవచ్చుం గాని, బలిమి మెయింపాలు ద్రావింపరాదు'.**

**భావం :** స్నేహంగా వుంటే, ఒకరి చేత చేదును తినిపించవచ్చు. బలవంతంగా పాలను కూడా త్రాగించలేరు.

**నీతి :** స్నేహంతో ఏదైనా చేయించవచ్చు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ స్నేహం యొక్క గొప్పతనాన్ని గూర్చి చెప్పబడింది. బలవంతంగా, ఒకరి చేత పాలను కూడ త్రాగించలేరు. స్నేహంతో చేదును గూడ తినిపించవచ్చు. చెలిమియన్నది వెలలేని కలిమి. దానిని ప్రతివాడు కల్గియుండాలి.

**Meaning:** A person may be persuaded to eat something which is bitter to taste, if it is given in a loving, caring manner; but it is impossible to make someone drink even milk, by force.

**Moral:** A friendly and warm approach can persuade a person to do whatever is desired.



**20. వాపీకూపంబులును, తటాకంబులును, తరువివరంబులును నెవ్వరు ముందుగా నాక్రమించుకొందురో నాటికి వారివి గాని యెల్లకాలము ప్రత్యేకముగా నొకరి సొత్తులు గావు.**

**భావం :** నీటి బావులు, చెరువులు, చెట్టు తొర్రలు ఎవరు ముందుగా ఆక్రమించుకుంటే ఆనాటికే వారివి. ఎల్లకాలం వారి సొత్తులు కావు. వాటిని కొందరు వదలివెళ్లితే, వేరేవాళ్ళు వచ్చి ఆక్రమించుకొంటారు.

**నీతి :** ఉన్నంతసేపే, ఉన్నవానిది యిల్లు.

**అర్థాలు :** వాపి = నడబావి; కూపంబు = నుయ్యి; తటాకంబు = చెరువు; తరువివరంబులు = చెట్టుతొర్రలు

**వ్యాఖ్యానం :** భూమి లేదా యిల్లు వంటి ఆస్తులను ఎవరు ముందుగా ఆక్రమించుకొంటారో వారికే ఆనాటికి సొంతమౌతాయి. వారు వాటిని వదలివెళ్ళితే, వెంటనే, వేరొకరు ఆక్రమించుకొంటారు. ఇది లోకంలో అనుభవంలో వున్న విషయం.

**Meaning:** Whether they are wells, ponds or the hollows of trees, only the first occupants have the right of ownership over them but only temporarily. They cannot ever keep them permanently. When the present owners move away others occupy them.

**Moral:** Ownership over anything can be only temporary.



**21. స్వాశ్రితావనసమో న హి ధర్మమని వేదములు ఘోషించును గదా? కాబట్టి యాశ్రిత రక్షణమునకు సమానమయిన ధర్మము మరియొకటి లేదు.**

**భావం :** తనను ఆశ్రయించిన వారిని రక్షించుట కంటె మించిన ధర్మం వేరొకటి లేదని వేదాలు చెబుతున్నాయి. ఆ ధర్మాన్ని అందరు పాటించాలి.

**నీతి :** ఆశ్రయించిన వానికి అభయం ఇవ్వటం నీ కర్తవ్యం.

**వ్యాఖ్యానం :** 'స్వాశ్రితావనసమోనహి ధర్మః' అని వేదాలు ఘోషిస్తున్నాయి. అంటే ఆపదలో వుండి ఆశ్రయం కోరిన వారిని రక్షించడంతో సమానమైన ధర్మం మరొకటి లేదు. కాబట్టి ఆ ధర్మాన్ని మనం పాటించాలి.

**Meaning:** A person is honour bound to offer protection to anyone who seeks his help. There can be no greater act of virtue than this. The Vedas have laid down this tenet.

**Moral:** It is the duty of a person of honour to give protection to anyone who asks for it.



**22. దేహములు బుద్బుద ప్రతిమంబులు; పరువము ఫేనసదృశంబు; సంపదలు తటిచ్చంచలంబులు; అలంకారంబులు భిత్తిచిత్రంబులు; దారపుత్రాదులాశ్మశానగమనులు గాని యా పయిని వచ్చువారు కారు; ధర్మమొక్కటియే తోడ వచ్చి తన్ను గాచునది.**

**భావం :** శరీరాలు గాలి బుడగల లాంటివి. అవి యెప్పుడో పగిలిపోతాయి. ప్రాయం నీటిపై నురుగులాంటిది. ఉన్నట్టుండి మాయమైపోతుంది. సంపదలు మేఘంలోని మెరుపుల్లాగా తళుక్కుమని క్షణకాలం మెరుస్తాయి. మనం చేసుకొనే అలంకారాలు గోడ మీద బొమ్మలలాంటివి. ఎప్పుడో మాసిపోతాయి. భార్యా పుత్రులు మనం చనిపోయినప్పుడు మన శవం వెంబడి స్మశానం దాకా వస్తారు. మనం చేసిన ధర్మం మాత్రమే మరణానంతరం మన వెంట వుంటుంది. అందువల్ల మనం ధర్మాన్ని ఆచరించాలి.

**నీతి :** నీ వెంట వచ్చేది, నీవు చేసిన ధర్మమొక్కటే.

**అర్థాలు :** బుద్బుదప్రతిమంబులు = నీటిబుడగలు; ఫేనసదృశంబు = నురుగుతో సమానం; తటిత్ = విద్యుల్లత; భిత్తి = గోడ; దార = భార్య.

**వ్యాఖ్యానం :** మానవుడు మరణించిన తర్వాత, అతనిని స్మశానానికి తీసుకొని పోయేటప్పుడు, బంధువులు మిత్రులు తదితరులు స్మశానం వరకే వెంట వస్తారు. తర్వాత అతణ్ణి లోకం మరచిపోతుంది. అతడు చేసిన మంచిపనులేమైనా వుంటే, వానినే లోకులు గుర్తుంచుకొంటారు. కాబట్టి మనం జీవితంలో మంచిని ఆచరించాలి.

**Meaning:** Human lives are like air bubbles which are bound to burst at any moment. Youth is like the foam on the surface of water. It can vanish easily. Wealth is like the momentary flash of lightning in the clouds. All pomp and show can fade away like pictures on a wall. A dead man's wife and children follow him only up to the grave. Only the good that a man has done during his lifetime remains with him after death. All should remember that a noble life lived, leaves its imprint on time forever.

Vanish= disappear

**Moral:** Only the memory of one's righteous acts remains after one is dead.



**23. సదారంధ్రాన్వేషణమే పనిగా కుటిలగతిని వర్తించు పాపజాతికి ఎట్టు దయపుట్టును?**

**భావం :** పాములు ఎప్పుడును రంధ్రాలు వెదుక్కుంటూ వంకరటింకరగా పరుగెత్తుతుంటాయి. వాటికి దయ వుండదు. అలాగే కుటిలులైన వారు మనలో తప్పులు వెతుకుతూ అధర్మ మార్గంలో నడుస్తుంటారు. వారికి మనపై దయ వుండదు. మనకు అపకారం చేయడానికి ప్రయత్నిస్తారు.

**నీతి :** దుర్జనులకు తప్పులు పట్టడమే పని.

**అర్థాలు :** పాపజాతి = పాముల జాతి; రంధ్రాన్వేషణము = రంధ్రాలను వెదకటం

**వ్యాఖ్యానం :** ఎప్పుడు తప్పులు పట్టే వారిని గూర్చి యిచ్చట చెప్పబడింది. పాములు వంకర టింకరగా ప్రయాణిస్తాయి. దయలేకుండా, విషపు కాటువేసి జీవుల్ని చంపుతాయి. అదే విధంగా కుటిల ప్రవర్తనులైనవారు, మనలో తప్పులు వెదుకుతూ, దయాదాక్షిణ్యాలు లేకుండ, అపకారం చేయడానికి ప్రయత్నిస్తారు. అట్టి వారి నుండి మనల్ని మనం రక్షించుకోవాలి.

**Meaning:** Snakes are forever in search of holes, writhing and wriggling all the time. Similarly evil men are forever trying to harm others and think in a crooked manner. They cannot be kind to anyone and always try to harm others.

**Moral:** Evil people always find fault with others and try to harm them.



**24. భగ్గున మండు దవానలంబు వృక్షాగ్రంబులం గాల్చి విడుచుం గాని, వానిని నిర్మూలము గావింపజాలదు; శైత్యశీల మయ్యును నదీ జలంబు తటస్థితవసుమతీజంబుల మూలంబుల తోడ పెల్లగించును. కాబట్టి మంచి మాటలతో సాధింపవచ్చు పనిని పరాక్రమశతంబుచేనైన సాధింపరాదు.**

**భావం :** భగ్గున మండే దావాగ్ని చెట్ల చివరల్ని మాత్రమే కాల్చి వదిలేస్తుంది. కాని మొదలంట నాశనం చేయదు. చల్లగా వుండే ఏటి నీరు ప్రవాహ వేగంతో చెట్లను వ్రేళ్లతో కూడ పెకిలించి కూలదోస్తుంది. అంటే బలప్రయోగంతో చేయలేని పనిని మంచి మాటలతో చేయవచ్చు. ఇక్కడ దావాగ్నిని బలప్రయోగంతోను, ఏటినీరును మంచి మాటలతోను పోల్చబడింది.

**నీతి :** బలప్రయోగంతో సాధించలేనిది మంచి మాటలతో సాధించవచ్చు.

**అర్థాలు :** దవాలనంబు = అడవిలో లేచే మంట; శైత్యశీలము = చల్లదనం కలది, తటస్థిత = గట్టుమీదనున్న; వసుమతీజము = చెట్టు.

**వ్యాఖ్యానం :** ఇక్కడ అడవిలోని మంటకు, ఏటిలోని వరదకు గల భేదం తెలుపబడింది. అడవిలో మంటలు లేస్తే అవి చెట్ల యొక్క చివరల్ని కాల్చి వదలివేస్తాయి. ఏటి వరదలు వస్తే చెట్లను కూకటివ్రేళ్ళతో పెకలించి వేస్తాయి. ఇక్కడ మంటలు బలప్రయోగంతోను, ఏటి వరద చల్లని మాటలతోను పోల్చబడ్డాయి. అంటే బలప్రయోగంతో చేయలేని పనిని చల్లని మాటలతో చేయవచ్చునని అర్థం.

**Meaning:** A Sudden burst of flames burns only the edges of the trees but does not destroy the whole tree, while a sudden flood of water can uproot the entire tree. In other words, what cannot be done with the use of force can be done easily with cool, persuasive words. Here the fire is likened to force and the flood water to the use of quiet convincing words.

**Moral:** what cannot be achieved with force can be successfully done with kind persuasive words.

Persuade (verb) = convince, get someone to agree, persuasive (adjective)



**25. శిఖీ శిఖాతప్తం బగుజలంబె పొంగిపడి యాయగ్నిం జల్లార్చుచుండుట లోక ధర్మము.**

**భావం :** అగ్ని నీటిని వేడిచేస్తుంది. కాని వేడెక్కిన నీరు పొంగిపడి ఆ అగ్నిని చల్లార్చుతుంది. ఇది లోక ధర్మం. అంటే మనం ఇతరులకు కీడు చేస్తే తిరిగి వాళ్లు మనకూ కీడు చేస్తారు. కాబట్టి ఎవరికీ కీడు చేయరాదు.

**నీతి :** దెబ్బతిన్నవాడే, తిరిగి దెబ్బ కొడతాడు.

**అర్థాలు :** శిఖి = అగ్ని; శిఖాతప్తము = మంటచే కాల్చబడినది

**వ్యాఖ్యానం :** ఒక చర్యకు ప్రతిచర్య వుంటుందనే లోకోక్తి వుంది. ఒకర్ని నీవు హింసిస్తే అతడు నిన్ను తిరిగి హింసిస్తాడు ఉదాహరణకు ఒక పాత్రలోని నీటిని అగ్నితో వేడిచేస్తే, ఆ నీరు పొంగిపడి, ఆ అగ్నిని చల్లారుస్తుంది.

**Meaning:** Fire heats up and makes water boil. The same water which boils and overflows the vessel can put out the fire. This is a universal truth. Similarly if one tries to harm another, the one who is hurt can turn around and destroy the one who has harmed him.

**Moral:** A man who has been hurt can react by destroying his tormentor.

Torment (verb) = cause pain, tormentor (noun)



# 16. ఆంధ్రదేశము - పూర్వ కాలపు పేర్లు - మండలములు

**పరిచయం :**

ఆంధ్రదేశము – పూర్వకాలపు పేర్లు – మండలములు అనే ఈ పాఠ్యాంశం ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందు శేఖరంగార్లు రచించిన 'ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి' అనే గ్రంథం నుండి గ్రహింపబడింది.

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలు పూర్వం వివిధ నామాలతో వ్యవహరింపబడేవి. నేడు వాటిలో కొన్ని పేర్లు కొంత మార్పుతో పిలువబడుతున్నాయి. ఆంధ్రదేశం లేదా తెలుగునేల అని పిలువబడిన మన రాష్ట్రంలోని పలు ప్రాంతాలను గురించి ఈ పాఠ్యాంశంలో తెలుసుకొంటాం.

మన భాషకు ఆంధ్రం, తెనుగు, తెలుగు అనే పదాలు వ్యవహారంలో వున్నాయి. ఈ పదాల పుట్టు పూర్వోత్తరాలను గురించి ఆంధ్రదేశంలో నివసించిన వివిధ జాతులను గురించి కూడా ఈ పాఠ్యాంశంలో తెలుసుకుంటాం.

**ఆంధ్రదేశంలో ప్రధాన ప్రాంతాలు :**

ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానంగా మూడు ప్రాంతాలున్నాయి. అవి సముద్ర తీరపు జిల్లాలు, రాయలసీమ జిల్లాలు, తెలంగాణ జిల్లాలు. పూర్వం తీర ప్రాంతంలోని ఉత్తర జిల్లాలను ఉత్తర సర్కారులు అనేవారు. ఈ పేరును మధ్య యుగంలో మహమ్మదీయ పరిపాలకులు పెట్టారు. ఆ కాలంలో ఆ ప్రాంతమంతా ఒక పరిపాలనా విభాగంగా వుండేది. ఆ ప్రాంతం సముద్రతీరంలో వ్యాపించి ఉండటం వల్ల దాన్ని 'సాగర సీమ' అంటారు.

తూర్పుగోదావరి జిల్లాలో అమలాపురం తాలూకాలో 'కోనసీమ' అనే పేరు గల ప్రదేశం ఉంది. అదినేటికీ ఆ పేరుతోనే వ్యవహరింపబడుతూ వుంది. కొంత భూభాగం కోణంగా సముద్రంలోకి చొచ్చుకొనిపోయి వుండడం వల్ల దానికాపేరు వచ్చింది.

తెలుగువారు నివసించే ప్రదేశానికి మొదటినుండి ఏ పేరు ఉండేదో తెలియదు. ఐతరేయ బ్రాహ్మణంలోని శునశ్శేపుని కథలో ఆంధ్రజాతి పేర్కొనబడింది. కానీ వారు నివసించే ప్రదేశం చెప్పబడలేదు. రామాయణ కాలంలో నేటి ఆంధ్రప్రదేశ్‌లోని కొంతభాగం దండకారణ్యంగా ఉన్నట్లు తెలుస్తుంది. శ్రీరామచంద్రుడు నివసించిన ప్రదేశాలు కొన్ని ఆంధ్రదేశంలో వున్నాయి. అవి భద్రాచలం సమీపంలోని పర్ణశాల ప్రాంతం లోనివి. అదే దండకారణ్యం. అదే శూర్పణఖ సోదరులైన ఖరదూషణాది రాక్షసులుండిన ప్రదేశం.

మహాభారతంలో ఆంధ్రజాతి గురించిన ప్రస్తావన కనిపిస్తుంది. మహాభారత కాలంలో ఆంధ్రులు దక్షిణాపథవాసులని తెలుస్తుంది. వారి నివాసభూమి నేటి ఆంధ్రదేశమని చెప్పవచ్చు.

బౌద్ధ యుగంలో ఆంధ్రదేశానికి మంజీర దేశమనీ, వజ్రదేశమనీ, నాగభూమి అనీ పేర్లు ఉండేవని తెలుస్తుంది.

**ప్రశ్న :** 1. ఆంధ్రదేశంలోని ప్రధాన ప్రాంతాలేవి?



**మంజీర దేశం :**

మంజీర దేశం ఇప్పటి తెలంగాణాకు వ్యవహార నామంగా ఉండేది. నిజామాబాద్ జిల్లాలో ప్రవహించే మంజీర నది వల్ల ఆ పేరు ఏర్పడింది. మంజీర నది గోదావరి నదికి ఉపనది. బౌద్ధ గ్రంథాల్లో దీన్ని 'వంజర' అని పేర్కొన్నారు. కళింగ దేశానికి ముఖ్య పట్టణమైన దంతపురానికి మంజీరికాదేశం దక్షిణదిశలో ఉన్నట్లు బౌద్ధ గ్రంథాల్లో చెప్పబడింది.

**వజ్ర దేశం :**

ఆంధ్రదేశానికి 'వజ్రదేశమనే' పేరు కూడా బౌద్ధజాతక గ్రంథాలలో కనబడుతుంది. ధరణికోటకు ఉత్తర భాగంలో పరిటాల వద్ద పూర్వకాలం నుంచి వజ్రాలు దొరుకుతున్నాయి. బౌద్ధుల వ్రాతలలో బుద్ధుని దంతాలను గురించి చాలా కథలు ఉన్నాయి. కళింగ దేశపు రాజకుమార్తె, ఆమె భర్త బుద్ధ భగవానుని దంతం గల పెట్టెను తీసుకొని దంతపురం నుండి బయలుదేరి ఓడ నెక్కి సింహళానికి (నేటి శ్రీలంక) ప్రయాణం చేస్తున్నప్పుడు దారిలో వీరి ఓడ వజ్రాలదిన్నె అనే చోట మెరక ఎక్కింది. ఆ వజ్రాలదిన్నె నాగరాజులు పాలించిన ధాన్యకటకం. ధర్మాశోకుడు అనే నాగరాజు వజ్రాలదిన్నె వద్ద ఒక దేవాలయాన్ని కట్టించాడని సింహళ దేశ గ్రంథాల్లో చెప్పబడింది. ఆ కాలంలో గోదావరికి తూర్పు భూభాగం కళింగంగా గుర్తించారు. కృష్ణాగోదావరి నదుల మధ్య భాగం, కృష్ణానదికి దిగువ ప్రాంతం, నెల్లూరు, గుత్తి, కందనోలు (నేటి కర్నూలు) మండలాలను వజ్రభూమిగా ఆ కాలంలో గుర్తించారు.

**నాగభూమి :**

బౌద్ధ కథలలో ఆంధ్రదేశం నాగభూమిగా కూడా చెప్పబడింది. గంగానది ముఖద్వారానికి సింహళ ద్వీపానికి మధ్యన ఉండే ప్రదేశం నాగుల నివాస భూమిగా ఉండేది. నాగులు బుద్ధుని మతం పట్ల భక్తి విశ్వాసాలు కలిగి ఉండేవారు. నాగరాజు తథాగతుని పవిత్రమైన అస్థికలు సంపాదించి వాటిపై వజ్రాలదిన్నె వద్ద స్థూపం నిర్మించాడు. అదే అమరావతి స్థూపం. ఈ నాగరాజు సింహళ ద్వీపానికి రాజైన మేఘవర్ణునికి మిత్రుడని, మేఘవర్ణుడు నాగరాజు వద్దనున్న బుద్ధుని పవిత్ర ఆస్థికలను పొందెనని బౌద్ధ కథలు చెప్తున్నాయి. ఈ కథ ఆంధ్రదేశానికి సంబంధించింది. బౌద్ధయుగంలో సింహళద్వీపానికి నాగ ద్వీపం, రత్న ద్వీపం అని పేర్లు ఉండేవి.

## ప్రశ్నలు

1. మంజీర దేశమని ఆంధ్రదేశానికి పేరెలా వచ్చింది?
2. ఆంధ్రదేశానికి వజ్రదేశమనే పేరు ఎలా వచ్చింది?
3. ఆంధ్రదేశానికి నాగభూమి అనే పేరు ఎలా వచ్చింది?



## త్రిలింగ దేశం :

ఆంధ్రదేశానికి పూర్వం ఉన్న పేర్లలో 'త్రిలింగ దేశం' అనేది ముఖ్యమైంది. 'తెలుగు' శబ్దానికి పూర్వరూపం త్రిలింగ అని, త్రికలింగ అని పండితులలో భిన్న అభిప్రాయాలు ఉన్నాయి. కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి ఆస్థానకవి అయిన విద్యానాథుడు తన 'ప్రతాపరుద్ర యశోభూషణం'లో ఆంధ్రదేశం మూడు ప్రసిద్ధ శైవక్షేత్రాలచే పావనమైందని, అవి శ్రీశైలం, కాళేశ్వరం, ద్రాక్షారామం అని, ఇవే త్రిలింగ సంజ్ఞను ఈ దేశానికి కలిగించాయని చెప్పాడు. త్రిలింగ శబ్దం యొక్క వికృతి 'తెలుగు' అని వ్యాకరణ వేత్తలు చెప్తారు. తెలుగు అనే రూపమే మొదటిదని, త్రిలింగ శబ్దం పండితులు చేసిన సంస్కృతీకరణమని ఆధునిక విమర్శకులు భావిస్తున్నారు. క్రీ.శ. 150 సంవత్సరాలకాలం నాటి గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞుడు 'టాలెమీ' తన గ్రంథంలో 'టిలింగాన్' అనే పదం ఉపయోగించాడు. బర్మాలో 'తైలంగు' అని పిలువబడే జాతి ప్రజలు ఉన్నారు.

కొందరు పరిశోధకులు త్రిలింగ శబ్దం త్రికలింగ శబ్దభవమని చెప్తున్నారు. త్రికలింగ పదం శాసనాలలో కన్పిస్తున్నది. గోదావరి తూర్పు తీరం నుండి మహానది వరకు గల దేశం పూర్వకాలంలో 'కళింగ'గా పిలువబడేది. తెనాలి రామకృష్ణ కవి తన పాండురంగ మహాత్మ్యంలో 'పీఠికాపురం' కళింగ దేశ ఆభరణం అని వర్ణించాడు. పీఠికాపురం అనగా పిష్టపురం. అదే నేటి 'పిఠాపురం'. ఇది గోదావరికి ఉత్తరంలో ఉంది. కళింగం మూడు భాగాలుగా ఉండేది. మహేంద్రగిరి నుండి విశాఖపట్టణం జిల్లా భీముని పట్టణం వరకు గల ప్రాంతం ఉత్తర కళింగం లేక ఉత్కళం అనేవారు. భీముని పట్టణం తాలూకాకు చెందిన భోగపురం మధ్య కళింగ దేశం లోనిదని తూర్పు చాళుక్య వంశస్థుడైన 'కొక్కిలి వర్మ' మహారాజు బొడ్డేరు శాసనంలో చెప్పబడింది. గోదావరి నుండి భీముని పట్టణం వరకు గల ప్రదేశాన్ని 'దక్షిణ కళింగం' అనేవారు. ఈ మూడు కళింగాల సమీకరణమే త్రికలింగం. ఉచ్చారణ వేగం చేత త్రికలింగ శబ్దంలోని 'క'కారం మాయమై త్రిలింగ శబ్దం మిగిలిందంటున్నారు. ఇలా ఏర్పడిన త్రిలింగ శబ్దం వాడుకలో ఉండగా విద్యానాథుడో లేక ఇతర సంస్కృత విద్వాంసులో మూడు శివలింగాల మధ్య ప్రదేశమని అర్థం కల్పించి ఉండవచ్చు.

శ్రీశైలం, ద్రాక్షారామం, కాళేశ్వరం అనే త్రిలింగ శైవక్షేత్రాలలో శ్రీశైలం కర్నూలు జిల్లాలో ఉంది. ద్రాక్షారామం తూర్పుగోదావరి జిల్లాలో ఉంది.కాళేశ్వరం తెలంగాణాలోని కరీంనగర్ జిల్లాలో గోదావరి ప్రాణహిత సంగమస్థాన ప్రాంతంలో ఉంది. ఈ విధంగా ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ విభాగాలైన రాయలసీమ, సాగరసీమ, తెలంగాణం అనే మూడు ప్రదేశాలు తెలుగువారి పవిత్రమైన కాణాచి అని తెలుస్తున్నది.

### ప్రశ్నలు

1. త్రిలింగ దేశం గురించి వ్రాయండి?
2. కళింగం ఎన్ని భాగాలుగా ఉండేది? వాటిని గురించి వ్రాయండి?
3. తెలుగు వారి పవిత్ర కాణాచి ఏది?



**కళింగులు :**

కళింగులకు ఆ పేరు సముద్రతీర భూములలో నివసించడం వల్ల వచ్చింది. కళింగం అంటే అనూపం లేదా 'జలమయ ప్రదేశం' అని అర్థం. జలమయంగా ఉండే ఆంధ్రదేశపు సాగర ప్రాంతానికి కళింగ సంజ్ఞ చాలా కాలం వరకు నిలిచింది. భారతదేశం నుండి తూర్పు సముద్ర దీవులకు, దేశాలకు వలస పోయినది మొట్టమొదట కళింగులే. ఆయా ప్రదేశాలలో వీరు స్థిర నివాసాలు ఏర్పరచుకున్నారు. వీరి తర్వాత దూరదేశాలకు వలసవెళ్ళిన వాళ్ళు తమిళులు. మొదట ప్రాథమిక వలసజనులు కళింగులు కావడం చేత తర్వాత వచ్చిన వారిని కూడా కళింగులుగా భావించి ప్రాచ్య దీవులలోని జనులు వాళ్లను 'క్లింగు' లని పిలిచారు.

ప్రశ్న

1. కళింగ జాతిని గూర్చి వ్రాయండి?



**తెనుగు :**

తెలుగు శబ్దం లాగానే 'తెనుగు' అనే పదం కూడా ఆంధ్రులను పేర్కొనడంలో ప్రాముఖ్యం కలిగి ఉంది. గ్రంథ ప్రయోగం బట్టి చూస్తే తెలుగు పదం కన్న తెనుగు పదమే పూర్వమైందనిపిస్తుంది. వాగనుశాసనుడు అని పేరు పొందిన నన్నయ తన ఆంధ్ర మహాభారతావతారికలో తెనుగు అనే పదాన్నే ప్రయోగించాడు. తెలుగు శబ్దం త్రిలింగ శబ్దం నుండి వచ్చినట్లు తెనుగు పదం త్రినగ శబ్దం నుండి వచ్చిందని పండితులు చెప్తారు. త్రినగములు అనగా మూడు పర్వతాలు. మహేంద్రగిరి, కాళహస్తి శిఖరం, శ్రీశైల పర్వతం అనేవి త్రినగములు. కానీ ఇంతకన్నా సహజమైన వ్యుత్పత్తి 'తెన్+అగు' అనేది తెన్ అనగా ద్రావిడ భాషలో దక్షిణం అని అర్థం అంటే దక్షిణాభిముఖంగా సంచరించినవారు, దక్షిణాన ఉన్నవాళ్ళు తెనుగు వాళ్ళు అని అర్థం ద్రావిడ జాతికి చెందిన ఈ తెనుగు వాళ్ళు మొట్టమొదట వింధ్య పర్వత పాదాల ప్రాంతంలో నివసిస్తూ ఆర్యుల వత్తిడి చేత దక్షిణానికి వెళ్ళాల్సి వచ్చింది. కావున వీళ్ళు 'దక్షిణాత్యులు' లేక 'తెనుగువారు' అని పిలువబడినారు. తెనుగు వారు 'తెలగ' వారిగా మారారు. తెలగాలు, తెలగాణ్యులు మొదలైన పదాలు ఇట్లే ఏర్పడ్డాయి. తెలుగోళ్ళు అనే మాట నేటికీ జనుల వాడుకలో వుంది.

ప్రశ్న

1. 'తెనుగు' పదం ప్రాముఖ్యత గురించి వ్రాయండి?



**వేంగి దేశం :**

తూర్పు కనుమల నుండి సముద్రం వరకు కృష్ణా గోదావరుల మధ్య విస్తరించి ఉన్న తీర ప్రాంతానికి పూర్వం 'వేంగి' అని పేరు ఉండేది. దీన్నే 'దగ్ధ రాష్ట్రం' అని కూడా పిలిచేవారు. పూర్వం అరణ్యమయమైన

ఈ ప్రాంతాన్ని తగలబెట్టి జననివాసానికి అనుకూలంగా మార్చుకోవడం వల్ల 'దగ్ధరాష్ట్రం' అనే పేరు వచ్చింది. నన్నయ 'రాజమహేంద్రవరాన్ని' వేంగి దేశానికి నాయకమణి (ముఖ్య పట్టణం) అని చెప్పాడు. శాలంకాయన రాజుల నుంచి తూర్పు చాళుక్యుల వరకు ముఖ్య పట్టణంగా ఉంటూ వచ్చిన 'వేంగి నగరం' నుంచి వేంగిదేశం అనే పేరు వచ్చింది. సముద్ర గుప్తుని 'అలహాబాద్ శాసనం'లో ఈ ప్రాంతాన్ని పాలించినరాజు వైంగేయ హస్తివర్మ అని చెప్పబడింది. వేంగి ఇప్పటి ఏలూరు పట్టణానికి సమీపంలో ఉంది. ఇది ఇప్పుడు పూర్వ వైభవం కోల్పోయి చిన్న పల్లెగా నిలిచింది. పెదవేగి, చినవేగి అనే కుగ్రామాలే దీని అవశేషాలు. ఇక్కడ భూగర్భంలో తవ్వితే ప్రాచీన శిథిలాలు కనిపిస్తున్నాయి. ఏలూరు రైల్వేస్టేషన్‌కు తర్వాత ఉన్న దెందులూరు కూడ పూర్వకాలపు చరిత్ర కలిగినదే. దెందులూరు విష్ణుకుండిన వంశరాజులకు ముఖ్య నగరంగా ఉండేది. వేంగి నగరానికి సమీపంలో పెద్ద మంచినీటి జలాశయం ఒకటి ఉంది. దీనినే 'కొల్లేరు సరస్సు' అంటారు. ఇది జలపక్షులకు నిలయమై చాలా విస్తీర్ణం కలిగి రమ్యంగా ఉంటుంది.

## ప్రశ్న

1. వేంగిదేశం గురించి వ్రాయండి?



### ఆంధ్రదేశం – మండలములు, విషయములు :

ఈనాడు జిల్లాలు తాలుకాలు వలెనే పూర్వకాలంలో ఈ దేశం పరిపాలనా సౌకర్యానికి రాష్ట్రం, విషయం ఆహారం, నాడు మొదలైన విభాగాలు కలిగి ఉండేది. వీటి సరిహద్దులు ఇప్పుడు ఖచ్చితంగా గుర్తించడానికి వీలు కాదు. వీటి ముఖ్య పట్టణాల పేరుతో ఇవి పిలువబడినట్లుగా కనిపిస్తుంది.

### ఆహారాలు :

శాతవాహనుల కాలంలో ఆహారాలు అనే మాండలిక సంజ్ఞలు ఉండేవి. గోవర్ధనాహార, మామలాహార, సాతవాహనాహారాలు శాసనాల్లో పేర్కొనబడ్డాయి. గోవర్ధన నగరం కేంద్ర స్థానంగా కల్గినది గోవర్ధన హారం. ఇది మహారాష్ట్రలో ఉంది. సాతవాహనాహారం బళ్లారి జిల్లా ఆదోని ప్రాంతం. ఇది శాతవాహనుల జన్మ స్థానం అని కొందరు పరిశోధకుల అభిప్రాయం. బృహత్ఫలాయన జయవర్మ మహారాజు కొండముది శాసనంలో 'కూడూరు హారం' లోని 'పాంటూర గ్రామం' దానంగా ఇవ్వబడింది అని ఉన్నది. కూడూరు హారం ప్రస్తుతం బందరు ప్రాంతానికి వర్తిస్తుంది.

### పథం :

పథం అనేది మరొక విభాగం. పైరన పథం దీనికి ఉదాహరణ. పథం అనే సంజ్ఞ మండలం కన్నా విస్తీర్ణమైన దేశభాగానికి కూడా వాడబడింది. దక్షిణా పథం వింధ్యకు దక్షిణాన ఉన్న విస్తృత దేశాన్ని సూచిస్తుంది. శివస్కంధవర్మ 'మైదవోలు శాసనం'లో ఆంధ్రదేశానికి 'అంధపథం' అని చెప్పబడింది.

## రాష్ట్రం :

రాష్ట్రం అనే విభాగం 'అల్లూరు' శాసనంలో పేర్కొనబడింది. అమరావతి శాసనం ఒకటి పూగి రాష్ట్రాన్ని ఉదాహరణగా పేర్కొంది. ఇది తర్వాతి కాలంలో 'పాకనాడు'గా కనిపిస్తుంది. ఇక్ష్వాకు వంశీయుడైన వీరపురుషదత్తుని జగ్గయ్యపేట శాసనంలో 'కర్మ రాష్ట్ర' నివాసి అయిన ఒక దాత ప్రశంస వచ్చింది. ఇది ప్రస్తుతం గుంటూరు మండలానికి చెందినది. ప్రస్తుతం కడప మండలంలోని 'జమ్మలమడక' తాలూకాకు అప్పుడు 'హిరణ్యరాష్ట్రం' అని పేరుండేది. క్రీ.శ. ప్రారంభ శతాబ్దంలో కృష్ణానదికి దక్షిణాన తూర్పు సముద్రతీరం నుంచి పశ్చిమాన కోలారు మండలం వరకు ఆంధ్రపథం అనే పేరుతో ప్రసిద్ధి చెంది ఉండేది. మనకు తెలిసినంత వరకు ఇది నాలుగు రాష్ట్రాలుగా విభజింపబడి ఉండేది. 1. తూర్పు కర్మ రాష్ట్రం, 2. దానికి పశ్చిమాన హిరణ్య రాష్ట్రం, 3. దానికి పడమట కన్నాడు 4. ఇప్పటి బళ్ళారి ప్రాంతంలోని సాతవాహన రాష్ట్రం.

### ప్రశ్న

1. పూర్వకాలంలో పరిపాలన విభాగాలు ఏవి? వాటిని గురించి రాయండి?



## నాడు :

మధ్య యుగంలో స్థానిక విభాగాలలో 'నాడు' అనే సంజ్ఞ సర్వసామాన్యం. ఇటువంటి వాటిలో వేగినాడు, వెలనాడు, పాకనాడు, పల్నాడు (పల్లవనాడు) మొదలైనవి ప్రసిద్ధాలైనవి. తూర్పు సముద్రానికి, కనుమలకు, కృష్ణా – గోదావరి నదులకు మధ్యలో ఉన్న ప్రాంతం వేగినాడు. గుంటూరు మండలంలోని 'చందవోలు' ప్రాంతం వెలనాడు అని పిలువబడింది. వెలనాటి చోడులు అక్కడ పరిపాలన చేశారు. గుంటూరు నుండి మున్నేరు వరకు వ్యాపించిన దేశానికి 'కమ్మనాడు' అని పేరు. మున్నేరు నుండి పెన్న వరకు గల ప్రాంతం పాకనాడు అని పిలువబడింది. పల్లవుల జన్మ స్థాన విభాగం 'పల్లవనాడు' లేక 'పల్నాడు'. ఆంధ్ర వైదిక బ్రాహ్మణులలో వేగినాటి, వెలనాటి, ములకనాటి, కాసలనాటి శాఖల వారు ఉన్నారు ములకలు అనువారు మెదక్ జిల్లా బ్రాహ్మణేతరులలోనూ ఉన్నారు. వీళ్ళు ఆయా నాడులలో మొదట నివసించిన వారైనందువల్ల వారి శాఖలకు ఆ సంజ్ఞలు కలిగాయి. ములకనాటి వారిని అజ్ఞతచే మురికినాటి వారని లోకం వ్యవహరిస్తుంది. ములకనాడు అనేది చాలా ప్రాచీనమైన దేశవిభాగంగా కనిపిస్తుంది. గౌతమీ పుత్రశాతకర్ణి జయించిన రాష్ట్రాలలో ములకదేశం ఉంది. ఇది పైఠను ప్రాంతానికి వర్తిస్తుందని చారిత్రకుల భావన. కానీ తర్వాతి కాలంలో ఈ పేరు ఇప్పటి కడప జిల్లాలో కొంత భాగానికి చెల్లుతూ వచ్చింది.

కాసలనాడు అనే ప్రాంతం తెలంగాణాలోని పఠాన్ చెరువు (పొట్ల చెరువు) పరిసర ప్రదేశం. ఆంధ్ర నియోగి బ్రాహ్మణులలో కూడా పూర్వం 'నాడు' విభాగాలు ఉండేవి. మహాకవి శ్రీనాథుడు 'పాకనాటింటి వాడవు' అని సంబోధింపబడ్డాడు. నియోగులలో చాలా ప్రసిద్ధి గల ఆరు వేల శాఖల వారు 'ఆరు వేలనాడు'కు చెందినవాళ్ళు. ఈ ఆరువేల నాడు వెలనాడుకు మారుపేరు. వెలనాడు ఆరువేల గ్రామాల పరిమితి కలది

కావడం వల్ల దీనికా పేరు వచ్చింది. దీనికి సంస్కృతంలో 'షట్సహస్రదేశం' అని పేరు. కృష్ణానదీ ప్రాంతం ఆరువేలనాడుగా పిలువబడేది.

## ప్రశ్న

1. పూర్వకాలం పాలనా విభాగమైన 'నాడు' గురించి వ్రాయండి?



### సీమ :

తెలంగాణాలోని ప్రాచీన మాండలిక సీమలు అస్పష్టంగా తెలుస్తున్నాయి. విజయవాడకు పశ్చిమాన మధిర ప్రాంతం 'నతవాటిసీమ' అని పిలువబడింది. దీనికి పశ్చిమాన 'కొఱవిసీమ' ఉన్నది. ఇది ఇప్పటి డోర్నకల్లు మానుకోట పరిసరదేశం. కొఱవికి పశ్చిమాన అనుమకొండ విషయము ఉన్నది. ఇప్పటి కరీంనగర్ జిల్లాకు ఆనాడు సబ్బిసాయిర మండలం, సబ్బినాటి మండలం అనే పేర్లు ఉన్నాయి. పద్మపురాణోత్తర ఖండాన్ని రాసిన మడికిసింగనకవికి కందనమంత్రి ఆశ్రయం ఇచ్చాడు. కందనమంత్రి ముప్పభూపాలుని ఆస్థానంలోనివాడు. ఈ ప్రభువు గౌతమికి దక్షిణాన ఉన్న సబ్బినాటి మండలాన్ని పాలించినాడు. ఈ ముప్ప భూపాలుని రాజధాని నగరం 'రామగిరి'. ఇప్పటి మెదక్ జిల్లాను పూర్వం 'మెతుకు సీమ' అనేవారు. ఇక్కడ వరిపంట పుష్కలంగా పండేది. అన్నం సమృద్ధిగా గల మండలం కావడం వల్లనే దీనికి 'మెతుకుసీమ' అనేపేరు వచ్చింది. నిజామాబాద్ జిల్లా బౌద్ధయుగంలో 'మంజీరికాదేశం' అని పిలువబడేది. శాతవాహనుల కాలంలో దీనికి 'ఆశ్మకదేశం' అనే వ్యవహారం కనిపిస్తుంది. ఆశ్మకదేశానికి ముఖ్యపట్టణం 'పోతన నగరం'. ఇది ఇప్పటి 'బోధన్' అనే నగరం. గౌతమీపుత్ర శాతకర్ణి జయించిన దేశాలలో ములక, ఆశ్మక రాష్ట్రాలు ఉన్నాయి.

## ప్రశ్న

1. తెలంగాణలోని ప్రాచీన మాండలిక సీమలను గురించి వ్రాయండి?



# 17. చదువు (కథానిక)

– దాశరథి రంగాచార్య

## పరిచయం :

కేతు విశ్వనాథరెడ్డి, పోలు సత్యనారాయణగార్లు సంకలనం చేసిన 'చదువు కథలు' అనే కథాసంపుటి నుండి దాశరథి రంగాచార్య గారు రచించిన 'చదువు' కథానిక గ్రహించబడింది.

ఈ చదువు కథానికలో వెంకటి అనే పేదబాలుడి జీవితం ఎంత దుర్భరంగా ఉందో తెలుస్తుంది. అతడు బానిసత్వపు సంకెళ్ళలో చిక్కి హీనస్థితిలో దయనీయంగా బ్రతుకుతుంటాడు. అలాంటి బాలుడు చదువు మీద ఆసక్తితో బానిసత్వపు సంకెళ్ళను ఛేదించుకొని ప్రభుత్వం ఏర్పాటు చేసిన విద్యావకాశాలను తెలుసుకొని చదువుకోవడానికి ముందుకు సాగుతాడు.

ఈ కథానిక ద్వారా సమాజంలో ఒక వర్గం పేదవారిని దోచుకొనే విధానం తెలుస్తుంది. దాన్ని నివారించడానికి ప్రభుత్వం చేసిన బాల కార్మిక చట్టాన్ని ఉపయోగించుకోవడం పేద విద్యార్థులు చదువుకోవడానికి ప్రభుత్వం కల్పించిన ఉచిత వసతులను తెలుసుకోవడం, చదువు ప్రాధాన్యతను తెల్పడం అనేవి ఈ కథానిక ముఖ్య ఉద్దేశాలు.

## వెంకటి దీనస్థితి :

వెంకటికి కడుపులో పేగుల్లేవు. ఒంటిలో కండలేదు. కళ్ళల్లో వెలుగు లేదు. చెంపల్లో నునుపు లేదు. అయినా బ్రతుకుతున్నాడు. అంతేకాదు పని చేస్తున్నాడు.

వెంకటిని డాక్టర్లు చూడలేదింతవరకు. చూసి ఉంటే ఆశ్చర్యపడిపోయేవారు. అతడు వయసుకు తగిన ఎత్తు లేదు. బరువు లేదు. అతని ఆహారంలో విటమిన్లు లేవు. ప్రోటీన్లు లేవు. అసలు ఆహారం లేదు. ఆశ్చర్యం కదా! మరి డాక్టర్లకు. అతను జీవిస్తున్నందుకు! అంతేకాదు పని చేస్తున్నందుకు కూడా.

వెంకటి పెద్దవాడు కాదు. పదేళ్ళ పసివాడు. పాలబుగ్గలతో ఉండాల్సివాడు. బడిలో చదువుతూ ఉండాల్సిన వాడు. ఆటలలో పోటీ పడాల్సినవాడు. పిల్లలతో తిరగాల్సిన వాడు. తల్లిదండ్రుల గారాబం నోచుకోవాల్సిన వాడు.

వెంకటి భావిభారతపౌరుడు. సామాజిక శాస్త్రజ్ఞులు అతణ్ణి చూడలేదు. చూస్తే అతను సమాజానికి భారం అవుతాడని చెప్పేవారే. నేరాలు చేసి జీవిస్తాడని, మరొకరిని బ్రతకనివ్వడని, తానూ బ్రతకడని!

వెంకటి పదేళ్ళకే అన్ని బాధ్యతలూ నిర్వహిస్తున్నాడు. వెంకటి ఎదగలేదు. ఎదగడానికి కావాల్సిన తిండి లేదు. పొట్టిగా ఉంటాడు. అతని శరీరంలో కండలేదు. కాబట్టి ఎముకలకు చర్మం తొడిగినట్లు బక్కగా ఉంటాడు. అతనికి డొక్క ఉన్నట్లు కనిపించదు. అది లోతుగా వెళ్ళి వీపుకు అంటుకుంది. వెన్నూ డొక్కా ఒకటేనేమో అనిపిస్తుంది. అతని శరీరం మీద బట్టలుండవు. నడుముకు ఒక నిక్కరు ఉంటుంది. చూడగానే అది అతనిది కాదని తెలిసిపోతుంది. ఒక చింపిరి గుడ్డ తలకు చుట్టుకుంటాడు. తల మీది వెంట్రుకలు

ఎర్రగా ఉంటాయి. కళ్ళు పీక్కుపోయి ఎండిన చెరువుల్లాగా ఉంటాయి. బుగ్గల్లో మాంసం లేదు. అతని ముక్కు పెద్దగా ఉంటుంది.

దొర దగ్గర వెంకటి బానిసగా ఉన్నాడు. దొరలు ఎక్కడున్నారని మీరు అడగవచ్చు. నిజాం నవాబుతోనే దొరలు పోయారని మీ అభిప్రాయం కావచ్చు. చాలా మందికి లాగే మీకు కూడా వాస్తవాలు తెలియవు. దొరతనాలు పోయినా దొరలు పోలేదు. ఇంకా బానిసలు ఎక్కడున్నారని మీకు అనుమానం కలుగవచ్చు. బానిసత్వం పోయింది కానీ బానిసలు పోలేదు.

వెంకటి దొర పశువులను కాస్తాడు. ఉదయమే వచ్చి పశువుల పేడ ఊడుస్తాడు. పాలు పితుకుతాడు. పశువులను అడవిలో పగలంతా కాస్తాడు. సాయంకాలం వాటిని తోలుకొని వచ్చి కట్టేసి మేత వేస్తాడు. నీళ్ళు తోడి కుడితి కలిపి, పశువులకు తాపి, పాలు పితుకుతాడు. ముగ్గుతో లాంతర్లు తుడిచి వెలిగిస్తాడు. ఇంటికి పోతున్నట్లు దొరకు చెబుతాడు. దొర ఇంకా మిగిలిన పనులకు పురమాయిస్తాడు. అప్పుడు మిగిలిన పనులు కూడ చేసిన తర్వాత వెంకటి తల గుడ్డ విప్పి నేల మీద పరిస్తే అందులోకి దొర సోలెడు గింజలు పోస్తాడు. ఇక వెంకడు ఇంటి దోవ పడ్తాడు. అతడు గానుగ ఎద్దులాంటివాడు. అతడు పసివాడు కాబట్టి గానుగ దూడ అనవచ్చు. అయితే దూడలను గానుగలకు కట్టరు. మనుషులకు ఆ సూత్రం వర్తించదు.

## ప్రశ్నలు

1. వెంకటి దీనస్థితిని గురించి వర్ణించండి?
2. వెంకటి ఎవరు? అతను చేస్తున్న పనులేమిటో వివరించండి?



**చదువుపై ఆసక్తి :**

ఒకనాడు వెంకటి దొర ఇంట్లో లాంతర్లు తుడిచి వెలిగించాడు. వెంకటి లాంతరు పట్టుకొని చీకటి గదిలోకి ప్రవేశించాడు. ఆ గదిలో ఒక బల్ల రెండు కుర్చీలు ఉన్నాయి. ఒక కుర్చీ మీద దొర కొడుకు కూర్చున్నాడు. ముద్దుగా బొద్దుగా ఉన్నాడు. మరో కుర్చీలో పంతులు కూర్చున్నాడు. బల్ల మీద పుస్తకం ఉంది. వెంకటి లాంతరు పెట్టడంతో వెలుగు వచ్చింది. పంతులు చెపుతుంటే దొరబిడ్డ చదువుతున్నాడు.

వెంకటి చూస్తున్నాడూ, వింటున్నాడు.

'చదువులో సకలం ఉంది. చదువు నేర్చినవాడు గొప్పవాడుకావచ్చు. విద్యలేనివాడు వింత పశువు'.

వెంకటి తదేకంగా చూస్తూ తన్మయుడై వింటున్నాడు. అతనికి బయటి ప్రపంచమే తెలియడం లేదు. దొర వచ్చి గద్దించేదాకా, అతడు ఈ లోకంలో లేడు. దొర తరిమితే బయటకొచ్చాడు.

వెంకటి తమ గుడిసెకు వచ్చాడు. అతని తల్లి ముత్తమ్మ కుక్కిమంచంలో పడుకొని ఉంది. ఆ ఇంట్లో దీపం మిణుకు మిణుకుమంటోంది. కానీ, అవి ఏవీ వెంకటి గమనించలేదు.

'అమ్మా! చదువుకుంటానే' అన్నాడు వెంకడు.

ఆ మాట వినగానే, ముత్తమ్మ మీద పిడుగు పడ్డట్లయింది.

'నీకేమైనా పోయే కాలం వచ్చిందేమిరా! మీ తాత చదివాడా! మీ అయ్య చదివాడా! మనం బానిసలం బిడ్డా! బానిసలుగానే బ్రతకాలి! నీవు చదువుకుంటావు బాగానే ఉంటుంది. మరి నా గొంతులో గంజి ఎవరు పోస్తారు? దొర పశువులను ఎవరు కాస్తారు?'

'అమ్మా! దొర కొడుకు చదువుకొంటున్నాడు. నాకు కూడా చదువుకోవాలని ఉంది.' అని వెంకడు అన్నాడు.

'కొడకా! దొరలెక్కడ? మనమెక్కడ? గింజలు తీసుకొని వచ్చావా?' అని ముత్తమ్మ అడిగింది. నిజానికి గింజలు తీసుకురాలేదు. గింజల కోసం వెంకటి మళ్ళీ వెనక్కి పరుగెత్తాడు. గింజల కోసం మళ్ళీ గదిలోకి చూశాడు. పంతులు చెపుతుంటే దొర కొడుకు చదువుతున్నాడు. వెంకటి ప్రాణం విలవిల్లాడింది. దొర మళ్ళీ గద్దించాడు. తల గుడ్డలో గింజలు పోశాడు. వెంకటి ఆ గింజలు తీసుకొని బయలుదేరాడు. కాని అతనిలో ఉత్సాహం లేదు. చదువు వినలేకపోతున్నాననే బాధే ఉంది.

గంజి తాగి తల్లీకొడుకులు పడుకున్నారు. వెంకటికి నిద్ర పట్టలేదు. పంతులు చదువు చెపుతున్న దృశ్యం, దొరబిడ్డ చదువుతున్న దృశ్యం వెంకటి కళ్ళ ముందు కదలాడుతున్నాయి.

'అమ్మా! చదువుకుంటే ఏమౌతుంది?' అని వెంకడు అమ్మనడిగాడు.

'దొర నీ ప్రాణాలు తీస్తాడు. మీ నాన్న నిన్ను దొరకు అమ్మినాడు. నీ ప్రాణం దొరచేతుల్లో ఉంది. అర్థమయిందా? నీవు చనిపోతే నేనెలా బ్రతుకుతాను?' ముత్తమ్మ ఖంగు ఖంగున దగ్గుతూ విలవిల్లాడింది. ప్రాణం పోయి మళ్ళీ వచ్చినంత పనయ్యింది.

ముత్తమ్మకు క్షయవ్యాధి. కాని ఆ వ్యాధి గురించి వాళ్ళకు తెలియదు. వైద్యశాస్త్రాభివృద్ధి ఇంకనూ పల్లెలకు చేరలేదు. అది మాయరోగమని ముత్తమ్మ అనుకుంటుంది. ఎప్పుడో ఎత్తుకుపోతుందని తెలుసు.

వెంకటికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. పంతులు చదువు చెప్పడం, దొరబిడ్డ చదువుకోవడం అన్నీ కళ్ళ ముందు కదలాడుతున్నాయి. తల్లి అమాయకురాలనుకున్నాడు. తాను చదువుకుంటే దొరకేమి నష్టం? దొరనే అడుగుదామనుకున్నాడు. దొర అంగీకరిస్తాడని అతని అభిప్రాయం.

## ప్రశ్నలు

1. వెంకటికి చదువుకోవాలనే కోరిక ఎలా కలిగింది ?
2. వెంకటి తల్లి ఎందుకు భయపడింది?



## దొర దౌష్ట్యం :

తెల్లవారింది. మామూలు పనుల్లో మునిగిపోయాడు వెంకటి. సాయంకాలమయింది. వెంకటి లాంతర్లు తుడిచాడు. ముట్టించిన లాంతరు పట్టుకొని దొరముందు తలవంచుకొని నిలబడ్డాడు. ఏదో అడగాలనుకున్నాడు కాని అడగలేకపోయాడు.

దొర సిగరెట్టు వెలిగించుకొంటూ 'ఏందిర, ఏమో నసుగుతున్నావు. తొందరగా అదేదో ఏడ్వరా' అని అన్నాడు.

'దొర నేను చదువుకుంటా' అని వెంకడు అన్నాడు.

'వీడు చదువుకుంటాడంటనే' అని గొల్లున నవ్వాడు దొర. 'చదువుకొని దొరతనం చేస్తావుబే...పో...పో... లాంతరక్కడ పెట్టిపో. ఇంట్లో మీ అమ్మ చూస్తుంది' అన్నాడు.

వెంకటి అక్కడి నుండి కదల్లేదు.

'చెపుతుంటే వినపడదా! పోరా గాడిద కొడకా! పంతులు వచ్చి ఉంటాడు' అని దొర అన్నాడు.

'దొర! నాకు చదువుకోవాలని ఉంది' అని వెంకటి అన్నాడు.

దొర కోపంతో ఊగిపోయాడు. 'చదువుకుంటావా గాడిద కొడుక' అని కర్ర అందుకొని వెంకటిని బాదాడు దొర. వెంకటి చేతిలోని లాంతరు క్రిందపడి పగిలిపోయింది. ఆ దెబ్బలకు వెంకటి ఒళ్ళు పేలిపోయింది. ఆ సమయంలో గదిలో కూర్చున్న పంతులు, దొర కొడుకు, దొర భార్య అందరూ పరుగు పరుగున వచ్చారు.

వెంకటి ఒళ్ళు చిట్లి రక్తం కారుతోంది.

'అదేమిటి పిల్లవాని ప్రాణం తీసేస్తావా? వాడు చస్తే మనమీదకొస్తుంది' అన్నది దొరభార్య. కర్ర విరిచి పారేశాడు దొర. 'ఈ నా కొడుకు చదువుకుంటాడట చదువు' అని పెద్ద పెద్ద అడుగులు వేస్తూ ఇంట్లోకి వెళ్ళాడు దొర.

వెంకటి ఏడవలేదు. గాయాలతోనే లేచి, మెట్లు దిగి చీకటిలోనే ఇంటికి వెళ్ళిపోయాడు.

అది చూసిన దొర కొడుకు గురువుతో 'సార్! నాన్న ఎందుకు వెంకటిని కొట్టాడు' అని అడిగాడు.

'వెంకడు చదువుకుంటానని అన్నాడట' అని గురువు దొరకొడుకుతో అన్నాడు.

గురువు మాటలు విన్న దొరకొడుకు 'మరి నేను చదువుకుంటున్నాను కదా?' అని అడిగిన అమాయకపు ప్రశ్నకు గురువు జవాబు చెప్పలేకపోయాడు. కాదు, చెప్పలేదు.

## ప్రశ్న

1. వెంకడు చదువుకుంటానని దొరను అడిగినపుడు జరిగిన పరిణామాలు ఏమిటి?



### చదువు కొరకు ప్రయత్నం :

వెంకటి తల్లిని చూసి భోరున ఏడ్చాడు. తల్లి ప్రాణం విలవిల్లాడింది. కోపం పొంగు కొచ్చింది. ఆ కోపంలో దొరను నిలదీసేదే! దులిపేసేదే! కాని తను బానిస. ఆమెకు కూడా మనసుందని ఆమె సైతం గుర్తించలేదు. తనలో తానే ఏడ్చింది. అంతే! కనీసం శపించలేదు.

ఆ రాత్రి ఇద్దరూ ఉపవాసం.

గాయాలయిన శరీరంతోనే పనిలోకి వెళ్ళాడు వెంకటి. లాంతరును గదిలోకి పెట్టేపని తొలగించాడు దొర. ఇచ్చే గింజలు సగానికి తగ్గించాడు. అర సోలెడు గింజలు చెంబులో పోస్తే కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. దొరవైపు జాలిగా చూశాడు. దొర మనిషయితే ఆ చూపులకు కరిగిపోయేవాడే! దొర కరగలేదు.

వెంకటి దొరకాళ్ళమీదపడి ఏడ్చాడు. 'దొర! నేను చదువుకోను' అని కన్నీళ్ళతో అన్నాడు. చదువుకంటే గింజలు గొప్పవని తెలుసుకున్నాడు వెంకటి! ఈ విషయం దొరకు మొదటి నుండి తెలుసు. అందుకే అరసోలెడును సోలెడు చేయలేదు.

వెంకటి జీతం చేస్తూనే ఉన్నాడు. తప్పదు మరి. అతనికి ఒక వాస్తవం తెలిసి వచ్చింది. దొరకు చదువంటే భయం. కాబట్టి తను చదువుకోవాలి. ఆ తపన అతన్ని వదలడం లేదు. పసిగుండెలో పరితాపం ఎక్కువైంది.

వెంకటి ఒక రోజు రాత్రి పంతులు ఇంటికెళ్ళాడు. తలుపు తడితే పంతులు తీశాడు. ఆ రాత్రి వేళలో వెంకటిని చూసి ఆశ్చర్యపోయాడు.

'దొరపిలిచాడా' అని పంతులు అడిగాడు.

'కాదండి నేనే వచ్చాను'

'ఏమిటి సంగతి'

'చదువు కోవాలని ఉన్నదండి! నాకు చదువు చెప్తారా! రాత్రివేళ వస్తాను. దొరకు తెలిస్తే ప్రాణం తీస్తాడు' పంతులు గుండె కరిగింది. చదువుకోవాలని ఎంత తపన ఉంది. ఈ కుర్రాడికి చదువు లేదు. దొర కొడుక్కి ఎంత చెప్పినా రాదు. అటువంటి దొర కొడుక్కి చదువు చెప్పాలి. వింతగా ఉంది పరిస్థితి.

'దొరకొట్టింది మరచిపోయావా!' అని అడిగాడు పంతులు.

'దొరకొట్టినాడు కాబట్టే నాకు చదువుకోవాలని ఉంది. రాత్రివేళ వస్తాను. నాకు చదువు చెప్తారా?'

‘వెంకటీ! పట్టణానికి పోగూడదూ! చదువు చెప్పి, డబ్బులు ఇస్తారు.’

‘ఎలా పోతానండి? మా నాన్న దొరకు అమ్మినాడు. ఇక చచ్చేదాకా బానిసనే! ఎలా పోతాను చెప్పండి‘

‘వెంకటి! కొత్త ప్రభుత్వ ఆర్డరు వచ్చింది తెలుసా! బానిసగా పని చేయించుకోవడం నేరం. నీ బానిసతనం పోయింది. నీవు విడుదలయ్యావు ఇక దొరేమి చేయలేడు నిన్ను’.

‘ఏమన్నారండీ పంతులుగారు? దొరబలం పోయిందా నేను బానిసను కానా? నన్ను దొరేమీ చేయలేడా? పంతులుగారూ నీ కాళ్ళు మొక్కుతా! నా పాలిట దేవుడివి’ అని పంతుల్ని కీర్తించాడు వెంకటి.

వెంకటి తల్లి దగ్గరికి పరుగెత్తాడు. గట్టిగా కేకవేసి చెప్పాడు. ‘అమ్మా మనం బానిసలం కాము. కొత్త ప్రభుత్వం ఆర్డరొచ్చింది. మనం పట్టణం పోదాం. నేను చదువుకుంటా!’

ముత్తమ్మ కళ్ళలో వెలుగులు కనిపించాయి. స్వేచ్ఛలో ఎంతటి వెలుగుందో కనిపించింది.

‘నిజమా నాయనా! మనం బానిసలు కామా! దొరబలం చచ్చిపోయిందా?’ ఆమె మాటల్లోని ఆనందం అక్షరాలకు అందదు.

తెల్లవారగానే పలకా పుస్తకం పట్టుకొని దొర ఇంటికి వెళ్ళాడు వెంకటి. దొర నిరుత్తరుడయినాడు వెంకటిని చూసి!

‘దొరా! నేను చదువుకోవడానికి పట్టణానికి పోతున్నాను’ వెంకటిలో గర్వం కనిపించింది.

దొరలో పడగ నేలకు కొట్టుకుంటున్న పాము కనిపించింది.

## ప్రశ్నలు

1. వెంకటికి చదువుకోవాలన్న పట్టుదల ఎలా వచ్చింది?
2. వెంకటి చదువుకోవడానికి ఏమి చేశాడు?



# 18. ఛందస్సు

## ప్రస్తావన :

వేదాలు దైవనిర్దేశం అని మన పూర్వుల నమ్మకం. వాటికి అనుగుణంగానే ఈ వేదాంగాలు కూడా దైవదత్తమైనవి. కనుక వేదాంగాల్లో భాగమైన ఛందస్సు పరమేశ్వరుని నుండి పరంపరంగా భూలోకానికి ప్రయాణించిందని ఛందశ్శాస్త్ర రచన చేసిన కవులు అందరూ పేర్కొనడం జరిగింది. నేడు ఈ వేదాంగాలే శాస్త్రాలుగా పరిఢవిల్లుతున్నాయి. అందులో ఛందస్సు, వ్యాకరణం సాహిత్య సృష్టికి సోపానాలై నిలుస్తున్నాయి.

## నిర్వచనం :

ఛందస్సు ఒక శాస్త్రం. ఇది పద్య లక్షణాలను తెలియచేస్తుంది. పద్యం ఎలా వ్రాయాలి? దాని లక్షణాలు ఎలా ఉంటాయి? ఆయా పద్యాలను వ్రాయటంలో పాటించవలసిన నియమాలు ఏమి? అనే విషయాలను వివరించేది ఛందశ్శాస్త్రం. 'ఛది ఆహ్లాదనే' అనే ధాతువు నుండి 'ఛందస్' అనే పదం ఏర్పడింది. అనగా 'ఆహ్లాదాన్ని కలిగిస్తూ ఒక లయ కలిగింది' అని అర్థం. 'ఛది సంవరణే' – అని మరొక వ్యుత్పత్తి. 'సంవరణం' అంటే ఆవరించడం అని అర్థం. మనలో పుట్టే భావాలతో కూడిన అనేక వాక్యాలు ఒక విలక్షణమైన నిర్మాణాన్ని పొందటం – ఛందస్సు అనవచ్చు.

## ప్రయోజనం :

ఛందస్సును ఆధారం చేసుకొని కవిత్వం పద్యంగాను, శ్లోకంగాను రూపాన్ని దాల్చుతుంది. వేదం పురుషుడు అని మనం అనుకొంటే ఆ వేదపురుషునికి ఛందస్సు పాదం వంటిది. పాదాలు లేకుండా పురుషుడు ఎలా నడవలేడో అలాగే వేద పురుషుడు కూడా ఛందస్సు లేకుండా నడవలేడు అని పాణిని దగ్గర నుంచి అప్పకవి వరకు అందరూ ఛందస్సు యొక్క ప్రయోజనాన్ని ఒకే విధంగా చెప్పారు.

పద్యం తెలుగువారి సొత్తు. ఈ పద్యం యొక్క నిర్మాణాన్ని ఛందస్సు నిర్దేశిస్తుంది. పద్యం శృతి ప్రేయంగా ఉండి లయబద్ధంగా పాడుకోవడానికి వీలుగా ఉండేటట్లు చేస్తూ ధారణ చేయడానికి ఉపకరించేది ఛందస్సు.

## గురు లఘువులు – వాటి స్వరూపాలు :

పద్యం దాని నియమానుసారంగా పాదాలుగా విభజింపబడుతుంది. ఆ పాదాలు గణాల మీద ఆధారపడుతాయి. ఆ గణాలు అక్షరాల కలయిక వల్ల ఏర్పడుతాయి. భాషలో ఉన్న అక్షరాలు వాటి వాటి స్వరూపాలనుబట్టి, స్వభావాలనుబట్టి ఛందశ్శాస్త్రంలో వాటికి 'గురువు – లఘువు' అని పేరు పెట్టడం జరిగింది. ఈ గురు లఘువుల కలయికే గణాలు. ఇవే పద్యానికి మూలాధారం.

## గురు లఘువులు – నిర్వచనాలు :

అక్షరాలను నోటితో పలికేటప్పుడు ఒక అక్షరం కొంత సమయాన్ని తీసుకోవటం జరుగుతోంది. అలా అక్షరం తీసుకునే సమయాన్ని 'మాత్ర' పేరుతో కొలుస్తూ ఛందశ్శాస్త్రంలో అక్షరాలను గురులఘువులుగా

గుర్తించడం జరుగుతుంది. ఒక అక్షరం పలకడానికి సామాన్యంగా ఎంత సమయం పడుతుందో ఆ సమయం తెలియచేసేది మాత్ర. అంతేగాక 'చిటికె'ను కూడా ఛందశ్శాస్త్రంలో 'మాత్ర' అని అంటారు.

### లఘువు - నిర్వచనం :

ఏక మాత్రాకాలంలో అనగా ఒక 'చిటికె' వేసే కాలంలో పలుకబడే అక్షరాలను లఘువు అంటారు. దీని గుర్తు ఆంగ్ల భాషలోని 'I' వలె ఉంటుంది.

### గురువు - నిర్వచనం :

ద్విమాత్రాకాలంలో అనగా రెండు 'చిటికెలు' వేసే కాలంలో పలుకబడే అక్షరాలను గురువు అంటారు. దీని గుర్తు ఆంగ్ల భాషలోని 'U' వలె ఉంటుంది.

### లఘువును గుర్తించడం :

1. హ్రస్వాక్షరాలు లఘువులు : హ్రస్వాక్షరం అనగా పొట్టి అక్షరం.
   ఉదా : అ - ఇ - ఉ - ఋ - ఎ - ఒ మొదలైనవి.
2. హ్రస్వాక్షరాలతో కూడిన హల్లులు లఘువులు
   ఉదా : క - ప - మి - చొ - యొ మొదలైనవి.
3. హ్రస్వమైన ద్విత్వాక్షరాలు లఘువులు
   ఉదా : క్క - య్య - మ్మ - న్న మొదలైనవి.
4. హ్రస్వమైన సంయుక్తాక్షరాలు లఘువులు
   ఉదా : క్మ - ప్త - చ్య - ట్న మొదలైనవి.
5. అరసున్నతో కూడిన అక్షరాలు లఘువులు
   ఉదా : అఁ టఁ
6. తేల్చి పలుకబడే రేఫతో కూడిన అక్షరాలు - లఘువులు
   ఉదా : అద్రుచు - విద్రుచు - కద్రువ మొదలైనవి.

### గురువును గుర్తించడం :

★ దీర్ఘాచ్చులు గురువులు : ఉదా : ఆ - ఈ - ఊ - ౠ - ఏ - ఐ - ఓ - ఔ

★ దీర్ఘాచ్చులతో కూడిన హల్లులు గురువులు : ఉదా : కా - గీ - వూ - నో - మే మొదలైనవి.

★ దీర్ఘాలైన ద్విత్వాక్షరాలు గురువులు : ఉదా : క్కా - మ్మా - గ్గా - వ్వా మొదలైనవి.

★ దీర్ఘాలైన సంయుక్తాక్షరాలు గురువులు : ఉదా : క్వా – మ్యా – గ్మా – వ్నా మొదలైనవి.

★ ద్విత్వాక్షరాలకు ముందున్న అక్షరాలు గురువులు : ఉదా : అక్క – అమ్మ – నాన్న మొదలైనవి.

★ సంయుక్తాక్షరాలకు ముందున్న అక్షరాలు గురువులు : ఉదా : నిల్వ – కన్య – శక్తి మొదలైనవి.

★ సున్నతో కూడిన అక్షరాలు గురువులు : ఉదా : అంబ – గంప – అందం – చందం – మందు మొదలైనవి.

★ విసర్గతో కూడిన అక్షరాలు గురువులు : ఉదా : వః – కః – మః మొదలైనవి.

★ పొల్లుతో కూడిన అక్షరాలు గురువులు : ఉదా : కొందరిన్ – చేయుదున్ మొదలైనవి.

## ప్రశ్నలు

1. ఛందస్సును నిర్వచించి ప్రయోజనాలను తెలపండి?
2. గురు లఘువులను గుర్తించే విధానాన్ని తెలపండి?



# గణం - రకాలు

అక్షరాల చిహ్నాలైన గురు లఘువుల సముదాయం గణం. ఈ గణాల స్వరూపాన్ని బట్టి, స్వభావాన్ని బట్టి రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

## 1. స్వరూపాన్ని బట్టి గణాల విభజన :

స్వరూపం అంటే ఇక్కడ అక్షరాల వల్ల ఏర్పడే గణాలు. స్వరూపాన్ని బట్టి ఏర్పడే గణాలు నాలుగు రకాలుగా ఉన్నాయి.

1. ఏకాక్షర గణాలు
2. ద్వ్యక్షర గణాలు
3. త్ర్యక్షర గణాలు
4. చతురాక్షర గణాలు

## 1. ఏకాక్షర గణాలు :

ఒకే అక్షరం గణంగా ఏర్పడటాన్ని ఏకాక్షర గణం అంటారు. ఇవి రెండు విధాలు.

| వరుస | గణం పేరు | లక్షణం | చిహ్నం | ఉదాహరణ |
|---|---|---|---|---|
| 1. | ల - గణం | ఒక లఘువు | I | ర |
| 1. | గ - గణం | ఒక గురువు | U | పో |

## 2. ద్వ్యక్షర గణాలు :

రెండు అక్షరాలు ఉన్నవాటితో ఏర్పడే గణాలను ద్వ్యక్షర గణాలు అంటారు. ఇది నాలుగు విధాలు.

| వరుస | గణం పేరు | లక్షణం | చిహ్నం | ఉదాహరణ |
|---|---|---|---|---|
| 1. | లగం / వగణం | ఒక లఘువు<br>ఒక గురువు | IU | రమా |
| 2. | గలం / హగణం | ఒక గురువు<br>ఒక లఘువు | UI | రాజు |
| 3. | లలం / 'లా'గణం | రెండు లఘువులు | II | లత |
| 4. | గగం / 'గా'గణం | రెండు గురువులు | UU | వాణీ |

**3. త్ర్యక్షర గణాలు :**

మూడు అక్షరాలు కలిసి ఏర్పడే గణాలను త్ర్యక్షర గణాలు అంటారు. ఇవి ఎనిమిది విధాలు. ఈ మూడక్షరాల గణాలకు 'గణాష్టకం' అనే పేరు కలదు.

| వరుస | గణం పేరు | చిహ్నం | లక్షణం | ఉదాహరణ |
|---|---|---|---|---|
| 1. | భ గణం | UII | ఆది గురువు | రాముడు |
| 2. | జ గణం | IUI | మధ్య గురువు | విశాలి |
| 3. | స గణం | IIU | అంత్య గురువు | సుమతీ |
| 4. | మ గణం | UUU | అన్ని గురువులు | శ్రీరామా |
| 5. | య గణం | IUU | ఆది లఘువు | రమేశా |
| 6. | ర గణం | UIU | మధ్య లఘువు | రాముడా |
| 7. | త గణం | UUI | అంత్య లఘువు | రారాజు |
| 8. | న గణం | III | అన్ని లఘువులు | యమున |

**గణాష్టకమును గుర్తించుకొనుటకు మరొక పద్ధతి :**

మూడక్షరాల గణాలను గుర్తించుటకు 'య మా తా రా జ భా న స ల గం' అనే వాక్యాన్ని గుర్తుంచుకోవాలి. ఇందులోని ఒక్కొక్క అక్షరం ఒక్కొక్క గణాన్ని చెపుతుంది. మనకు ఏ గణంలో ఎన్ని లఘువులు, ఎన్ని గురువులు ఉన్నాయో క్రింది పట్టిక తెలుపుతుంది.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| య | మా | తా | రా | జ | భా | న | స | ల | గం |
| I | U | U | U | I | U | I | I | I | U |

## 4. చతురాక్షర గణాలు :

నాలుగు అక్షరాలతో కలిసి ఏర్పడే గణాలను 'చతురాక్షర గణాలు' అని అంటారు. ఇవి మూడు విధాలు.

| వరుస | గణం పేరు | లక్షణం | చిహ్నం | ఉదాహరణ |
|---|---|---|---|---|
| 1. | నలం | నగణం + ఒక లఘువు | IIII | శునకము |
| 2. | నగం | నగణం + ఒక గురువు | IIIU | నరహరీ |
| 3. | సలం | సగణం + ఒక లఘువు | IIUI | కమలాక్షి |

## స్వభావాన్ని బట్టి గణ విభజన :

స్వభావం అంటే గుణాన్ని బట్టి గణాలను రెండు రకాలుగా విభజించారు.

అవి 1. సూర్య గణాలు, 2. ఇంద్రగణాలు

## 1. సూర్య గణాలు : ఇవి రెండు రకాలు

| వరుస | గణం పేరు | చిహ్నం | ఉదాహరణ |
|---|---|---|---|
| 1. | గలం / హగణం | UI | శౌరి |
| 2. | నగణం | III | జలజ |

## 2. ఇంద్ర గణాలు :

ఇవి ఆరు రకాలు. ఇందులో నాలుగు అక్షరములు గల గణాలు మూడు, మూడు అక్షరములు గల గణాలు మూడు కలవు.

| వరుస | గణం పేరు | చిహ్నం | ఉదాహరణ |
|---|---|---|---|
| 1. | నలం | IIII | విజయము |
| 2. | నగం | IIIU | వలయమా |
| 3. | సలం | IIUI | ప్రియరాణి |
| 4. | భగణం | UII | కోపము |
| 5. | రగణం | UIU | రాగమై |
| 6. | తగణం | UUI | రావాలి |

### ప్రశ్నలు

1. స్వరూపాన్ని బట్టి గణాలు ఎన్ని రకాలు? అవి ఏవి?
2. స్వభావాన్ని బట్టి గణాలు ఎన్ని రకాలు? అవి ఏవి?



# పద్య భేదాలు

**పరిచయం :**

పద్యాలను బట్టి భేదాలు మూడురకాలు. అవి

1. వృత్తాలు
2. జాతులు
3. ఉపజాతులు

**1. వృత్తాలు :**

అక్షరగణాలచేత ఏర్పడేవి వృత్తాలు. వృత్తం అనగా చక్రం. అనగా మరల మరల పునరావృతం అయ్యేది. ఈ నియమం ప్రకారం పద్యానికి నిర్దేశించిన గురు లఘువుల గణాలు ప్రతిపాదంలో తిరిగి అవే వాడటం వల్ల వీటికి వృత్తాలని పేరు వచ్చింది. అంటే పద్యానికి నిర్దేశించిన గురులఘువులు స్థిరంగా ఉంటాయి.

ఉదా :
1. ఉత్పలమాల
2. చంపకమాల
3. శార్దూల విక్రీడితము
4. మత్తేభ విక్రీడితము

**2. జాతులు :**

ఇవి మాత్రాగణాల చేత ఏర్పడుతాయి. గురు లఘువులు స్థిరం కాదు. గణాలు పునరావృతం కావచ్చు. కాకపోవచ్చు. వీటిలో ఉపగణాలైన సూర్య, ఇంద్ర గణాలు వాడబడతాయి. యతి, ప్రాస నియమం కలిగి ఉంటాయి.

ఉదా : కందం

**3. ఉప జాతులు :**

ఇవి తెలుగుకు మాత్రమే సంబంధించిన పద్యాలు. అంటే సంస్కృత ప్రభావం లేనివి. ఇవి కూడా మాత్రలపైన ఆధారపడి ఉంటాయి. కాని జాతి పద్యాలకున్న ప్రాసనియమం వీటిలో లేదు. కాని 'ప్రాస యతి' వాడుటకు అవకాశం కలదు.

ఉదా :
1. తేటగీతి
2. ఆటవెలది
3. సీసము

ఈ విధంగా వృత్తాలు, జాతులు, ఉపజాతులు అని ఏర్పడిన పద్యాలు అసంఖ్యాకాలు.

**ప్రశ్న :**

1. పద్యభేదాలను తెలపండి?

**వృత్త పద్యాలు :**

1. ఉత్పలమాల, 2. చంపకమాల, 3. శార్దూల విక్రీడితము, 4. మత్తేభ విక్రీడితము

## 1. ఉత్పలమాల - లక్షణాలు

★ ఈ పద్యంలో నాలుగు పాదాలుంటాయి.

★ ప్రతి పాదంలో భ – ర – న – భ – భ – ర – వ – అనే గణాలుంటాయి.

★ యతిస్థానం - 10వ అక్షరం

★ ప్రాస నియమం ఉంటుంది

★ ప్రతిపాదంలో మొత్తం 20 అక్షరాలు ఉంటాయి.

ఉదా : భూషలు కావు మర్త్యులకు భూరిమయాంగదతారహారముల్
భూషితకేశ పాశ మృదు పుష్ప సుగంధ జలాభిషేకముల్

| భ | ర | న | భ | భ | ర | వ |
|---|---|---|---|---|---|---|
| UII | UIU | III | UII | UII | UIU | IU |
| భూ ష లు | కా వు మ | ర్త్యు ల కు | భూ రి మ | యాం గ ద | తా ర హా | ర ముల్ |

యతి : భూ – భూ 10 వ అక్షరం

ప్రాసాక్షరాలు : ష, షి వరుసగా రెండు పాదాల్లోని రెండో అక్షరాలవి.

## 2. చంపకమాల - లక్షణాలు

★ ఈ పద్యంలో నాలుగు పాదాలుంటాయి.

★ ప్రతి పాదంలో న – జ – భ – జ – జ – జ – ర అనే గణాలుంటాయి.

★ యతిస్థానం - 11వ అక్షరం

★ ప్రాస నియమం ఉంటుంది

★ ప్రతిపాదంలో మొత్తం 21 అక్షరాలు ఉంటాయి.

ఉదా : తెలివి యొకింత లేని యెడ దృప్తుడనై కరిభంగి సర్వమున్
దెలిసితినంచు గర్వితమతిన్ విహరించితి దొల్లి యిప్పుడున్

| న | జ | భ | జ | జ | జ | ర |
|---|---|---|---|---|---|---|
| III | IUI | UII | IUI | IUI | IUI | UIU |
| తె లి వి | యొ కిం త | లే ని యె | డ దృ ప్తు | డ నై క | రి భం గి | సర్వమున్ |

యతి : తె – దృ, 11 వ అక్షరం

ప్రాసాక్షరాలు :లి – లి వరుసగా రెండు పాదాల్లోని రెండో అక్షరాలవి.

**ప్రశ్న :**

1. ఉత్పలమాల వృత్త పద్య లక్షణాలను ఉదాహరణ పూర్వకంగా తెల్పండి?

## 3. శార్దూలం - లక్షణాలు

★ ఈ పద్యంలో నాలుగు పాదాలుంటాయి.

★ ప్రతి పాదంలో మ – స – జ – స – త – త – గ అనే గణాలుంటాయి.

★ యతిస్థానం – 13వ అక్షరం

★ ప్రాస నియమం ఉంటుంది

★ ప్రతిపాదంలో మొత్తం 19 అక్షరాలు ఉంటాయి.

ఉదా : ఆరంభింపరు నీచ మానువులు విఘ్నాయాస సంత్రస్తులై
ఆరంభించి పరిత్య జింతురురు విఘ్నాయత్తులై మధ్యముల్

| మ | స | జ | స | త | త | గ |
|---|---|---|---|---|---|---|
| UUU | IIU | IUI | IIU | UUI | UUI | U |
| ఆ రం భిం | ప రు నీ | చ మా ను | వు లు వి | ఘ్నా యా స | సం త్ర స్తు | లై |

యతి : ఆ – ఘ్నా 13 వ అక్షరం

ప్రాసాక్షరాలు : రం – రం. వరుసగా రెండు పాదాల్లోని రెండవ అక్షరాలవి.

## 4. మత్తేభం - లక్షణాలు

★ ఈ పద్యంలో నాలుగు పాదాలుంటాయి.

★ ప్రతి పాదంలో స - భ - ర - న - మ - య - వ అనే గణాలుంటాయి.

★ యతిస్థానం - 14వ అక్షరం

★ ప్రాస నియమం ఉంటుంది

★ ప్రతిపాదంలో మొత్తం 20 అక్షరాలు ఉంటాయి.

ఉదా : ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారు బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో నుత్కృష్ట శాల్యోదనం

| స | భ | ర | న | మ | య | వ |
|---|---|---|---|---|---|---|
| IIU | UII | UIU | III | UUU | IUU | IU |
| ఒ క చో | నే ల ను | బ వ్వ ళిం | చు నొ క | చో నొ ప్పా | రు బూ సె | జ్జ పై |

యతి : ఒ - నొ, 14 వ అక్షరం

ప్రాసాక్షరాలు :క - క వరుసగా రెండు పాదాల్లోని రెండో అక్షరాలవి.

## జాతి పద్యం

## 5. కందం - లక్షణాలు :

★ ఇది జాతిపద్యం

★ ఈ పద్యంలో నాలుగు పాదాలుంటాయి.

★ 1, 3 పాదాలు ఒక తీరుగా, 2, 4 పాదాలు ఒక తీరుగా ఉంటాయి.

★ భ - జ - స - న ల - గ గ అనే గణాలు మాత్రమే వాడాలి.

★ 1,3 పాదాల్లో 3 గణాలు, 2, 4 పాదాల్లో 5 గణాలు ఉండి, ఒక భాగంలో 8 గణాలు, మరో భాగంలో 8 గణాలు కలిపి మొత్తం 16 గణాలు కందంలో ఉంటాయి.

★ బేసి గణాల్లో జగణం వాడరాదు

★ 6వ గణం నలం గాని – జగణం కాని వాడాలి

★ 2 – 4 పాదాల్లోని చివరి అక్షరం గురువుగా ఉండాలి.

★ ప్రాస నియమం ఉంటుంది.

**యతి :** 2, 4 పాదాల్లోని మొదటి గణం మొదటి అక్షరానికి నాల్గవ గణం మొదటి అక్షరానికి యతి చెల్లుతుంది.

ఉదా : బలవంతుడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుటమేలా?

| స | స | భ |
|---|---|---|
| IIU | IIU | UII |
| బ ల వం | తు డ నా | కే మ ని |

| నల | గగ | జ | నల | గగ |
|---|---|---|---|---|
| IIII | UU | IUI | IIII | UU |
| ప లు వు ర | తో ని | గ్ర హిం చి | ప లు కు ట | మే లా? |

యతి : ప – ప 4 వ గణం ప్రథమాక్షరం

ప్రాసాక్షరాలు :ల – లు వరుసగా రెండు పాదాల్లోని రెండో అక్షరాలవి.

**ప్రశ్న :**

1. కంద పద్య లక్షణాలను ఉదాహరణ పూర్వకంగా తెల్పండి?

**ఉప జాతి పద్యాలు :**

1. ఆటవెలది
2. తేటగీతి
3. సీసము

## 6. ఆటవెలది పద్యం - లక్షణాలు :

★ ఇది ఉపజాతి పద్యం

★ ఈ పద్యంలో నాలుగు పాదాలుంటాయి

★ 1-3 పాదాల్లో 3 సూర్యగణాలు 2 ఇంద్ర గణాలుంటాయి

★ 2-4 పాదాల్లో 5 సూర్య గణాలుంటాయి.

★ యతి ఏ పాదానికి ఆ పాదం 4వ గణం ప్రథమాక్షరం

★ ప్రాస నియమం లేదు.

★ ప్రాస యతిని వాడుకోవచ్చు

ఉదా : అనగననగ రాగమతిశయిల్లుచునుండు
తినగతినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ

| | | | | |
|---|---|---|---|---|
| న | న | గల | నగ | సల |
| III | III | UI | IIIU | IIUI |
| అ న గ | న న గ | రా గ | మ తి శ యి | ల్లుచునుండు |

| | | | | |
|---|---|---|---|---|
| న | న | గల | గల | గల |
| III | III | UI | UI | UI |
| తి న గ | తి న గ | వే ము | తి య్యు | నుం డు |

యతి : మొదటి పాదంలోని మొదటి గణంలో మొదటి అక్షరం 'అ', నాల్గవ గణంలోని మొదటి అక్షరం 'మ'లకు యతి చెల్లింది. అదే విధంగా రెండవ పాదంలో 'తి' - 'తి' లకు యతి చెల్లింది.

ప్రాస : ఉపజాతి పద్యంలో ప్రాస లేదు.

## 7. తేటగీతి పద్యం - లక్షణాలు :

★ ఇది ఉపజాతి పద్యం

★ ఈ పద్యంలో నాలుగు పాదాలుంటాయి

★ ప్రతి పాదంలో 1 సూర్య గణం - 2 ఇంద్ర గణాలు - 2 సూర్య గణాలుంటాయి.

★ యతి ఏ పాదానికి ఆ పాదం 4వ గణం ప్రథమాక్షరం

★ ప్రాస నియమం లేదు.

★ ప్రాస యతిని వాడుకోవచ్చు

ఉదా : సంపదలు గల్గుతరి మహా జనుల హృదయ
మభినవోత్పల కోమలంబై తనర్చు

| గల | సల | నగ | న | న |
|---|---|---|---|---|
| UI | IIUI | IIIU | III | III |
| సం ప | ద లు గ ల్గు | త రి మ హా | జ ను ల | హృ ద య |

యతి : మొదటి పాదంలో స – జ లకు, యతి చెల్లింది.

ప్రాస : ఉపజాతి పద్యంలో ప్రాస లేదు.

## 8. సీస పద్యం – లక్షణాలు :

★ ఇది ఉపజాతి పద్యం

★ ఈ పద్యంలో నాలుగు పెద్ద పాదాలుంటాయి. సౌలభ్యం కోసం ప్రతి పాదాన్ని 2 భాగాలుగా విభజిస్తారు.

★ ప్రతి పాదానికి 6 ఇంద్ర గణాలు, 2 సూర్య గణాలుంటాయి.

★ ప్రతి చిన్న పాదంలోను మొదటి గణం మొదటి అక్షరానికి మూడవ గణం మొదటి అక్షరానికి యతి చెల్లుతుంది.

★ ప్రాస నియమం లేదు

★ ప్రాస యతి వాడవచ్చు.

★ సీస పద్యం ముగిసిన తర్వాత ఆటవెలది పద్యం గాని, తేటగీతి పద్యం గాని తప్పక రాయాలి.

ఉదా : మేఘాల నర్తించు మెరుపు తీగను దించి
యింటికి దివ్వెగావించెనెవడు

| త | త | నగ | సల |
| --- | --- | --- | --- |
| UUI | UUI | IIIU | IIUI |
| మే ఘూ ల | న ర్తిం చు | మె రు పు తీ | గ ను దిం చి |

| భ | ర | హ | న |
| --- | --- | --- | --- |
| UII | UIU | UI | III |
| యిం టి కి | ది వ్వె గా | విం చె | నె వ డు |

యతి : పై పెద్ద పాదం 2 చిన్న పాదాలుగా విభజించబడిన తర్వాత ప్రతి చిన్న పాదంలోను మొదటి గణం మొదటి అక్షరానికి మూడవ గణం మొదటి అక్షరానికి యతి చెల్లింది. అవి మే – మె, యిం – విం

ప్రాస : ఉపజాతి పద్యంలో ప్రాస లేదు.

**ప్రశ్న :**

1. సీస పద్య లక్షణాలను ఉదాహరణ పూర్వకంగా తెల్పండి?

# 19. అలంకారాలు

మానవులకు అందాన్ని కలిగించేవి లేదా సౌందర్యాన్ని తెచ్చిపెట్టేవి అలంకారాలు. అలాగే ఒక కావ్యానికి గానీ, భాషకు గానీ మరింత శోభను లేదా రమ్యతను కలిగించే వాటిని అలంకారాలు అంటారు. ఇది కేవలం అలంకారాలుగానే కాక, చెప్పే విషయాన్ని చక్కగా అర్థం చేసుకొనుటకు సహాయపడతాయి.

**అలంకారాలు రెండు రకాలు.**

1. శబ్దాలంకారాలు, 2. అర్థాలంకారాలు

1. శబ్దాలంకారాలు : శబ్దం ప్రధానంగా గల అలంకారాలను శబ్దాలంకారాలు అంటారు.

2. అర్థాలంకారాలు : అర్థం ప్రధానంగా కలిగిన అలంకారాలను అర్థాలంకారాలు అంటారు.

అర్థాలంకారాలలోని ఆరు ప్రధానమైన అలంకారాలను గురించి తెలుసుకుందాం.

అవి

1. ఉపమాలంకారం
2. ఉత్ప్రేక్షాలంకారం
3. రూపకాలంకారం
4. అతిశయోక్తి అలంకారం
5. స్వభావోక్తి అలంకారం
6. అర్థాంతరన్యాసాలంకారం

## 1. ఉపమాలంకారం :

ఉపమేయానికి, ఉపమానానికి చక్కని పోలిక చెప్పితే దానిని ఉపమాలంకారం అంటారు.

ఈ అలంకారంలో ప్రధానంగా నాలుగు లక్షణాలుంటాయి.

అవి :

1. ఉపమేయం
2. ఉపమానం
3. సమాన ధర్మం
4. ఉపమావాచకం

ఉపమేయం = ఏ వస్తువును వర్ణించదలచామో ఆ వస్తువును 'ఉపమేయం' అంటారు.

ఉపమానం = ఏ వస్తువుతో పోల్చదలచామో ఆ వస్తువును ఉపమానం అంటారు.

సమానధర్మం = ఉపమాన, ఉపమేయముల రెండిటిలో సమానంగా కలిగిన ధర్మాన్ని 'సమాన ధర్మం' అంటారు.

ఉపమావాచకం = ఉపమానానికి, ఉపమేయానికి గల సంబంధాన్ని తెలిపే పదాన్ని 'ఉపమావాచకం' అంటారు.

ఉపమేయం, ఉపమానం, సమానధర్మం, ఉపమావాచకం అనే నాలుగు లక్షణాలు కలిగిన అలంకారాన్ని 'పూర్ణోపమాలంకారం' అంటారు.

పై నాలుగు లక్షణాలలో ఏది లోపించినా దానిని లుప్తోపమాలంకారం అంటారు.

ఉదా :

'ఎప్పుడు సంపద గలిగిన
యప్పుడు బంధువులు వత్తురది యెట్లన్నన్
తెప్పలుగ చెరువు నిండిన
కప్పలు పదివేలు జేరు గదరా సుమతీ.'

వివరణ : పై పద్యంలో ఉపమేయం = బంధువులు, ఉపమానం = కప్పలు; సమానధర్మం = సంపదలు కలుగుట, చెరువు నిండుట; ఉపమావాచకం = ఎట్లన్నన్

ఈ ఉదాహరణలో, బంధువుల స్వభావాన్ని వర్ణించడానికి కవి అలాంటి స్వభావాన్ని కలిగిన కప్పలను చక్కని పోలికతో చెప్పాడు. కనుక ఇది ఉపమాలంకారం.

**ప్రశ్న :**

1. ఉపమాలంకారాన్ని లక్ష్య లక్షణ సమన్వయం చేయండి?



**ఉత్ప్రేక్షాలంకారం :**

ఊహ ప్రధానంగా కలిగిన అలంకారాన్ని ఉత్ప్రేక్షాలంకారం అంటారు.

ఉపమాన ధర్మం సామ్యం చేత ఉపమేయాన్ని ఉపమానంగా ఊహిస్తే దానిని ఉత్ప్రేక్షాలంకారం అంటారు.

ఉదా : 'ఆమె స్వరం కోకిల స్వరమా అన్నట్లు ఉన్నది'.

వివరణ : పై ఉదాహరణలో ఉపమాన, ఉపమేయముల మధ్య ఊహను ప్రధానంగా చెప్పడం జరిగింది.

'ఆమె స్వరం' అనే ఉపమేయ వస్తువును, కోకిల స్వరమనే ఉపమానంగా ఊహించడం జరిగింది. కావున దీనిని ఉత్ప్రేక్షాలంకారం అంటారు.

**ప్రశ్న :**

1. ఉత్ప్రేక్షాలంకారాన్ని లక్ష్య లక్షణ సమన్వయం చేయండి?

**రూపకాలంకారం :**

ఉపమాన, ఉపమేయములకు భేదం లేకుండా చెప్పడం గాని, ఉపమేయంలో ఉపమాన ధర్మాన్ని ఆరోపించడం గాని రూపకాలంకారం అంటారు.

ఉపమాన వస్తువులో ఉన్న ధర్మాలను, మనం వర్ణించ తలచిన ఉపమేయ వస్తువుతో అభేదంగా చెప్పితే దానిని రూపకాలంకారం అంటారు.

ఉదా : 'విద్య యశస్సు, భోగకరి, విద్య గురుండు, విదేశబంధుడున్'

వివరణ : పై పద్య పాదంలో 'విద్య' అనే ఉపమేయమునకు 'యశస్సు', 'భోగకరి', 'గురుండు', 'విదేశ బంధుడు' అనే ఉపమానములతో అభేదం చెప్పబడింది కావున ఇది రూపకాలంకారం.

**ప్రశ్న :**

1. రూపకాలంకారాన్ని లక్ష్య లక్షణ సమన్వయం చేయండి?



**4. అతిశయోక్తి అలంకారం :**

గోరంత విషయాన్ని కొండతలుగా చేసి చెప్పడాన్ని అతిశయోక్తి అలంకారం అంటారు.

ఉదా : 'ఆ పురమందలి మేడలు ఆకాశాన్ని అంటుతున్నవి'.

వివరణ : పై ఉదాహరణలో 'మేడలు' ఎత్తులో ఉన్నాయి అనే భావాన్ని వ్యక్తం చేయడానికి, ఆకాశాన్ని అంటుతున్నాయని అతిశయించి, మరీ ఎక్కువ చేసి చెప్పబడింది. కావున ఇది అతిశయోక్తి అలంకారం.

**ప్రశ్న :**

1. అతిశయోక్తి అలంకారాన్ని లక్ష్య లక్షణ సమన్వయం చేయండి?



**5. స్వభావోక్తి అలంకారం :**

జాతి, గుణ, క్రియాదుల చేత దాని స్వభావాన్ని సహజ సుందరంగా వర్ణించడాన్ని స్వభావోక్తి అలంకారం అంటారు.

ఉదా : "చిన్ని చీమలు నోట మన్నును గొని తెచ్చి

కట్టిన అందాల పుట్ట చూడు
మిల మిల మెరిసెడు జిలుగు దారములతో
కూర్చిన సాలీని గూడు చూడు."

వివరణ : పై ఉదాహరణలో చీమలు పుట్టను నిర్మించడాన్ని సహజ సిద్ధంగా వర్ణించడం జరిగింది. అలాగే సాలిపురుగు గూడును సుందరంగా, సహజరీతిలో చెప్పడం జరిగింది. కావున ఇది స్వభావోక్తి అలంకారం.

**ప్రశ్న :**

1. స్వభావోక్తి అలంకారాన్ని లక్ష్య లక్షణ సమన్వయం చేయండి?



## 6. అర్థాంతరన్యాసాలంకారం :

'సామాన్యం చేత విశేషం గాని, విశేషం చేత సామాన్యం గానీ సమర్థించబడితే దానిని అర్థాంతరన్యాస అలంకారం అంటారు.

ఉదా : 1. హనుమంతుడు సముద్రమును దాటెను.
మహాత్ములకు సాధ్యము కానిది ఏమున్నది?

2. గొప్పవారితో కలిసి ఉండడం వల్ల అల్పులకు కూడా గౌరవం లభిస్తుంది.
పూలతో దారం కూడా తలకెక్కుతుంది కదా!

మొదటి ఉదాహరణలో 'హనుమంతుడు సముద్రమును దాటెను' అన్న విశేషాంశం 'మహాత్ములకు సాధ్యం కానిది ఏమున్నది' అనే సామాన్యాంశంతో సమర్థించబడింది.

రెండవ ఉదాహరణలో గొప్పవారితో కలిసి ఉండడం వల్ల అల్పులకు కూడా గౌరవం లభిస్తుంది అన్న సామాన్యాంశం పూలతో దారం కూడా తలకెక్కుతుంది కదా! అన్న విశేషం చేత సమర్థించబడింది. కావున దీనిని అర్థాంతరన్యాసాలంకారం అంటారు.

**ప్రశ్న :**

1. అర్థాంతరన్యాసాలంకారాన్ని లక్ష్య లక్షణ సమన్వయం చేయండి?



